అపరాధ పరిశోధన అనుబంధం—39

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## పారిపోయిన సైంటిస్టులు

రచన : అజీజ్

## దొంగనోట్లు-దొరబిడ్డలు

రచన : యం. కె. వి. శాస్త్రి

## పాము కాటు

రచన : హుస్సేన్ బాషా

## ముప్పదిముగ్గురు బానిసలు

రచన : ఎల్. రామ్‌గోపాల్

'శాన్కోరా' సీరియల్-నాలుగవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—39
మార్చి, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్‌రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

# పారిపోయిన సైంటిస్టులు

అజీజ్

"డియర్ రాజారెడ్డీ! మద్రాసు నించి మిమ్మల్ని ఉన్న పళంగా దేనికి పిలిపించేమో బహుశా మీరు ఊహించి ఉంటారు. అత్యంత రహస్యమైన, ప్రమాదకరమైన ఒక మిషన్ మీద మిమ్మల్ని పంపబోతున్నాం." అంటూ బల్ల సొరుగు లాగి, అందులోంచి రెండు కేబినెట్ సైజు ఫోటోలు తీసి రాజారెడ్డి ముందుకి చాచేడు స్పెషల్ బ్రాంచ్ డైరెక్టర్ పినాక్ పాణి.

ఫోటోలు అందుకుని పరీక్షగా చూసేడు రాజారెడ్డి. మొదటి ఫోటోలో ఉన్న వ్యక్తికి నలభై ఏళ్ళుంటాయి. బట్ట తల, వెడల్పాటి మొహం, క్లీన్ షేవ్. మత్తుగా చూసే కళ్ళు, ఫోటో వెనక అతని పేరు రాసి ఉంది.

ప్రొఫెసర్ అగర్వాల్.
(బయోలజిస్ట్)

రెండో ఫోటోలో ఉన్న వ్యక్తికి ఏభై ఏళ్ళుంటాయి. బక్కపల్చని మొహం. కోటేరు ముక్కు. అస్తవ్యస్తంగా పెరిగిన జుత్తు, గడ్డం, మీసాలు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టుండే లోతైన కళ్ళు, ఫోటో తిప్పి అతని పేరు చూసేడు రాజారెడ్డి.

ప్రొఫెసర్ బీరేంద్రనాథ్ ముఖర్జీ.
(కెమిస్ట్)

"వీళ్ళిద్దరూ ప్రఖ్యాత సైంటిస్టులు. పదేళ్ళ క్రితం మన ప్రభుత్వ లేబరేటరీలో ఒక ప్రత్యేకమైన ప్రాజెక్ట్ మీద రిసెర్చ్ జేసేవాళ్ళు.

ఒకరోజు హఠాత్తుగా, ఆ ప్రాజెక్ట్ తాలూకు రహస్య పత్రాలతో ఇద్దరూ మాయమయ్యేరు. మన ఏజెంట్లు ఎంత గాలించినా వీళ్ళ జాడ దొరకలేదు.

కాని, ఈమధ్యే మాకు తెలిసింది వీళ్ళ ఆచూకీ. ఇప్పుడు వీళ్ళిద్దరూ స్వపరిపాలితమైన ఒక స్వతంత్ర దీవిలో, అక్కడి పౌరసత్వం సంపాదించి రహస్యంగా ఉంటున్నారు.

ఆ దీవిపేరు 'కర్కాయి' ఆ ద్వీపం హిందూమహా సముద్రంలో ఇటు జావా దీవులకీ, అటు న్యూజిలాండ్‌కీ మధ్య ఉంది. దాదాపు వందమైళ్ళ పొడవూ, డెభై మైళ్ళ వెడల్పూ గల ఆ దీవి జనాభా సంఖ్య పది లక్షలు.

ఒకప్పుడు దానిపై పోర్చుగీస్ అధికారం ఉండేది. పదేళ్ళ క్రితం ఆ దీవికి స్వాతంత్ర్యం లభించింది. కాని, ప్రజాప్రభుత్వం మూడేళ్ళు మాత్రమే సాగింది. ఇప్ప

డక్కడ మిలటరీ ప్రభుత్వం అధికారంలో ఉంది. జనరల్ ఫెర్నాండెజ్ దానికి నియంత.

ఆ దీవి రాజధాని పేరు 'కాలింగ్.' ఆ నగరాన్ని ఆనుకునే ఓడరేవు ఉంది. కాలింగ్‌కు ఇరవై మైళ్ళ దూరంలో 'వాస్కా' అనే సరస్సు ఉంది. ఆ సరస్సు అవలి ఒడ్డున ఓ అడవి ప్రారంభమౌతుంది. ఆ అడవిలోనే ఎంతో కట్టుదిట్టంగా కట్టిన ఓ బిల్డింగ్ ఉంది.

ఆ బిల్డింగే ఇప్పుడు ప్రపంచ ప్రజలందరికీ ప్రమాదకరంగా తయారయింది. కారణం, ఈ యిద్దరు సైంటిస్టులూ, ఆ బిల్డింగ్‌లోనే అత్యంత భయంకరమైన ఒక గ్యాస్ తయారు చేస్తున్నారు. ఆ గ్యాస్ పేరు ఎఫ్ నైన్!

ఆ గ్యాస్ వల్ల మనుషులు మరణించరు. మూర్ఛపోరు. కాని, అంతకంటే భయంకరమైన పరిణామాలకి గురి అవుతారు. ఆ గ్యాస్ ప్రయోగించిన పదిహేను నిమిషాల లోపున మనిషి మెదడులోని జ్ఞాపకశక్తి పూర్తిగా తుడిచి వెయ్యబడుతుంది. తను ఎవ్వరో, తన పేరేమిటో, తనవాళ్ళెవ్వరో ఏమీ తెలీకుండా మనిషి అప్పుడే పుట్టిన పసివాడిలా మారిపోతాడు.

ఆ గ్యాస్‌ని ఒక సైన్యం మీదగానీ, నగరం మీద గానీ, వదిలితే గంట లోపల పూర్తి సైన్యం, జ్ఞాపకశక్తిని కోల్పోయి పిచ్చిదై పోతుంది. అందుకే, జనరల్ ఫెర్నాండెజ్ ఆ గ్యాస్ ద్వారా పూర్తి ఏషియాను కబళించాలనే కలలు కంటున్నాడు. ఒకవిధంగా ఆలోచిస్తే ఆ గ్యాస్ ఆటంబాంబు, హైడ్రోజన్ బాంబుల కంటే అతి ప్రమాదకరమైనది.

మా అంచనా ప్రకారం మరో నాలుగు నెలల్లో అది

పూర్తిగా తయారై, జనరల్ ఫెర్నాండెజ్ వాడుకో డానికి సిద్ధం ఉంటుంది.

అది జరక్కముందే ఆ లేబరేటరీని ధ్వంసం చెయ్యాలి. దేశద్రోహులైన ఆ ఇద్దరు సైంటిస్టులనీ సజీవంగా బంధించి ఇక్కడికి తీసుకు రావాలి. దీనికి ఎంత ఖర్చైనా సరే వెనుకాడ వద్దు. మీకు సహాయంగా ఎంతమంది కావలసినా మీ వెంట తీసికెళ్ళ వచ్చు.

అంతే కాదు, ఆ దీవికి ముప్ఫై మైళ్ళ దూరంలో సముద్రం మధ్య, మన నౌకా దళానికి చెందిన ఓ నౌక రెడీగా ఉంటుంది. మీకెప్పుడే సహాయం కావాలసినా అందించడానికి'' అన్నాడు పినాక్ పాణి.

అంతావిన్న రాజారెడ్డి వెంటనే పలకలేదు. సిగరెట్ అంటించి కాసేపు తీవ్రంగా ఆలోచించి తలెత్తేడు.

''ఆల్ రైట్! నా వెంట ముగ్గుర్ని తీసికెళ్తాను. నా అసిస్టెంట్ డేవిడ్, లేడీ ఇన్వెస్టిగేటర్ షీలా, మీ శాఖలో అనుభవజ్ఞుడైన ఎలక్ట్రానిక్ ఇంజినీర్ పృథ్వీ రాజ్ మా వెంట ఉంటాడు.''

పినాక్ పాణి తలూపేడు. ''మీ అంచనా సరైనదే! మీకు ఎవ్వరు కావలసినా, ఏ వస్తువు కావలసినా, ఎంత డబ్బు అవసరమైనా, క్షణాలమీద ఏర్పాటు చెయ్యగలను.''

రాజారెడ్డి కాస్త ముందుకి వంగి, తన ప్లాన్ ఏమిటో పినాక్ పాణికి వివరించ సాగేడు.

## 2

అది కర్ కాయీ ద్వీపరాజధాని కాలింగ్ లోని ఖరీదైన హోటల్ 'బర్ యోడా'.

ఆ హోటల్లో దిగేవాళ్ళందరూ ధనవంతులైన విదేశీ యాత్రీకులే. సరిగ్గా ఉదయం తొమ్మిది గంటలకి ఓటాక్సీ వచ్చి ఆహోటల్ ముందాగింది. అందులోంచి దిగిన ఓపాతికేళ్ళ యువతి, హాండ్ బాగ్ ఊపుకుంటూ ఒయ్యారంగా అడుగులు వేస్తూ, హోటల్లో ప్రవేశించగానే, అక్కడ కూర్చున్న వాళ్ళందరి దృష్టి ఆమె వైపు మళ్ళింది.

భుజాలవరకూ కత్తిరించుకున్న జుత్తు. పెదాలకి లిప్ స్టిక్ ఎర్రని గౌన్ కింద, తెల్లగా బలిసిన తొడలు. కళ్ళకి కూలింగ్ గ్లాసెస్. ఆమె అడుగులకి లయగా కదులుతున్న పిరుదులూ, బంతులూ అక్కడ కూర్చున్న వాళ్ళందర్నీ రెప్ప వెయ్యకుండా జేస్తున్నాయి.

హంసలా నడుస్తూ తన వైపు వస్తున్న ఆ యువతిని కన్నార్పకుండా చూస్తున్నాడు కౌంటర్ క్లర్కు.

ఆమె తిన్నగా అతని దగ్గరి కెళ్ళి "హల్లో! బహుశా ఈ పాటికి నా రూం రిజర్వేషన్ జరిగి ఉంటుందనుకుంటాను." అంది అచ్చు యూరోపియన్ స్టయిల్ ఇంగ్లీషులో.

అతను ఉలిక్కిపడి—"మీ పేరు?" అన్నాడు.

"మిస్ లోరెన్స్!"

"ఓ, ఎస్. ఎస్!" అతను గబగబ రిజిస్టర్ తిరగేసి ఆమె ముందుకుతోసి "వీరి సామాను థర్డ్ ఫ్లోర్లో, రూం నెంబర్ పదహారులో పెట్టు" అన్నాడు హోటల్ బాయ్‌తో.

ఆ యువతి రిజిస్టర్లో సంతకం పెట్టి, ఎడ్వాన్స్ పేజేసి నడుం ఊపుకుంటూ లిఫ్ట్ వైపు నడిచింది. అక్కడ

కూర్చున్న వాళ్ళందరి కళ్ళల్లోను ఆకలి నాట్యం జెయ్యడం కూలింగ్ గ్లాసెస్ లోంచి గమనించి, లోలోన నవ్వుకుంది.

ఆమె, మారువేషంలో ఉన్న లేడీ ఇన్వెస్టిగేటర్ షీలా!

*　　　*　　　*

సరిగ్గా పది గంటలకి హోటల్ ముందు ఓ ఇంపాలా టాక్సీ వచ్చి ఆగింది.

ఫ్రంట్ సీట్లోంచి ఫుల్ సూటులో ఉన్న ఓ వ్యక్తి దిగి, బాక్ డోర్ తెరిచి పట్టుకున్నాడు.

అందులోంచి అరబ్బు దుస్తుల్లో ఉన్న ఓ వ్యక్తి దిగేడు పిల్లి గడ్డం, అందంగా కట్ చేసిన మీసాలు. కళ్ళకి నల్లని అద్దాలు. తలమీద తెల్లని బట్ట. దాని చుట్టూ ఉన్న నల్లని రోబ్స్ మధ్య సరిగ్గా పాలభాగం దగ్గర ధగ ధగ మెరుస్తున్న ఖరీదైన డైమండ్. నడుం దగ్గర బంగారు పిడి గల చిన్న కైజారు.

ముందు సీటులో ఉన్న వ్యక్తి గబగబ హోటల్లోకి ప్రవేశించేడు. అతని వెనకే అడుగులో అడుగు వేసు కుంటూ ఆ అరబ్బు దుస్తుల్లో ఉన్నతను లోనికి వచ్చి తలుపు దగ్గర ఆగిపోయేడు.

సూటులో ఉన్న వ్యక్తి కౌంటర్ దగ్గరకెళ్ళి "కువైట్ నించి మేమిచ్చిన టెలిగ్రాం బహుశా మీకంది ఉంటుంది. ప్రిన్స్ ఖాసిమ్ ఉలేమాన్ గారి గది సిద్ధం చేశారా?" అడిగేడు తగ్గు స్వరంతో.

కౌంటర్ క్లర్క్ తల త్రిప్పి ప్రిన్స్‌నీ, అతని పాల భాగం మీద మెరుస్తున్న డైమండ్‌నీ, నడుంకి వేలాడు తున్న కైజారునీ చూడగానే చటుక్కున లేచి నిల్చుని-

"మీ టెలిగ్రాం అందగానే, మా హోటల్లో ప్రముఖుల కోసం ఏర్పాటుచేసే గది రిజర్వు చేశాం. ఉండండి, మేనేజర్ గార్ని పిల్చుకొస్తాను" అంటూ హడావుడిగా లోపల కెళ్ళేడు.

రెండు నిమిషాల తర్వాత హోటల్ మేనేజర్ పరిగెత్తుకు వచ్చి అరబ్బు పద్ధతిలో వంగి వంగి సలాములు చేస్తూ "రాజవంశీయులకు సుస్వాగతం!" అన్నాడు.

ప్రిన్స్ ఖాసిమ్ ఉలేమాన్ అరబ్బు భాషలో తీక్షణంగా ఏదో అని తలూపేడు.

ప్రిన్స్ వెంట వచ్చిన వ్యక్తి మేనేజర్ని సమీపించి, తగ్గు స్వరంతో—"ఈ రోజు ప్రిన్స్ కాస్త కోపంలో ఉన్నారు. మేము కువైట్ నించి బైలుదేరిన జెట్ విమానం కొలంబో ఏర్‌పోర్ట్‌లో ట్రబుల్ ఇవ్వడంతో, విధిలేక ఇతర ప్రయాణీకులతో కూర్చుని అమెరికన్ విమానంలో రావలసివచ్చింది. అప్పటినించే ప్రిన్స్ మూడ్ కాస్త చెడిపోయింది.

దానికి తోడు, ఇక్కడి కస్టమ్స్ ఆఫీసర్లు మంచీ మర్యాదా లేకుండా ప్రిన్స్ సామాను తనిఖీ జెయ్యాలని పట్టు బట్టడంతో ఆయన కోపం తారాస్థాయి నందుకుంది. పరాయి దేశం గనక బ్రతికిపోయేరు. అదే మాదేశమై ఉంటే ఈ పాటికి వాళ్ళ తలలు ఎగిరి పోయుండేవి.

ఆయనపట్ల ఏమాత్రం అమర్యాద జరిగినా సహించరు. మీ హోటల్లో అటువంటి సంఘటనేదీ జరగదని ఆశిస్తున్నాను" అన్నాడు.

"ఎంతమాట, ఎంతమాట అలా జరగనిస్తామా? ఇక్కడ వారి అడుగులకి మడుగులొత్తబడతాయి. మీరీ

విషయంలో నిశ్చింతంగా ఉండండి,'' అన్నాడు హోటల్ మేనేజర్ వినయం ఒలకబోస్తూ.

''కొద్దిసేపట్లో ఏర్‌పోర్ట్‌నించి సామాన్లతో నిండిన మూడు టాక్సీలు వస్తాయి. వానిని జాగ్రత్తగా ప్రిన్స్ గదికి చేరవెయ్యండి.''

''అలాగే! ఆ పనంతా మాకు వదిలెయ్యండి,'' అంటూ మేనేజర్ కౌంటర్‌మీద రిజిస్టర్ అందుకుని—''క్షమించండి. ఇక్కడి వేధపరూల్సు కొన్ని ఉన్నాయి. అందుకనీ...'' అంటూ నీళ్ళు నములుతూ రిజిస్టర్ని సూటువాలా ముందుకి చాపేడు.

అతనా రిజిస్టర్ అందుకుని, ఇద్దరి పేర్లూ నింపేడు.

ఖాసిమ్ ఉలేమాన్-ప్రిన్స్ ఆఫ్ కువైట్.
ఖుద్రతుల్లా సూడానీ- ప్రిన్స్ సెక్రటరీ.

మేనేజర్ రిజిస్టర్ అందుకునీ- ''దీనిమీద గౌరవనీయులైన ప్రిన్స్ సంతకం కూడా చేశారంటే, మా మీద దయ చూపిన వారౌతారు,'' అన్నాడు తడబడుతూ.

సూటువాలా ప్రిన్స్ వైపు తిరిగి అరబ్బీ భాషలో ఏదో అన్నాడు. ప్రిన్స్ తీక్షణంగా ఏదో అని, తన చేతివేలికి ఉన్న ఓ ఉంగరం తీసిచ్చేడు. అప్పుడు చూసేడు మేనేజర్, ప్రిన్స్ రెండు చేతివేళ్ళకీ ఉన్న ధగ ధగ మెరిసే వజ్రపుటుంగరాలని.

అతను తీసిచ్చిన ఉంగరం మీద, అరబ్బు భాషలో ఏదో చెక్కి ఉంది. సూటువాలా, జేబులోంచి స్టాంప్ పేడ్ తీసి ఉంగరాన్ని ముద్రగా రిజిస్టర్‌లో సంతకం ఉండవలసిన చోట వేసేడు.

ఇంతలో మూడు టాక్సీలు వచ్చి హోటల్ ముందు

ఆగేయి. వాటిలో సూట్ కేస్ లూ, ఏర్ బ్యాగ్ లూ ఇతర సామాన్లూ నిండి ఉన్నాయి. మేనేజర్ వెంటనే నౌఖరు బలగానికి వాటిని జాగ్రత్తగా పైకి తీసికెళ్ళమని ఆజ్ఞాపించి, ప్రిన్స్ కి దారి చూపిస్తూ లిఫ్ట్ వైపు తీసికెళ్ళాడు.

ప్రిన్స్ వేషంలో ఉన్నది డేవిడ్!

అతని సెక్రటరీ రూపంలో ఉన్న వ్యక్తి, ఎలక్ట్రానిక్ ఇంజనీర్ పృథ్వీరాజ్.

* * *

సరిగ్గా పదకొండు గంటలకి ఓ టాక్సీ వచ్చి హోటల్ ముందు ఆగింది. అందులోంచి ఖరీదైన ఫుల్ సూటులో దిగిన వ్యక్తి, డ్రైవర్ కి మీటర్ బిల్ పేజేసి, బూట్సు టక టక లాడిస్తూ హోటల్లో ప్రవేశించేడు.

తిన్నగా కౌంటర్ దగ్గరికెళ్ళి- "వారం రోజుల క్రితం జకార్తా నుంచి ఈ హోటల్లో ఓ రూం రిజర్వ్ జెయ్యమని టెలిగ్రాం ఇచ్చేను. అందిందా?" అడిగాడు క్లర్క్ తో.

క్లర్క్ అతన్ని పరీక్షగా చూసి- "మీ పేరు?" అన్నాడు.

"ఆర్నో! ఫ్రం ఇండోనేషియా!"

"అందింది మిస్టర్ ఆర్నో! గ్లాడ్ టు సీయూ!" అన్నాడు క్లర్క్ అతనికి షేక్ హేండ్ ఇస్తూ.

అతనే రాజారెడ్డి!

అంతకిముందు అతన్ని చూసిన వాళ్ళెవ్వరూ ఇప్పుడు గుర్తించడం కష్టం. ఎంతో అనుభవ పూర్వకంగా అతని కళ్ళు మామూలు కంటే కాస్త చిన్నవి జెయ్యబడ్డాయి. కనుబొమలు ఇంకాస్త దట్టంగా అతికించబడ్డాయి. ఎవ్వరైనా కళ్ళెత్తి అతన్ని చూస్తే, నిజంగా ఇండోనీషియన్ అన్న భ్రాంతి కలుగుతుంది.

కౌంటర్ క్లర్క్ రిజిస్టర్ తెరిచి అతని ముందుకి తోశాడు. రాజారెడ్డి అందులో తన నకిలీ పేరు రాసి, అడ్రస్ కాలమ్‌లో ఇండొనేషియాలోని పేరుపొందిన ఓ కెమికల్ సంస్థ పేరు రాసేడు. ఆ సంస్థ తయారుజేసే కెమికల్స్ విదేశాలకి ఎగుమతి జెయ్యబడతాయి.

క్లర్క్ బోయ్‌ని పిలిచి_ "వీరి సామాను సెకెండ్ ఫ్లోర్‌లోని 7వ నెంబరు గదిలో పెట్టు" అన్నాడు.

## 3

భారత స్పెషల్ బ్రాంచ్ డైరెక్టర్ పినాక్‌పాణి ఇచ్చిన సమాచారం ప్రకారం, ఆ హోటల్‌కి ఫర్లాంగు దూరంలో పంట తెగుళ్ళని నివారించడానికి మందులు తయారుజేసే ఓ ఫర్మ్ ఉంది. ప్రొఫెసర్ అగర్వాల్ దానికి డైరెక్టర్!

మధ్యాహ్నం సరిగ్గా రెండు గంటలకి ఓ టాక్సీలో తిన్నగా మినిస్ట్రీ ఆఫ్ కామర్స్ ఆఫీస్ జేరుకున్నాడు రాజారెడ్డి. విజిటింగ్ కార్డు పంపిన కొద్ది నిమిషాలకే పిలుపు వచ్చింది లోపలినించి.

మినిస్ట్రీ ఆఫ్ కామర్స్ సెక్రటరీ అతన్ని సాదరంగా లోనికి ఆహ్వానించి కూర్చోబెట్టేడు.

"వారం రోజుల క్రితం నేను రాసిన ఉత్తరం బహుశా మీకు ముట్టి ఉంటుంది. వివిధ దేశాల్లో ఉన్న నా ఫ్యాక్టరీలు రకరకాల కెమికల్స్‌ని తయారుజేసి ఎగుమతి జేస్తాయి.

ప్రస్తుతం ఈ నగర శివార్లలో ఉన్న బంజరు భూమి, మాకు కావలసిన ఒక రకం వేరుని ఉత్పత్తి జెయ్యడానికి

ఎంతో అనుకూలంగా ఉందని తెలిసింది. ఆ వేరుతో మేము ఓ ప్రత్యేకమైన కెమికల్ లిక్విడ్ తయారు చెయ్యాలి. దానితో ఒక రకం పంట తెగుళ్ళని నివారించ వచ్చు.

ఈ విషయంలో మీ ప్రభుత్వం నాతో సహకరిస్తా నంటే నేను దీనిపై రెండు కోట్లు పెట్టుబడి పెట్టగలను.'' అన్నాడు రాజారెడ్డి ఎంతో అనుభవం ఉన్న బిజినెస్ మాగ్నెట్‌లా.

సెక్రెటరీ నవ్వి- ''మా ప్రభుత్వం ఎప్పుడూ విదేశ వర్తకులకి అన్నివిధాలా సహకరిస్తూనే ఉంది. ఎటొచ్చీ వారి లాభాల్లో మాకు కొంత చెల్లించవలసి ఉంటుంది.'' అన్నాడు.

రాజారెడ్డి తలూపి, ''నాకు తెలుసు. మీ ప్రభుత్వ బిజినెస్ ప్రిన్స్‌పుల్స్ చదివేను. మీ షరతులన్నీ అంగీక రిస్తున్నాను. లాభంలో పది శాతం మాత్రం నా దేశానికి తీసికెళ్తాను. ఏమంటారు?'' అన్నాడు.

సెక్రెటరీ తలూపి_ ''అలా ఐతే మాకేమీ అభ్యం తరం లేదు!'' అన్నాడు ఆనందంగా.

''థాంక్యూ! మన ఒప్పందం మీద సంతకాలు జేసే ముందు నేనొకసారి ఆ భూమిని పరిశీలించాలను కుంటు న్నాను. దయచేసి ఓ హెలికాప్టర్ ఏర్పాటు జెయ్య గలరా?''

''హెలికాప్టరా?'' అంటూ సెక్రెటరీ తల గోక్కొని- ''దానికోసం చాల రిస్క్ తీసుకోవలసి ఉంటుంది. ఆఁ! నాకు తెలిసిన ఓ వ్యక్తి ఉన్నాడు. అతని దగ్గర స్వంత హెలికాప్టర్ ఉంది. కానీ...'' అంటూ నసిగేడు సెక్రెటరీ.

రాజారెడ్డి వెంటనే జేబులోంచి వంద వంద డాలర్ల రెండు కట్టలు తీసి_ "డబ్బుకోసం వెనుకాడ వద్దు. ఎంత ఖర్చైనా సరే ఏర్పాటు జేయించండి. ప్లీజ్!" అన్నాడు వాటిని బల్లమీద పెడుతూ.

ఐదువేల డాలర్లు చూడగానే సెక్రెటరీ కళ్ళు తళతళ మెరిసేయి. ఆ హెలికాప్టర్ ఓనర్ రోజుకి ఐదువందల డాలర్లు బాడుగ తీసుకోవచ్చు. మిగతా నాలుగున్నర వేలు తనవే!

"ఆల్ రైట్, ప్రయత్నిస్తాను. పని జరిగితే మీ గదికి ఫోన్ జేసి చెబుతాను." అన్నాడు సెక్రెటరీ నోట్లకట్టలు అందుకుంటూ.

"మరొక్క విషయం. నాకు టాక్సీల్లో తిరిగే అలవాటు లేదు. ఏదైనా కారు అద్దెకు దొరికే అవకాశం ఉందా?"

సెక్రెటరీ తలూపి_ "ఇక్కణ్నించి తిన్నగా సిటీ గ్యారేజ్ సర్వీస్‌కు వెళ్ళి, నా పేరు చెప్పండి. ఈలోగా నేను వాళ్ళకి ఫోన్ జేస్తాను. మీ కిష్టమైన కారు ఇస్తారు." అన్నాడు.

అతనికి థాంక్స్ చెప్పి లేచాడు రాజారెడ్డి.

బైటికి రాంగానే ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లో దూరి, టెలిఫోన్ డైరెక్టరీ వెదికి, ప్రొఫెసర్ అగర్వాల్ నడుపుతున్న కెమికల్ ఫర్మ్ ఆఫీస్‌కి ఫోన్ జేసేడు.

"ఎస్! కెమికో ఆఫీస్." అవతలినించి వినిపించింది.

"ప్రొఫెసర్ అగర్వాల్‌తో మాట్లాడాలి." అన్నాడు రాజారెడ్డి.

"సారీ సర్. వారిప్పుడు ఫ్యాక్టరీలో ఉన్నారు. బహుశా సాయంత్రం తిరిగి రావచ్చు. ఆయన వారంలో

నాలుగు రోజులు ఫ్యాక్టరీలో పనిచేసి, మూడు రోజులు సిటీలో గడుపుతారు.'' చెప్పేడు క్లర్క్.

''ఆయన్ని ఎక్కడ కలుసుకోడానికి వీలుంటుంది?''

''హోటల్ బర్కోడాలో వారికి ఓ పర్మినెంట్ గది ఉంది. వారంలో మూడు రోజులు ఆయన ఆ గదిలోనే గడుపుతారు. దయచేసి మీరెవ్వరో చెబితే, ఆయన వచ్చేక చెప్పగలను.''

''సరే! ఆయన్ని హోటల్లోనే కలుసుకుంటాను. సాయంత్రం ఆయన వస్తే చెప్పండి డాక్టర్ ఘోష్ ఫోన్ చేశాడని!'' అంటూ రిసీవర్ క్రెడిల్ చేసేడు రాజారెడ్డి.

పదేళ్ళ క్రితం ఆ సైంటిస్టులిద్దరూ భారత దేశంలోని ప్రభుత్వ లేబొరేటరీలో రీసెర్చి చేసేటప్పుడు, డాక్టర్ ఘోష్ ఆ లేబొరేటరీకి డైరెక్టర్‌గా ఉండేవాడు.

ఇన్నేళ్ళ తరువాత ఇప్పుడు హఠాత్తుగా ఇక్కడ డాక్టర్ ఘోష్ పేరు వినగానే ప్రొఫెసర్ అగర్వాల్‌లో భయం మొలకెత్తుతుంది. అందుకే రాజారెడ్డి ఆ పేరు చెప్పేడు.

బూత్‌లోంచి బైటికి వచ్చి, టాక్సీ ఎక్కి తిన్నగా సిటీగ్యారేజ్ సర్వీస్‌కు బైలుదేరాడు. అక్కడ ఓ షెవర్లెట్ కారు అద్దెకి తీసుకుని హోటల్ చేరుకున్నాడు. కారు పార్కింగ్‌లో ఆపి హోటల్లోకి నడిచేడు.

తిన్నగా తన గదిలోకెళ్ళి, లోపలినించి తలుపు మూసుకున్నాడు. గబగబ బాత్‌రూంలోకి ప్రవేశించి, జేబులోంచి సిగిరెట్ లైటర్ తీసేడు.

అది రెండువిధాల పనిజేసే ట్రాన్స్‌మిటర్. ఎంతో సూక్ష్మమైన స్ప్రూలతో, పరికరాలతో తయారుజెయ్య

డింది. కేవలం మూడువందల గజాల విస్తీర్ణంలో పని జేస్తుంది. అందులో ఒక ప్రత్యేకమైన ఫ్రీక్వెన్సీ ఏర్పాటు ఉంది గనక, ఇతర ట్రాన్స్‌మీటర్లేవీ దాని తరంగాలని పట్టుకోలేవు.

ఏరియల్ బైటికి లాగి, బటన్ వత్తి– "హలో!" అన్నాడు రాజారెడ్డి.

అవతలినించి డేవిడ్ కంఠం వినిపించగానే, చక చక చెప్పసాగేడు.

"ఈ రోజు సాయంత్రం ఆరు గంటల ప్రాంతంలో ప్రొఫెసర్ అగర్వాల్ ఇక్కడికి వస్తున్నాడు. ఈ హోటల్లో అతనికో పర్మినెంట్ గది ఉంది. వారంలో మూడురోజులు ఆ గదిలోనే గడుపుతాడుట.

అతను వచ్చేలోగా మన ఎలక్ట్రానిక్ ఇంజనీర్ పృథ్వీరాజ్‌కు చెప్పి, ఆ గదిలో మైక్రోఫోన్ ఏర్పాటు జేయించు. దాని ద్వారా మీ గదిలో ఉండి, ప్రొఫెసర్ గదిలో జరిగే సంభాషణంతా రికార్డ్ జేస్తుండాలి. అంతే కాదు, అతని కార్లో రహస్యంగా ఓ టైంబాంబ్ కూడా ఏర్పాటు జేయించాలి.

ఈ రాత్రి సరిగ్గా తొమ్మిదిన్నరకి నేనూ, పృథ్వీరాజ్ కెమికో ఆఫీస్‌లో దొంగచాటుగా ప్రవేశించే ప్రోగ్రాం సెట్ జేసేను. అర్థమైందా?"

"ఓ. కే. సర్!" అన్నాడు డేవిడ్ అవతలినించి.

రాజారెడ్డి ట్రాన్స్‌మీటర్ ఆఫ్ జేసి, ఏరియల్ దించి, జేబులో వేసుకున్నాడు.

## 4

సాయంత్రం సరిగ్గా ఆరు గంటలకి రెండు జీప్‌లు హోటల్ ఆవరణలో ప్రవేశించేయి. ఒకదాంట్లో స్థానిక

సెక్యూరిటీ ఆఫీసర్లూ, మరో దాంట్లో ప్రొఫెసర్ అగర్వాల్ ఉన్నారు.

పైన హోటల్ గది కిటికీలోంచి బైనాక్యులర్స్‌తో ఈ దృశ్యం చూస్తున్న డేవిడ్ వెనక్కి తిరిగి– "ప్రొఫెసర్ వచ్చేడు." అన్నాడు పృథ్వీరాజ్‌తో.

గదిలో టేబిల్ మీద రిసీవింగ్ సెట్ పెట్టుకు కూర్చున్న పృథ్వీరాజ్ తలూపేడు. అరగంట క్రితమే అతను ప్రొఫెసర్ గదిలో ఎవ్వరికీ కనిపించని స్థానంలో చిన్న మైక్రోఫోన్ అమర్చి వచ్చేడు.

డేవిడ్ తిరిగి పార్కింగ్ ప్లేస్ వైపు చూసేడు. ప్రొఫెసర్ వెంట వచ్చిన సెక్యూరిటీ ఆఫీసర్ల జీప్, అతన్ని వదిలేసి తిరిగి వెళ్ళిపోతోంది. ప్రొఫెసర్ జీప్ దిగి హోటల్ వైపు వస్తున్నాడు.

డేవిడ్ కిటికీ దగ్గర్నించి కదిలి పృథ్వీరాజ్ దగ్గరికి వచ్చి కూర్చున్నాడు. పావు గంట తరువాత, బల్ల మీది రిసీవింగ్ సెట్లోంచి ప్రొఫెసర్ కూనిరాగం వినిపించ సాగింది.

అంటే, అతను తన గదిలోకి వచ్చేడన్న మాట. కొద్ది సేపటికి ప్రొఫెసర్ ఫోన్ ఎత్తి, ఆపరేటర్‌తో ఓ నెంబర్ అడగడం వినిపించింది. అవతలినించి ఏమన్నారో వాళ్ళు వినలేక పోయేరు.

తరవాత ప్రొఫెసర్ కంఠం మారు మ్రోగింది— "ఈ రాత్రి ఎవరు దొరుకుతారు?"

జవాబు సరిగ్గా వినిపించటం లేదు.

మళ్ళీ ప్రొఫెసర్ కంఠం పలికింది. "నో.నో. లిల్లీ అంటే నాకిష్టం లేదు. ఆఁ! మేరీ ఐతే ఫరవాలేదు. ఆమె లేకుంటే

వీనస్‌ని పంపండి. నేను సరిగ్గా ఎనిమిదిన్నరకి బార్‌లోకి వస్తాను. తిరిగి పదిగంటలకి రూంకు వచ్చేస్తాను" అని రిసీవర్ క్రెడిట్ జేసిన చప్పుడు.

అంతా విన్న పృథ్వీరాజ్ సాలోచనగా తలూపి, "ప్రొఫెసర్ గ్రంథసాంగుడన్న మాట!" అన్నాడు.

"అందుకే అతను వారానికి నాలుగురోజులు కెమికో ఫర్మ్‌లో పనిజేసి, మిగతా మూడురోజులు కులాసాకోసం ఇక్కడ గడుపుతాడు. ఇప్పుడు మీ ప్రోగ్రాం ఏమిటి?" అడిగాడు డేవిడ్.

పృథ్వీరాజ్ లేచి, ఓ తోలు బాక్స్ అందుకుని భుజానికి తగిలించుకున్నాడు. అది కనిపించకుండా, పైనుంచి ఓవర్ కోట్ తొడుక్కుని—"చీకటి పడింది. మూడో కంటికి కనిపించకుండా వెళ్ళి పార్కింగ్‌లో ఆగివున్న ప్రొఫెసర్ జీప్‌లో టైం బాంబ్ ఫిట్ జేస్తాను. తరవాత, నిర్ణీత టైం ప్రకారం రాజారెడ్డిగార్ని కలుసుకోవాలి," అన్నాడు కిటికీవైపు నడుస్తూ.

## 5

సరిగ్గా ఎనిమిది గంటల ఇరవై ఎనిమిది నిమిషాలకి షీల కళ్ళు చెదర గొట్టేలా తయారై తన గదిలోంచి బైటికి వచ్చింది. గోడకి ఉన్న బటన్ వత్తి లిఫ్ట్‌ని పైకి పిలిపించింది.

లిఫ్ట్ రాగానే అందులో కాలు పెట్టబోతూ ఏదో జ్ఞాపకం వచ్చినట్టు ఆగి "ఓహ్! నా నెక్లెస్ మర్చిపోయేను. రెండు నిమిషాలు ఆగగలవా?" అంది లిఫ్ట్ బోయ్‌తో.

అతను తలూపేడు.

షీల చకచక తన గదివైపు నడిచింది.

ఇంతలో కింది అంతస్తునించి ఎవరో లిఫ్ట్‌కోసం బెల్ వత్తేరు. లిఫ్ట్‌బోయ్ పట్టించుకోలేదు. అతను షీలకోసం ఎదురు చూస్తున్నాడు.

రెండు నిమిషాల తరవాత, షీల అందమైన నెక్లెస్ మెడలో అలంకరించుకుని తిరిగివచ్చింది. అప్పటికే కింద అంతస్తులోంచి లిఫ్ట్‌కోసం ఆరుసార్లు బెల్ మోగడం జరిగింది.

లిఫ్ట్ కింద అంతస్తుకి వెళ్ళి ఆగింది. తలుపు దగ్గర ప్రొఫెసర్ అగర్వాల్ నిల్చునున్నాడు. కోపంతో అతని మొహం ఎర్రబడుంది. బాయ్‌ని ఉరిమి చూస్తూ లిఫ్ట్‌లోకి వచ్చి "ఎన్ని సార్లు బెల్ మోగించేను? నీకు..." అంటూ షీలను చూసి ఆగిపోయేడు.

ఆమెని చూడగానే అతని కళ్ళు తళతళమని మెరవసాగేయి. షీల నవ్వి—"అందులో అతని తప్పేం లేదు. నా హారం గదిలో మరిచిపోయినందుకు కాసేపు నేనే ఆగమన్నాను" అంది.

ప్రొఫెసర్ నాలికతో పెదాలు తడుపుకుని "డోంట్ వర్రీ మిస్! ఇంతకీ మీరీ హోటల్లో కొత్తగా వచ్చేరా?" అడిగేడు. షీల తలూపి "ఔను. ఈరోజే దిగేను. మీరు?" అంది ప్రశ్నార్థకంగా.

ప్రొఫెసర్ నవ్వి—"నాకిక్కడ ఓ పర్మినెంట్ గది ఉంది. అప్పుడప్పుడూ వస్తూపోతూంటాను," అన్నాడు.

షీల పర్సులోంచి చిన్న అద్దం తీసి తన మేకప్ చూసుకుంటూ "అంటే, మీకీ ద్వీపవానులే నన్న మాట!" అంది.

ప్రొఫెసర్ తలూపి, "ఔను! మీ రెక్కణ్ణించి వచ్చేరు? మీగురించి తెలుసుకోవచ్చా?" అడిగేడు.

"మాది స్విట్జర్లాండ్. నా పేరు లోరెన్స్!" అంది షీల అతనికి కళ్ళల్లోకి చూస్తూ.

"మీలాగే మీ పేరు కూడా చాలా అందంగా ఉంది. నన్ను ప్రొఫెసర్ అగర్వాల్ అంటారు. మీ వెంట ఇంకెవ్వరైనా ఉన్నారా?"

"నో.నో.! నేనొక్కదాన్నే వచ్చేను. కొన్నాళ్ళీ ద్వీపంలో కులాసాగా గడపడానికి!" అంది షీల 'కులాసా' అనే పదాన్ని వత్తి పలుకుతూ.

ప్రొఫెసర్ కళ్ళు తళ తళమన్నాయి. "ఈ రాత్రి డిన్నర్ నాతో తీసుకోడానికి మీకేమైనా అభ్యంతరమా?" అడిగేడు.

షీల నవ్వు—"నో! నాకేం అభ్యంతరం లేదు" అంది.

రాజారెడ్డి ఆదేశానుసారం, ప్రొఫెసర్‌తో పరిచయం జేసుకోడానికి షీల వేసిన ఎత్తు ఆ విధంగానే ఫలించింది.

లిఫ్ట్ దిగగానే ఇద్దరూ బార్‌రూం వైపు నడిచేరు. రంగు రంగుల దీపాలతో, రకరకాల మత్తు పానీయాలతో అలంకరిచబడుంది బార్.

ఓ ఖాళీ రౌండ్ టేబిల్ ముందు కూర్చున్నారిద్దరు. వెయిటర్ రాగానే రెండు షాంపెన్ బాటిల్స్, ఐస్ బాగ్ ఫ్రైచికెన్ తెమ్మన్నాడు అగర్వాల్.

ఐదు నిమిషాల్లో వారి టేబిల్ నిండిపోయింది. గంట లోగా మంచి కైపులోకి వచ్చేడు ప్రొఫెసర్. మాట్లాడుతోంటే ముద్దుగా వస్తున్నాయి మాటలు. షీల తన గ్లాసులోకి షాంపెన్ ఒంపుకున్నట్టు ఒంపుకుని, ప్రొఫెసర్ కళ్ళు గప్పి, దాన్ని ఐస్ బాగ్‌లో పోస్తూ ఇంతవరకూ నెట్టుకొచ్చింది.

ప్రొఫెసర్ కళ్ళుమాత్రం ఆకలితో దహించుకుపోతూ ఆమెని చూస్తున్నాడు. ఆమె గ్లాసులో కొసరి కొసరి బాటిల్ ఒంపుతున్నాడు. బాగా తాగిస్తే సులువుగా లొంగదీసుకోవచ్చని అతని ఆశ.

"ఇక చాలు. తాగుతూంటే ఆకలి ఎక్కువవుతోంది. భోజనం తెప్పించండి" అంది షీల.

వైటర్ని పిలిచి వెంటనే భోజనం తెప్పించాడు ప్రొఫెసర్. భోజనాలయ్యేక ఆవులిస్తూ ఒళ్ళు విరుచుకుని "ఇక నే వెళతాను" అంది షీల.

"అప్పుడేనా?" ప్రొఫెసర్ కంఠంలో నిరాశ ధ్వనించింది.

"క్షమించాలి ఈ రోజు బాగా అలసిపోయి వున్నాను. మళ్ళీ రేపు కలుసుకుందాం. గుడ్ నైట్!" అంటూ లేచింది షీల.

విధిలేక తలూపేడు అగర్వాల్. ఈ రాత్రి ఎలాగూ ఓ అమ్మాయి ఏర్పాటవుతోంది కదా? ఈమె విషయం రేపు చూసుకోవచ్చు అనుకున్నాడు మనసులో.

షీల గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయింది.

ఇంతలో ఓ వైటర్ ప్రొఫెసర్ దగ్గరికి వచ్చి, రహస్యంగా అతని చెవిలో ఏదో చెప్పేడు.

ప్రొఫెసర్ కళ్ళు మెరిసేయి.

తలూపుతూ లేచి, తడబడే అడుగులతో తన గది జేరుకున్నాడు.

అప్పటికే అతని గదిలో ఓ అమ్మాయి వచ్చివుంది.

లోపలికెళ్ళి తలుపు మూసుకున్నాడు ప్రొఫెసర్.

సరిగ్గా అదే సమయంలో అక్కడ రాజారెడ్డి, పృథ్వీ

రాజ్‌లు ఎంతో చాకచక్యంతో ప్రొఫెసర్ అగర్వాల్ తాలూకు కెమికో-ఫర్మ్ ఆఫీసులో ప్రవేశించి, అక్కడి ఫైళ్ళూ, కాగితాలూ, వస్తువులూ చెల్లాచెదరుగా కింద విసిరేసి, గండు పిల్లుల్లా తిరిగి బైటపడ్డారు.

అంతకి ముందే పృథ్వీరాజ్ సేర్పుగా హోటల్ పార్కింగ్‌లో వున్న ప్రొఫెసర్ జీప్ పెట్రోల్ కింద, శక్తివంతమైన టైంబాంబ్ ఫిట్ జేసి రెడీగా వుంచేడు.

# 6

రాత్రి పదకొండు గంటలకి తన గదిలోని బాత్ రూంలో దూరేడు రాజారెడ్డి. లైటర్ తీసి, ఏరియల్ లాగి, బటన్ వత్తేడు.

అవతలినించి డేవిడ్ కంఠం వినిపించగానే, వాళ్ళకి ఇన్‌స్ట్రక్షన్స్ ఇవ్వసాగేడు.

"సరిగ్గా పన్నెండు గంటలకి, మీ గది కిటికీలోంచి నైలాన్ తాడు అవతలికి విసిరి, కావలసిన సామానుతో నీవూ, పృథ్వీరాజ్ కిందికి జేరుకోండి. చీకట్లో జాగ్రత్తగా కారు పార్కింగ్‌లో కెళ్ళి అక్కడ నేను అద్దెకి తీసుకున్న బ్లూ షెవర్లెట్‌లో కూర్చుని నాకోసం వెయిట్ జెయ్యండి.

మీ వెనకే నేనూ కిందికి వస్తాను. ముగ్గురం రాత్రి ఒంటి గంటలోగా, వాస్కా-సరస్సు ప్రాంతాలకి జేరుకోవాలి. సరస్సు కివతల రాత్రింబవళ్ళూ, మిలటరీ సైనికులూ, వారికి తోడుగా శత్రువుని చీల్చిచెండాడే భయంకరమైన కుక్కలూ గస్తీ తిరుగుతుంటాయి.

మనం సైనికుల బారనుంచి తప్పించుకున్నా, ఆ కుక్కల వాసన శక్తినించి తప్పుకోలేం. అందుకే, పృథ్వీరాజ్

తయారుచేసిన సూపర్ సోనిక్ యంత్రాన్ని మన దగ్గర రెడీగా వుంచుకోవాలి.

మన అదృష్టం బావుండి, ఆ కుక్కల బారినించి తప్పించుకున్నామంటే, ఇహ సరస్సు ఈది అవతలికి చేరుకోవాలి. సరస్సు ఈదడం కూడా అంత సామాన్య విషయం కాదు. అవతలి ఒడ్డునించి లాక్ టవర్ సెర్చ్ లైట్ రాత్రంతా ఆ సరస్సు చుట్టూ ఫోకస్ చేస్తుంటుంది. నీటిపైన ఈదితే మనం స్పష్టంగా కాపలా వాళ్ళకి కనిపిస్తాం కనుక, నీళ్ళలో మునిగి అవతలి ఒడ్డువరకూ వెళ్ళవలసి వుంటుంది.

అందుకని మన వెంట ఆక్సిజన్ సిలిండర్స్, స్విమ్మింగ్ డ్రెసెస్ తప్పని సరిగా వుండి తీరాలి.

అవతలి ఒడ్డు చేరేక, అడవి గుండా కొద్ది దూరం నడిస్తే లేబరేటరీ వస్తుంది. ఆ లేబరేటరీ చుట్టూ పెద్ద ఫెన్సింగ్ వుంటుంది. ఆ ఫెన్సింగ్ లో ఇరవై నాలుగ్గంటలూ కరెంట్ పాస్ అవుతుంటుంది. ఫెన్సింగ్ అవతల మళ్ళీ సైనిక కాపలా వుంటుంది.

అటువంటి పద్మవ్యూహాన్ని ఛేధించుకుని లేబరేటరీలో ప్రవేశించాలి. అప్పుడు గానీ, ప్రపంచ విపత్తుకి మూల స్థావరమైన ఆ లేబరేటరీని ధ్వంసం జెయ్యలేం!

ప్రతి అడుగు చూచి చూచి వేయాలి. ఎంతో జాగ్రత్తా మెలకువా అవసరం. ముగ్గురం సజీవంగా తిరిగి వస్తామో, ఒకరిద్దరం మిగిలివస్తామో చెప్పలేను. ప్రాణాలు పోయినా, వున్నా, ఏది ఏమైనా సరే మన ప్రయత్నం మనం జేసి తీరాలి!"

"ఓకే సర్!" డెవిడ్ కంఠం దృఢంగా వినిపించింది.

రాజారెడ్డి ట్రాన్స్‌మిటర్ ఆఫ్ జేసి జేబులో వేసు కున్నాడు.

## 7

వాస్కా సరస్సుకి ఫర్లాంగు ఇవతల రోడ్డు పక్క పొదల్లో కారాపి దిగేరు ముగ్గురు. చుట్టూ మసక చీకటి, కీచురాళ్ళ రొద. దూరాన, సెర్చ్‌లైట్ కాంతి సరస్సు మీద పడుతూ గుండ్రంగా తిరుగుతోంది.

కావలసిన సామాను కార్లోంచి తీసుకుని, ముగ్గురూ ముందుకి సాగేరు. పొదల చాటున నక్కుతూ, నాలుగు వైపులూ జాగ్రత్తగా చూసుకుంటూ కాపలా వాళ్ళ బూట్సుల శబ్దం వినిపించగానే చెట్ల గుబురుల్లో ఒదుగుతూ గంట తరవాత సరస్సుని సమీపించేరు.

సరిగ్గా అదే సమయంలో దూరాన కుక్కలు మొర గడం వినిపించింది. "పృథ్వీరాజ్! త్వరగా నీ పని కానియ్!" అన్నాడు రాజారెడ్డి చేతిలో పిస్తోలు సేఫ్టీ కాచ్ వెనక్కి లాగుతూ.

పృథ్వీరాజ్ వెంటనే, భుజానికి వేలాడుతున్న నల్ల రంగు బాక్సుని తీసి నేలమీద పెట్టి డయల్స్ తిప్ప సాగేడు. "త్వరగా కానివ్వు! కుక్కలు మన వాసన పట్టే కాయి!" అన్నాడు రాజారెడ్డి ఆత్రంగా.

పృథ్వీరాజ్ చకచక వైర్ జాయింట్ జేసి, స్విచ్ ఆన్ జేసేడు. మెషీన్‌లోంచి ఎలాంటి శబ్దం రాలేదు. కాని, మెషీన్ తన పని ప్రారంభించింది.

నిజానికి, ఆ మెషీన్ లోంచి ఒకవిధమైన రేడియో తరంగాలు నిశ్శబ్దంగా, వేగంగా వెదజల్లబడతాయి. ఆ తరంగాలు మనుషులకి వినబడవు. వాటిని కేవలం జంతు

వుతే పసిగడతాయి. ఆ తరంగాల శబ్దం కోటి రాబందులు ఒక్కసారి అరుస్తున్నట్టు అతి భయంకరంగా వుంటుంది. ఆ కేకలు విన్న జంతువులు భయపడి ఏదో ముంచుకు వచ్చినట్టు తలో దిక్కు దౌడు తీస్తాయి.

అదే జరిగింది. మెషీన్ స్విచ్ ఆన్ చేసిన మరుక్షణం అంతవరకూ వినిపిస్తున్న పక్కుల అరుపులు ఠకీమని ఆగి పోయేయి. అవి చటుక్కున వెనుదిరిగి ఎవ్వరో కొడు తున్నట్టు గొంతెత్తి ఏడుస్తూ తలో వైపు పారిపో సాగేయి.

అకస్మాత్తుగా వాటికేమైందో అని వాటి వెంటవున్న కాపలాదార్లు నివ్వెరబోయేరు.

"థ్యాంక్యూ మిస్టర్ పృథ్వీరాజ్! ఇహ అపాయం లేదు. వెంటనే స్విమ్మింగ్ డ్రెస్‌లు తొడుక్కుని ఆక్సిజన్ సిలిండర్లు వీపుకి కట్టుకోండి. సరస్సులో దిగిన మరుక్షణం ఏమాత్రం పైకి తేలకుండా లోలోపల ఈతుదూ అవతలి ఒడ్డుకు జేరాలి.

ఒక విషయం మరిచిపోవద్దు. ఈసరస్సులో 'ప్రీహాన్స్' అనబడే భయంకరమైన చేపలున్నాయి. వాటికి మనిషి మాంసమంటే ఎంతో ప్రీతి. చూడటానికి అవి చిన్న చేపలే ఐనా, వాటి దవడలూ, పళ్ళూ ఎంతో వాడిగా వుంటాయి. సరస్సులో మనిషి కనిపించిన మరుక్షణం అవి తండోపతండాలుగా వచ్చి చుట్టు ముట్టేస్తాయి.

"చూస్తూ చూస్తూనే చెట్టంత మనిషి కేవలం అస్థిపంజ రంగా మిగిలిపోతాడు" అన్నాడు రాజారెడ్డి.

"మీరు నిశ్చింతంగా వుండండి. ఈ సూపర్ సోనిక్ యంత్రం వాటి పని పడుతుంది" అన్నాడు పృథ్వీరాజ్.

ఐదు నిమిషాల్లో ముగ్గురూ స్విమ్మింగ్ డ్రెస్‌లు తొడుక్కొని సరస్సులో దిగేరు. నీటిలో మునిగి కొద్ది దూరం వెళ్ళారో, లేదో, నాలుగు వేపులనించీ తండోపతండాలుగా వస్తూ వారిని చుట్టుముట్టసాగేయి ప్రీహాన్స్ చేపలు.

పృథ్వీరాజ్ వెంటనే, తన నడుం మీద బెల్ట్ బక్కల్‌కి వేళాడుతున్న మెషీన్ స్విచ్ వత్తేడు అంతే! మరుక్షణం నీటిలో ప్రళయం వచ్చినట్టయింది. చేపలన్నీ గిరుక్కున వెనుదిరిగి పోసాగేయి.

వేగంగా ఈదుతూ అరగంటలో ముగ్గురూ అవతలి ఒడ్డుకి జేరుకున్నారు. ఎంతో జాగ్రత్తగా, మసక చీకట్లో పొదల చాటుమాటున నక్కుతూ, ముందుకి సాగేరు.

అలా ఫర్లాంగు దూరం వెళ్ళేక, దూరాన కనిపించింది లేబొరేటరీ బిల్డింగ్! దాని చుట్టూ ఎత్తైన ఫెన్సింగ్ వుంది దాని లోపలే మళ్ళీ సైనికులు కాపలా ప్రారంభమౌతుంది.

ఫెన్సింగ్‌ని సమీపించగానే ముగ్గురూ నేలమీద బోర్లాపడుకున్నారు. పృథ్వీరాజ్ తన బ్యాగ్‌లోంచి గ్లవుస్ కటింగ్ ప్లేయర్ తీసి, గ్లవుస్ చేతులకి తొడుక్కొని, కటింగ్ ప్లేయర్‌తో జాగ్రత్తగా ముళ్ళతీగ కట్ జేసేడు.

అంతే! మరుక్షణం నాలుగు వైపుల నించీ బిగ్గరగా అలారం మోతలు వినిపించ సాగేయి.

ముగ్గురి గుండెలూ దడదడ మన్నాయి.

"పొరబాటు జరిగిపోయింది. తీగ కట్ చెయ్యగానే, దాంట్లో పాస్ అవుతున్న కరెంట్ ఆగిపోయి, అలారంలని ఇండికేట్ జేసింది. ఇటువంటి ఏర్పాటు ఉంటుందని ఊహించలేదు." అన్నాడు పృథ్వీరాజ్ నిరాశగా.

అప్పటికే లోపలినించి కాపలా వాళ్ళ బూట్సుల చప్పుళ్ళూ కేకలూ వినిపించసాగేయి. అంతవరకూ ఒకే ఒక సెర్చిలైట్ తిరుగుతున్నదల్లా ఇప్పుడు మరో మూడు వెలిగేయి. ప్రమాదాన్ని సూచించే సైరన్ మోగసాగింది.

"ఇప్పుడేం జేద్దాం?" అడిగేడు డేవిడ్ ఖంగారుగా.

"ప్లాన్ ఫేలయింది! వెనుదిరిగి సరస్సులో దూకండి. హారియప్." అన్నాడు రాజారెడ్డి నేలమీంచి లేస్తూ.

ముగ్గురూ తమ తమ సామాను అందుకుని సరస్సు వైపు పరిగెత్తేరు. సరస్సులో దూకి, అరగంటలో ఆవలి ఒడ్డు జేరుకున్నారు. క్షణం వృధా జెయ్యకుండా శక్తికొద్దీ పరుగు తీసేరు.

మరో పదిహేను నిమిషాల్లో కారు విడిచిన చోటికి జేరుకున్నారు. కార్లో కూర్చోగానే స్టార్ట్ జేసి, లైట్సు ఆన్ జెయ్యకుండా, నగరం వైపు పరిగెత్తించేడు డేవిడ్.

# 8

టెలిఫోన్ గణ గణ మోగడంతో నిదరలోంచి ఉలిక్కిపడి కళ్ళు తెరిచేడు ప్రొఫెసర్ అగర్వాల్. కిటికీ లోంచి సూర్యకిరణాలు గదిలో పడుతున్నాయి.

టైం చూసేడు. ఎనిమిది గంటలు. అప్పటికే పక్కలో ఉన్న అమ్మాయి లేచి వెళ్ళిపోయింది.

చటుక్కున రిసీవర్ అందుకుని, "ఎస్! అగర్వాల్ స్పీకింగ్" అన్నాడు.

"సార్! లేవగానే మీకీ దుర్వార్త చెప్పవలసి వచ్చినందుకు చింతిస్తున్నాము. రాత్రి మన కెమికో ఆఫీస్‌లో ఎవ్వరో దొంగతనంగా ప్రవేశించి, ఫైళ్ళూ కాగితాలూ చిందరవందర జేశారు. విలువైన వస్తువులేవీ పోలేదు.

దాన్ని బట్టి వాళ్ళు మామూలు దొంగలు కారనీ, ఏదో సీక్రెట్ మేటర్ కోసం వెతకడానికి వచ్చేరనీ తెలుస్తోంది." అన్నాడు అవతలినించి అతని సెక్రెటరీ.

ప్రొఫెసర్ ముఖం చిట్లించి "నీకేమైనా మతి పోయిందా?" అన్నాడు నమ్మనట్టు.

"నో సార్! మీకు నమ్మకం లేకుంటే, స్వయంగా వచ్చి చూడండి. ఆఫీసు తెరిచేక, అక్కడి దృశ్యం చూడగానే తక్షణం సీనియర్ సెక్యూరిటీ ఆఫీసర్ లెఫ్టినెంట్ జనరల్ గ్రోమేజ్ గారికి ఫోన్ చేసేను. ఆయన కొందరు ఆఫీసర్లని వెంటబెట్టుకుని హుటాహుటిన వచ్చేరు. వాళ్ళింకా ఇక్కడే ఉన్నారు. అన్నట్టు చెప్పడం మరిచేను సార్!

నిన్న ఎవ్వరో డాక్టర్ ఘోష్ అనే వ్యక్తి మీ కోసం ఫోన్ చేసేరు..."

ఆ పేరు విన్న ప్రొఫెసర్ గుండె గుభిల్లుమంది! వణికే కంఠాన్ని తమాయించుకుంటూ "ఆల్ రైట్! ఇప్పుడే వస్తున్నాను." అని రిసీవర్ పెట్టేసేడు.

'డాక్టర్ ఘోష్' హఠాత్తుగా ఆ పేరు వినగానే, తాము భారతదేశంలో పనిచేసిన లేబొరేటరీ, ఆ లేబొరేటరీకి డైరెక్టర్ అయిన డాక్టర్ ఘోష్ మెరుపులా మెరిసేరు ప్రొఫెసర్ బుర్రలో.

తామీ దేశంలో తలదాచుకున్నట్టు భారతదేశానికి తెలిసిపోయిందా? తమ విషయం ఆరా తియ్యడానికి డాక్టర్ ఘోష్ నాయకత్వాన గూఢచారుల్ని పంపిందా? రాత్రి కెమికో ఆఫీస్‌లో వాళ్ళే ప్రవేశించేరా? ఇలాటి అనుమానాలతో ప్రొఫెసర్ శరీరం వేపాకులా వణక సాగింది.

ఇంతలో మళ్ళీ ఫోన్ గణగణ మోగింది.

ప్రొఫెసర్ రిసీవర్ అందుకుని– "ఎస్!" అన్నాడు.

"సార్! అత్యంత తీవ్రమైన విషయం. రాత్రి ఎవ్వరో సరస్సు దాటి, లేబొరేటరీని సమీపించి, ఫెన్సింగ్ కట్ జెయ్యడానికి ప్రయత్నించేరుట.

అదృష్టవశాత్తూ వాళ్ళ ప్రయత్నం ఫలించలేదు. కాపలా వాళ్ళు ఎంత వెదికినా కనిపించకుండా పారిపోయేరుట."

దిగ్భ్రాంతితో క్షణంపాటు ప్రొఫెసర్ నోరు పెగల్లేదు. తరువాత తేరుకుని వస్తున్నానని చెప్పి రిసీవర్ పెట్టేసేడు.

ఇప్పుడు ప్రొఫెసర్‌కి పూర్తి నమ్మకం ఏర్పడింది. ఆ పని భారత గూఢచారులదేనని. దాంతోబాటు అతనిలో చెప్పలేని భయం కూడా విజృంభించింది.

ఆదరా బాదరా తయారై జీప్ ఎక్కి బైలుదేరేడు. కమిషన్ ఆఫీస్ ఆవరణలో, సీనియర్ సెక్యూరిటీ ఆఫీసర్ లెఫ్టినెంట్ జనరల్ గ్రోమేజ్, ప్రొఫెసర్ సెక్రటరీ ఎదురయ్యేరు.

జనరల్‌ని చూడగానే ప్రొఫెసర్ మొహం ఎర్రబడింది. "వాటీజ్ దిస్ యువర్ కేర్‌లెస్ జాబ్ జనరల్? మీ దేశంలో మా ఆఫీస్‌కి, లాబొరేటరీకే రక్షణ లేనప్పుడు ఇక మా ప్రాణాలకి రక్షణ వుంటుందని ఎలా నమ్మడం?" అన్నాడు తీక్షణంగా.

ప్రొఫెసర్ అగర్వాల్, ప్రొఫెసర్ బీరేంద్రనాథ్ ముఖర్జీల రక్షణ భారం గ్రోమేజ్ పైనే వుంది. అతను ఆదేశ అధ్యక్షుడైన జనరల్ ఫెర్నాండెజ్ కుడి భుజం.

"క్షమించండి ప్రొఫెసర్! మా ఏర్పాట్లలో ఎక్కడో

చిన్న లోపం జరిగిపోయింది. వివరాలందిన తక్షణం మన సెక్యూరిటీ దళానికి ఆదేశాలు జారీ చేశాను, ఆ దుండగులెక్కడున్నా వెంటనే కూపీతీసి పట్టుకోమని. ఈ విషయంలో మీరు నిశ్చింతగా వుండండి. రక్షణ ఏర్పాట్లని ఇంకా కట్టుదిట్టం చేశాం!'' అన్నాడు జనరల్ గ్రోమేజ్ వినయంగా.

ప్రొఫెసర్ లోనికెళ్ళి కాసేపు ఆఫీసు తనిఖీ చేసి బైటికి వచ్చేడు.

''పదండి ఓసారి లేబొరేటరీకి వెళ్ళి చూద్దాం!'' అన్నాడు జనరల్‌తో. అందరూ జీపుల్లో బైలుదేరేరు.

* * *

రాజారెడ్డి కోరిన కిరాయి హెలికాప్టర్ వచ్చి ఏర్‌పోర్ట్‌లో దిగింది. దానికోసమే అక్కడ ఎదురు చూస్తున్న రాజారెడ్డి గబగబ వెళ్ళి పైలెట్‌కి తనను పరిచయం చేసుకుని కాక్‌పిట్ ఎక్కి కూర్చున్నాడు. అతని మెడలో బైనాక్యులర్స్, ఓ కెమెరా వ్రేలాడుతున్నాయి.

ప్రొఫెసర్ నిదర లేవగానే రాత్రి జరిగిన సంఘటనలు అతనికి తెలుస్తాయనీ, అతను వెంటనే లేబొరెటరీకి బైలుదేరతాడనీ రాజారెడ్డికి తెలుసు.

హెలికాప్టర్ని ఏవైపు తీసుకెళ్ళాలో పైలెట్‌కి వివరించేడు. మరుక్షణం ఇంజన్ స్టార్టయి హెలికాప్టర్ పైకి లేచింది.

పైలెట్, నెలసరి జీతంమీద ఒకరి దగ్గిర పని చేస్తున్నాడు. గనుక కస్టమర్ హెలికాప్టర్ని ఏవైపు తీసుకెళ్ళమన్నాడూ, ఎందుకు తీసుకెళ్ళమన్నాడూ, అని ఆలోచించే అవసరం లేదు. కస్టమర్ ఎటు తీసుకెళ్ళ

మంతే, అటు తీసికెళ్ళి అద్దె వసూలు జెయ్యడం అతని డ్యూటీ!

రాజారెడ్డి కాక్‌పిట్‌లోంచి బైనాక్యులర్స్ ద్వారా తన గమ్యం దగ్గిర పడుతూన్నదో, లేదో చూస్తూ కూర్చు న్నాడు. కాసేపట్లోనే సుదూరాన సరస్సు కనిపించింది.

సరస్సు వైపు వెళ్ళే ఓ మట్టి రోడ్డుమీద రెండు జీపులు పోతూ కనిపించేయి. ఆ జీపుల్లోనే ఒక దాంట్లో ప్రొఫెసర్ అగర్వాల్ ఉండివుంటాడు.

చిన్నగా నవ్వుకుంటూ మెడలో వేళాడుతున్న కెమెరాని సరిజేసుకున్నాడు రాజారెడ్డి. ఆ కెమెరాలో ఓ పుష్ బటన్ వుంది. అది వత్తిన మరుక్షణం కెమెరా లెన్స్ ద్వారా తీవ్రమైన రేడియో తరంగాలు ప్రసారమౌతాయి.

ఆ తరంగాలకీ, ప్రొఫెసర్ జీప్ పెట్రోల్ టాంక్ కింద అమర్చిన టైంబాంబుకీ లింక్ వుంది. కెమెరాలోంచి రేడియోతరంగాలు బైటపడ్డ మరుక్షణం ఆ బాంబు పేలుతుంది.

చూస్తూ చూస్తూనే జీప్‌లు సరస్సు ఒడ్డున ఆగేయి. అందులోంచి ప్రొఫెసర్‌తోబాటు, మిగతా బలగం దిగింది. సరస్సు ఆవలివైపు వెళ్ళడానికి ఓ మిలటరీ బోట్ సరస్సులో తేలుతోంది. అందరూ బోట్ వైపు వెళుతున్నారు.

సరిగ్గా అదే సమయంలో రాజారెడ్డి కెమెరా బటన్ వత్తేడు.

* * *

"ఢాం!" అనే ప్రేలుడుతో అందరూ అదిరిపడి వెనుదిరిగి చూసేరు.

ప్రొఫెసర్ జీప్‌లో మంటలు లేచాయి! క్షణం పాటు ఏం జరిగిందో, అది కలో_మాయో అర్థం కాలేదు వాళ్ళకి.

దిగ్భ్రాంతినించి తేరుకున్న ప్రొఫెసర్‌కు వెంటనే జ్ఞాపకం వచ్చింది. జీప్ పెట్రోల్ టాంక్ నిండి వుందనీ, ఆ మంటలవల్ల అది బ్రస్ట్ అయి జీప్ ముక్కలై ఎగిరి పోతుందని. అందర్నీ కింద పడిపొమ్మని అరుస్తూ తనూ బోర్లా నేలమీద పడ్డాడు. సరిగ్గా అదే సమయంలో దిక్కులు పిక్కటిల్లే చప్పుడుతో జీపు ముక్కలై గాలిలోకి ఎగిరింది.

ఐదు నిమిషాల తరవాత అందరూ నేలమీంచి లేచారు. చుట్టు పక్కల అంతమంది వుండగా, అకస్మాత్తు ఆ సంఘటన ఎలా జరిగిందో, ఎంత బుర్రలు బద్దలు కొట్టుకున్నా, జనరల్ గ్రోమేజ్‌కూ, అతని అనుచరులకూ ఏమీ బోధ పడలేదు.

ప్రొఫెసర్ అగర్వాల్ బుర్రమాత్రం తీవ్రంగా పని జెయ్యసాగింది. ఇక సందేహంలేదు. ఇదంతా భారత గూఢ చారుల పనే అయ్యుంటుంది. తనని చంపడానికే వాళ్ళు జీపులో ఎక్కడో టైంబాంబు పెట్టివుంటారు.

తన అదృష్టం బావుండి బ్రతికిపోయేడు. ఇంతమంది సెక్యూరిటీ ఉన్నతాధికార్లు వెంట వున్నా, తన ప్రాణా లకి గ్యారంటీ లేకపోయింది. దీన్ని బట్టి భారత గూఢ చారులు ఏ క్షణంలోనైనా, ఎక్కడైనా సరే తనని సులువుగా చంపగలరని తేలిపోయింది.

భారతదేశం తన గూఢచారుల ద్వారా తమని చంపించి పగ తీర్చుకోవాలనుకుంటోంది. ఇహ ఈ దేశంలో ఒక్క క్షణం వుండకూడదు. ప్రొఫెసర్ ముఖర్జీతో మాట్లాడి,

అతన్ని ఒప్పించి, మూడో కంటికి తెలీకుండా మరే దేశానికైనా పారిపోవాలి!

అనుకుంటూ లేబొరేటరీలో పని జేస్తున్న ప్రొఫెసర్ బీరేంద్రనాథ్ ముఖర్జీని కలుసుకోవడానికి సరస్సులో తేలుతున్న బోట్ వైపు నడిచేడు అగర్వాల్.

మిగతా వాళ్ళంతా ఆ సంఘటన గురించే చర్చిస్తూ అతన్ని అనుసరించేరు.

## 9

ప్రొఫెసర్ ముఖర్జీతో మాట్లాడి, సాయంత్రం ఐదు గంటలకి హోటల్‌కి తిరిగి వచ్చేడు అగర్వాల్.

లిఫ్ట్‌లో తిన్నగా పైకెళ్ళి తన గదిని సమీపించేడు. తలుపు మూసివున్న తీరు చూసి ఏదో అనుమానం వేసింది. జేబులో చెయ్యి పెట్టి, మునివేళ్ళతో తలుపు తోసేడు.

తెరుచుకుంది. గదిలో అడుగు పెడుతూ చటుక్కున రివాల్వర్ బయటికి తీసేడు. గదిలో ఎవ్వరూ లేరు. కాని, గది వున్న తీరు చూడగానే ఆశ్చర్యంతో అతని కళ్ళు పెద్దవయ్యేయి.

సామానంతా చిందరవందరగా పడుంది. మంచంమీది పరుపూ, దిళ్ళూ ఎవ్వరో బ్లేడుతో కోసి, దూది పీకి గదంతా వెదజల్లేరు. సందేహం లేదు. ఎవ్వరో తను లేనప్పుడు మారు తాళంతో తలుపులు తెరిచి దేనికోసమో వెదికేరు. భారత ఏజెంట్లేనా? ఈ ఆలోచన రాగానే ప్రొఫెసర్ కాళ్ళూ చేతులూ వణకసాగేయి.

అనుకోకుండా అతని దృష్టి టేబిల్ మీద రెపరెపలాడుతున్న కాగితం మీద పడింది. ఏమిటా అనుకుంటూ గబగబ అటు నడిచేడు.

అది ఉత్తరం! మూడే మూడు పంక్తులున్నాయి.

"ప్రొఫెసర్! నీవూ, ముఖర్జీ మానించి తప్పించుకోలేరు. మీరు చేసిన ద్రోహానికి తగిన శిక్ష విధించబడుతుంది. మీ ప్రాణాలు మా గుప్పిట్లో వున్నాయ్!"

అంతే! ఆ మూడు పంక్తులు ప్రొఫెసర్ శరీరాన్ని చమటతో తడిపేసేయి.

ఇంతలో బాత్‌రూం వైపునించి విచిత్రమైన శబ్దం వినిపించడంతో చటుక్కున అటు తిరిగేడు ప్రొఫెసర్. బాత్‌రూం తలుపు మూసివుంది. లోపల ఎవ్వరైనా వున్నారా? దడదడలాడే గుండెతో రివాల్వర్ రెడీగా పట్టుకుని అటు నడిచేడు.

మెల్లిగా తలుపు తోసేడు. కిర్రుమంటూ తెరుచుకుంది. లోపలి దృశ్యం చూడగానే ప్రొఫెసర్ బుర్ర గిరగిర తిరగసాగింది. నేలమీద తాళ్ళతో చేతులు వెనక్కి విరిచి కట్టేయబడుంది మిస్ లోరెన్స్! అరవకుండా నోట్లో గుడ్డ పీలికలు. కాళ్ళు రెండూ కలిపి కట్టేసి వున్నాయి.

కళ్ళు తెరిచి నిస్సహాయంగా చూస్తోంది!

ప్రొఫెసర్ ఆశ్చర్యంలోంచి తేరుకుని, గబగబ ఆమె కట్లు విప్పి "మిస్ లోరెన్స్! మీరిక్కడికెలా వచ్చేరు? ఎవ్వరు కట్టిపడేసేరు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించేడు.

ఛీల బాధతో కాళ్ళూ చేతులూ విదిల్చుకుంటున్నట్టు నటిస్తూ చెప్పసాగింది. "ఉదయం మీ కోసం రెండు మూడు సార్లు గదికి ఫోన్ జేసేను జవాబు రాలేదు. బార్ రూంలోనూ, డైనింగ్ హాల్లోనూ వెదికేను. ఎక్కడా మీరు కనిపించలేదు. దాంతో పనిమీద ఎక్కడికో వెళ్ళి వుంటారని సరిపెట్టుకున్నాను.

ఎవ్వరి కంపెనీ దొరక్క, ఏమీ తోచక బోర్ కొడు తుంటే అనుకోకుండా ప్రిన్స్ ఖాసిమ్ ఉలేమాన్ గారు కనిపించేరు. ఆయన కువైట్ ఖలీఫా సోదరుడు. అదేపనిగా తన ప్రైవేట్ విమానంలో దేశ దేశాలు తిరుగుతూ, డబ్బుని మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చు శేస్తుంటాడు.

నిన్నటినించీ ఈ హోటల్లోనే మకాం జేసి వున్నాడుట. ఆయనకీ నాకూ ఒకసారి పారిస్‌లో పరిచయం కలిగింది. బోర్ కొడుతున్న నాకు, పగలు ఆయనతో మంచి కంపెనీ దొరికింది. మాటల మధ్య ఆయన మీ గురించి అడిగేడు. ఉదయంనించీ మీరు కనిపించడం లేదని చెప్పేను.

దాంతో ఆయన మీ గురించి ఏమన్నాడో తెలుసా? పాపం, ఆ ప్రొఫెసర్ చాలా ప్రమాదంలో వున్నాడు. ఏ క్షణంలోనైనా అతను హత్య జెయ్యబడవచ్చు. అతను సరేనంటే నేనతన్ని కాపాడి ఆదుకోగలను. అతన్ని ఎవ్వరు చంపదలచుకున్నారో, ఎందుకు చంపదలచు కున్నారో నాకు తెలును.

అంతేకాదు, ఆయన ప్రత్యేకంగా మిమ్మల్ని కలుసుకో డానికే వచ్చేడుట. కొలంబోలో చెడిపోయిన ఆయన జెట్ విమానం ఇప్పుడు బాగై, ఇక్కడి ఏర్‌పోర్ట్‌లో వచ్చి వుందిట. ఆయన ఏదో బిజినెస్ గురించి మీతో ఒప్పందం కుదుర్చుకోవాలను కుంటున్నాడట.

నిన్న రాత్రి మనిద్దరం కలిసివుండటం ఆయన చూసే డుట. అందుకే నా ద్వారా మిమ్మల్ని పరిచయం జేసుకో వాలనుందని చెప్పేడు. ఆ విషయం గురించే మీతో మాట్లాడదామని సాయంత్రం నాలుగ్గంటలకి మీ గదికి వచ్చేను. తలుపు కొద్దిగా తెరిచివుంది.

తట్టగానే, లోపలినించి_ 'కమిన్' అని వినిపించింది. మీరే అయుంటారనుకుని తలుపు తోసి లోపలికొచ్చేను. అంతే! మరుక్షణం అంతవరకూ తలుపు పక్కన నక్కి వున్న వ్యక్తి, వెనకనించి నా నోరు నొక్కి పట్టుకున్నాడు. మరొకడు క్లోరోఫాంలో తడిపిన గుడ్డని నా ముక్కుకి అదిమిపెట్టేడు.

ఎంత గింజుకున్నా వారి పట్టు సడలలేదు. నా కళ్ళు బైర్లు కమ్మసాగేయి. అంతే, తరువాత ఏంజరిగిందో నాకు తెలియదు. స్పృహ వచ్చి చూస్తే బాత్‌రూంలో కట్టి పడున్నాను. మీరు వచ్చేరు గనక సరిపోయింది. ఇంతకీ ఎవ్వరు వాళ్ళు? మీరు లేకుండా మీ గదిలో ప్రవేశించి ఇంత దౌర్జన్యం జేస్తారా?"

"నావల్ల మీకీ కష్టం కలిగినందుకు క్షమించాలి మిస్ లోరెన్స్! కొందరు గుర్తు తెలియని వ్యక్తులు నన్ను చంపడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు.

ఇంతకీ, ప్రిన్స్‌ఖాసిమ్ ఉలేమాన్ గారికి నేను ప్రమాదంలో వున్నట్టు ఎలా తెలిసింది?" అడిగేడు ప్రొఫెసర్ ఆశ్చర్యంగా.

"ఏమో, వెళ్ళి ఆయన్నే అడగండి. ఆయన నన్ను కోరిందల్లా మిమ్మల్ని పరిచయం జెయ్యమని!" అంది షీల.

భారత గూఢచారుల బారినించి ఎలా తప్పించుకోవాలా? ఈ దేశం విడిచి సురక్షితంగా ఎక్కడికి పారిపోవాలా? అని ఆలోచిస్తున్న ప్రొఫెసర్‌కి వెతకబోయిన తీగ కాలికి తగిలినట్టు తోచింది.

ప్రిన్స్‌ని వెంటనే కలుసుకుని సహాయం అర్థించాలి, అనుకుంటూ, "ఇప్పుడాయన ఎక్కడున్నాడు?" అడిగేడు.

"ఆయన గదిలోనే వుండివుంటారు. వెళ్ళి కలుసుకోండి. నేను కాస్త స్నానం అదీ జేసి మళ్ళీ కలుస్తాను." అని ప్రిన్స్ ఏ అంతస్తులో ఏ గదిలో వున్నాడో చెప్పి, తాము వేసిన ఎత్తు అలా ఫలించినందుకు లోలోన నవ్వుకుంటూ బైటికి నడిచింది షీల.

ప్రొఫెసర్ గబగబ గది లాక్ జేసి, లిఫ్ట్‌లో ఆరవ అంతస్తు జేరుకున్నాడు. ఆ అంతస్తులో వున్న గదులన్నీ కేవలం ప్రముఖుల కోసమే ఏర్పాటు జెయ్యబడ్డాయి.

రూం నెంబర్స్ చెక్ జేస్తూ ప్రిన్స్ గదిముందు ఆగేడు. తలుపు మూసివుంది. తలుపు పక్కనే వున్న కాలింగ్ బెల్ వత్తేడు. రెండు నిమిషాల తరువాత, ప్రిన్స్ సెక్రెటరీ ఖుద్రతుల్లా సూడానీ (పృథ్వీరాజ్) తలుపు తీసేడు.

"అయామ్ ప్రొఫెసర్ అగర్వాల్! ప్రిన్స్ ఖాసిమ్ గారు నన్ను చూడాలనుకుంటున్నారని తెలిసి......" ఇంకా ప్రొఫెసర్ మాట పూర్తి కాకముందే—

"ఓ, ఎస్. ఎస్ ప్రొఫెసర్! వెల్‌కమ్, వెల్‌కమ్!" అన్నాడు పృథ్వీరాజ్ తలుపుకడ్డం తొలుగుతూ.

ప్రొఫెసర్ లోనికి అడుగు పెట్టగానే గది మధ్య సోఫాలో కూర్చున్న ప్రిన్స్ ఖాసిమ్ నవ్వుతూ– "రండి ప్రొఫెసర్! మీకోసమే ఎదురు చూస్తున్నాను" అన్నాడు.

"థాంక్యూ, యువర్ ఎక్సిలెన్సీ!" అంటూ వెళ్ళి అతని ముందు ఒదిగి కూర్చున్నాడు ప్రొఫెసర్.

"బహుశా, మిస్ లోరెన్స్ మీకన్ని విషయాలూ చెప్పి వుంటుంది!" అన్నాడు ప్రిన్స్ హుక్కా పీలుస్తూ.

"ఎస్, యువర్ ఎక్సలెన్సీ! నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నేను ప్రాణసంకటంలో వున్న విషయం మీ కెలా తెలిసిందా అని?"

ప్రిన్స్ నవ్వి– "మాకూ ఆరితేరిన ఒక ఇంటెలిజెన్స్ సంస్థ వుందని మరవకండి ప్రొఫెసర్! ప్రపంచంలో ఏ మూల ఏంజరుగుతుందో మాకు చిటికెలో తెలిసిపోతుంది."

"మీరూ, ప్రొఫెసర్ బీరేంద్రనాథ్ ముఖర్జీ ఒకప్పుడు భారతదేశంలో పనిచేసేవారని నాకు తెలుసు. అంతేకాదు, ఏ కారణాలవల్లో మీకు మీ దేశం నచ్చక, అక్కణ్ణించి పారిపోయేరు. ప్రస్తుతం మీరిద్దరూ ఇక్కడ ఎఫ్ సైన్ అనే గ్యాస్ తయారుజేస్తున్నారనీ నాకు తెలుసు.

మీరీదేశంలో సజీవంగా వున్నట్టు భారతదేశం పసిగట్టింది. దేశద్రోహ నేరంకింద మీ ఇద్దర్నీ బంధించి తీసుకురమ్మని కొమ్ములు తిరిగిన తన ఏజంట్లని పంపింది. ఒకవేళ సజీవంగా తీసుకురావడం సాధ్యపడక పోతే, ఇక్కడే చంపివెయ్యమని ఆదేశించింది. ఏ క్షణంలోనైనా వారు మీ ప్రాణాలు తియ్యవచ్చు.

ఈ విపత్కర పరిస్థితి నించి నేను మిమ్మల్ని కాపాడగలను ప్రొఫెసర్! నిజానికి నేను మీతో ఒక ఒప్పందం కుదుర్చుకోడానికే ఇక్కడికి వచ్చేను" అన్నాడు తాపీగా హుక్కా పీలుస్తూ.

"ఏమిటది?" అడిగేడు ప్రొఫెసర్ కుతూహలంగా.

ప్రిన్స్ నోట్లోంచి హుక్కా తీసి– "మీరు తయారుజేస్తున్న ఆ గ్యాస్ మాకు కావాలి. మా అరబ్బు దేశాలు ఎప్పుడూ యుద్ధజ్వాలాల్లో మునిగి తేలుతుంటాయని మీకు తెలిసిందే కదా?

ఇరవైకి పైనవున్న, ఆసియాలోకెల్లా అతిసంపన్నమైన మా అరబ్బుదేశాలు, జానెడు ఇంగ్రాయిల్ చేతిలో రెండుసార్లు చిత్తుగా ఓడిపోయిన విషయమూ మీకు తెలిసిందే కదా?

అన్ని దేశాలూ కలిసి కట్టుగా యుద్ధంలో పాల్గొన్నా పిడికెడు ఇజ్రాయిల్ ని లొంగదియ్యలేకపోయాం. ఎంత నామోషీ! ఎంత సిగ్గుచేటూ!

అప్పుడే మీ గ్యాస్ విషయం మాకు తెలిసింది. దాన్ని మా చేజిక్కించుకుని, ఇజ్రాయిల్ సైన్యాల మీదికి వదిలి, మాకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోవాలని నిశ్చయించేము. ఈ ఒప్పంద వల్ల మీకూ మాకూ అన్నివిధాలా లాభం చేకూరుతుంది.

కొలంబోలో చెడిపోయిన నా జెట్ విమానం ఇప్పుడు ఇక్కడి ఏర్పోర్ట్ లో వచ్చి రెడీగా ఉంది. మిమ్మల్ని ఆ భారత గూఢచారుల బారినించి తప్పించి, సురక్షితంగా మా దేశానికి తీసికెళ్తాం.

అంతేకాదు, మీ ఇద్దరి పేర ఐదు లక్షల డాలర్ల చొప్పున స్విడ్జర్లాండ్ బ్యాంకుల్లో జమజేస్తాం. మా దేశంలో మీరు సుఖంగా బ్రతకడానికి అవసరమైన అన్ని సౌకర్యాలూ కలిగిస్తాం.

భారత గూఢచారులు మీకోసం మా దేశంలో ప్రవేశించే ప్రసక్తే లేదు. ఒకవేళ తెగించి ప్రవేశించినా, అరబ్బు దేశాలన్నిటికీ చెప్పి భారతదేశానికి పెట్రోల్ సరఫరా నిలిపివేస్తాం. దాంతో, ఇండియా మీ విషయంలో కిక్కురుమనకుండా ఊరుకుంటుంది. ఏమంటారు?" అడిగేడు.

"మా కోసం ఇంత మంచి ఆలోచన జేసిన మీకు ఏ విధంగా కృతజ్ఞతలు తెలుపుకోవాలో అర్థంకావడంలేదు? కాని, ఇక్కడి ప్రభుత్వంతోనూ మాకో ఒప్పందం వుందే!" అన్నాడు ప్రొఫెసర్ సందేహిస్తూ.

పకపక నవ్వేడు ప్రిన్స్- "వేలెడంత ఈ కర్ కాయి ప్రభుత్వం మీకేం ఇవ్వగలదు ప్రొఫెసర్? ఈ ద్వీపం మా కంట్రీ చుట్టుపక్కలెక్కడైనా వుంటే ఈపాటికి దీన్ని కొనేసేవాళ్ళం!

మా దేశంలో మీకు వసతీ, నౌఖర్లూ కాక, రోజుకో అందమైన అమ్మాయి ఏ దేశంనించి తెప్పించమన్నా తెప్పించి ఇవ్వగలం. ఆ ఐదులక్షలే గాక, మీ ఇద్దరికీ సాలీనా ఏభైవేల డాలర్లు జీతంగా ఇవ్వబడతాయి. అంతే కాదు, మిస్ లోరెన్స్‌ని కూడా కొనగలను!"

మిస్ లోరెన్స్, రోజుకో అందమైన విదేశీ యువతి, సాలీనా ఏభైవేలూ, బ్యాంకులో ఐదు లక్షలూ వినగానే ప్రొఫెసర్ కళ్ళు తళతళ మెరవసాగేయి.

"ఆల్ రైట్ యువర్ ఎక్సిలెన్సీ! మీ ఒప్పందాన్ని స్వీకరిస్తున్నాను. ఇప్పుడే వెళ్ళి ప్రొఫెసర్ ముఖర్జీని రాజీకి ఒప్పిస్తాను." అన్నాడు ఆనందంగా.

"వెరీగుడ్ ప్రొఫెసర్! మీ నిర్ణయం అభినందించ తగ్గది. ఇంతకీ ఇక్కడి లేబొరేటరీలో ఆ గ్యాస్ ఎంత వరకు తయారైంది?" అడిగేడు ప్రిన్స్ కుతూహలంగా.

"సగం పని ముగిసింది. మరికొద్ది రోజుల్లో కావాలసినంత ప్రమాణంలో గ్యాస్ తయారుజేసుకునే స్థితికి వస్తాం."

"ఐతే ఈ విషయంలో నాదొక షరతుంది!"

"ఏమిటది?"

"ఎట్టి పరిస్థితిలోనూ ఆ గ్యాస్ గానీ, దాని ఫార్ములా గానీ ఈ దేశంలో వుండకూడదు. ఇక్కడి లేబొరేటరీలో ఆ గ్యాస్ గనక తయారౌతుంటే, మా శత్రుదేశం కూడా దాన్ని కొని మా మీద ఉపయోగించవచ్చు. అప్పుడు మేమింత ఖర్చుపెట్టడం దండగే కదా?" అన్నాడు ప్రిన్స్.

"ఐతే ఏం జెయ్యమంటారు?"

"ఆ గ్యాస్‌తోబాటు ఆ లేబొరేటరీని ఇక్కడే ధ్వంసంజేసి ఫార్ములాని మీతోబాటు మా దేశానికి తీసుకురండి. ఏమంటారు?"

"మీ ఆలోచన సమంజసంగానే వుంది. కాని, లేబొరేటరీని ఎలా ధ్వంసం జెయ్యగలం? దానిచుట్టూ అంత పెద్ద సెక్యూరిటీ ఫోర్స్ కాపలా వుంటుంది కదా? అది సాధ్యమేనా?"

ప్రిన్స్ నవ్వి - "తలుచుకుంటే, సాధ్యంకానిది ఏముంది ప్రొఫెసర్? సైంటిస్టులైన మీరే ఇలా అంటే ఎలా? చాలా సింపుల్ మేటర్! మీకు కొన్ని టైం బాంబులిస్తాం. లేబొరేటరీలోకి వెళ్ళడానికి మిమ్మల్ని అడ్డగించే వాళ్ళెవ్వరూ లేరు. బాంబులు జేబులో వేసుకుని లేబొరేటరీకి వెళ్ళండి. ముందు ప్రొఫెసర్ ముఖర్జీకి అన్ని విషయాలూ విపులంగా చెప్పి ఆయన్ని ఒప్పించండి. తరవాత ఇద్దరూ కలిసి ఆ బాంబులు లేబొరేటరీలోని ముఖ్యమైన ప్రదేశాల్లో పెట్టి టైం ఫిక్స్ జెయ్యండి.

ఆ పని అయ్యేక, ప్రెసిడెంట్ ఫెర్నాండెజ్‌ని కలుసుకోడానికి వెళుతున్నామని కాపలా వాళ్ళకి చెప్పి, అక్క

ణించి బైలుదేరి మూడో కంటికి తెలీకుండా ఏర్‌పోర్ట్ జేరుకోండి.

అక్కడ నా విమానం సిద్ధంగా వుంటుంది. అందులో నేనూ మిస్ లోరెన్స్, నా సెక్రెటరీ కూర్చుని మీకోసం ఎదురు చూస్తుంటాం. ఏమంటారు?'' అన్నాడు.

ప్రొఫెసర్ వెంటనే పలకలేదు. కాసేపు తీవ్రంగా ఆలోచించి, చివరికి తలెత్తి_ ''ఆల్ రైట్ యువర్ ఎక్సెలెన్సీ!'' అన్నాడు గంభీరంగా.

ప్రిన్స్ తన సెక్రెటరీ వైపు తిరిగి_ ''ప్రొఫెసర్‌కి టైంబాంబ్స్ ఇవ్వు!'' అన్నాడు నవ్వుతూ.

# 10

ఏర్‌పోర్ట్‌లో_హాంగర్ బైట రన్ వే మీద ఎగరడానికి సిద్ధంగా వుంది ప్రిన్స్ విమానం! దాని మీద కువైట్ దేశపు రాజముద్ర స్పష్టంగా కనిపిస్తోంది. కువైట్ అనుమతితో భారత ప్రభుత్వం ముందే ఆ ఏర్పాట్లు జేసింది.

అందులో_డేవిడ్, పృథ్వీరాజ్, రాజారెడ్డి, షీలా కూర్చుని ప్రొఫెసర్ల రాకకోసం ఎదురు చూస్తున్నారు. రాజారెడ్డి ఓ మూలకి ఒదిగి కూర్చున్నాడు. డేవిడ్ బైనాక్యులర్స్ ద్వారా పార్కింగ్ ప్లేస్‌వైపు చూస్తున్నాడు ప్రొఫెసర్ల జీప్ ఎప్పుడు వస్తుందా అని!

సరిగ్గా ఎనిమిదిన్నరకి ఓ జీపు వచ్చి పార్కింగ్‌లో ఆగింది. అందులోంచి దిగిన ఇద్దరు వ్యక్తుల్ని చూడగానే_

''వాళ్ళు వచ్చేశారు!'' అన్నాడు డేవిడ్ ఉత్సాహంగా.

అందరి మనసులూ కుదుటబడ్డాయి.

ప్రొఫెసర్లిద్దరూ జాగ్రత్తగా అటూ ఇటూ చూసుకుంటూ గబగబ విమానం వైపు వస్తున్నారు.

వాళ్ళు విమానాన్ని సమీపించగానే— "వెల్‌కమ్ ప్రొఫెసర్స్" అన్నాడు డేవిడ్.

ఇద్దరూ మెట్లెక్కి విమానంలో అడుగు పెట్టేక, పృథ్వీరాజ్ స్టెప్స్ లోనికి లాగి తలుపులు మూసేడు. లోపల షీలని చూడగానే ప్రొఫెసర్ అగర్వాల్ కళ్ళు తళతళ మన్నాయి.

"లేబొరేటరీలో టైంబాంబ్ పెట్టేరా ప్రొఫెసర్స్?" అడిగాడు ప్రిన్స్ వేషంలో వున్న డేవిడ్.

"ఎస్ యువర్ ఎక్సిలెన్సీ! సరిగ్గా తొమ్మిది గంటలకి అవి పేలేలా టైం ఫిక్స్ జేశాం. అంతా మీరు కోరిన ప్రకారం జరిగింది. ఇదుగో, ఆ ఫార్ములా కూడా తెచ్చాం." అంటూ మడత పెట్టిన అరఠావు సైజు కాగితాల కట్ట తీసి ప్రిన్స్ చేతికిచ్చేడు అగర్వాల్.

ముందే కంట్రోల్ రూంనించి ఎగరడానికి అనుమతి కోరి రెడీగా వున్నందువల్ల, ప్రొఫెసర్లు లోనికి రాగానే పైలెట్లు ఇంజన్ స్టార్ట్ జేసేరు. విమానం రన్ వే మీద కొద్ది దూరం పరిగెత్తి గాలిలోకి ఎగిరింది.

డేవిడ్ ఫార్ములా కాగితాలు అందుకోగానే, వాటిని మూల కూర్చున్న రాజారెడ్డి కందించేడు.

"వారెవరు?" అడిగేడు అగర్వాల్ ఆశ్చర్యంగా.

"ఓ, మరిచేను. మీరీయన్ని ఇంతవరకూ చూడలేదు కదూ? ఈయన పేరు షేక్ అమానుల్లా! నా ముఖ్య సలహాదారు!" అంటూ పరిచయం జేసేడు డేవిడ్.

"గ్లాడ్ టు సీయూ ప్రొఫెసర్స్!" అంటూ వాళ్ళకి షేక్‌హాండ్ ఇచ్చేడు రాజారెడ్డి.

అందరి కళ్లూ చటుక్కున రిస్టువాచీల మీదికి మళ్లేయి. తొమ్మిదికి రెండు నిమిషాలు తక్కువ. అప్పటికే విమానం చాలా పైకి వచ్చేసింది.

అందరూ కిటికీలగుండా కింద చీకట్లోకి చూడసాగేరు. సరిగ్గా తొమ్మిది గంటలకి, లిప్తపాటు పెద్ద వెలుగు కనిపించి మరుక్షణం దిక్కులు పిక్కటిల్లే బ్రహ్మాండమైన ప్రేలుడు వినిపించింది. కింద మంటలు మిణుకు మిణుకుమంటున్నాయి.

ప్రొఫెసర్ల వైపు తిరిగి "థాంక్యూ ప్రొఫెసర్స్! మేము వేసిన ఎత్తుకు చిత్తై మీ చేజేతులా మీరు సృష్టించిన గ్యాస్‌ని ధ్వంసం జేసి, మీ అంతట మీరే వచ్చి మా వలలో పడ్డందుకు మెనీ థాంక్స్!" అన్నాడు డేవిడ్ తలమీది పాగా, అతికించుకున్న మీసాలూ తీసి వేస్తూ.

అతనితోబాటు రాజారెడ్డీ తన ఇండోనేషియన్ మేకప్ తీసి అవతల పడేసేడు. షీల కూడా నవ్వుతూ తల మీది రాగి వర్ణం విగ్గు తీసి కింద పడేసింది.

ప్రొఫెసరిద్దరూ దిగ్భ్రాంతితో ఇదంతా చూస్తున్నారు.

అగర్వాల్ తేరుకుని_ "ఏమిటీ నాటకం? ఎవరు మీరు?" అన్నాడు లేచి నిల్చుంటూ.

రాజారెడ్డి నవ్వి_ "భారత గూఢచారులం! ఇప్పుడు మీరిద్దరూ మా సజీవ ఖైదీలు. మాతృదేశ ద్రోహానికి మీ మీద మిలిటరీ కోర్టులో విచారణ జరుపబడుతుంది. యావజ్జీవ ఖైదు, లేదా మరణశిక్ష పడవచ్చు!" అన్నాడు.

ప్రొఫెసర్ ముఖర్జీ భయంతో గావుకేక పెట్టి ఫిట్స

వచ్చిన రోగిలా వణుకుతూ కూర్చున్న చోటే మూర్ఛ పోయేడు.

"యూ బ్రూటస్!" అంటూ ప్రొఫెసర్ అగర్వాల్ పిచ్చి ఆవేశంతో రాజారెడ్డి మీదికి ఉరికేడు.

రాజారెడ్డి మెరుపులా పక్కకి తప్పుకుని, అరచేతి అంచుతో ప్రొఫెసర్ మెడమీద ఒక్కటి ఇచ్చేడు. అత నా దెబ్బనించి తేరుకోకముందే పిడికిలి బిగించి డొక్కలో కుమ్మేడు. ప్రొఫెసర్ ఇక తట్టుకోలేక మొదలు నరికిన చెట్టులా కింద కూలేడు.

దోషుల్ని మోసుకుంటూ విమానం భారతదేశం వైపు శరవేగంతో దూసుకుపోసాగింది!

—: ఐ పో యిం ది :—

# దొంగనోట్లు - దొరబిడ్డలు!

యం. కె. వి. శాస్త్రి

సాయంత్రం నాలుగు గంటలయింది.

సెయింట్ మేరీస్ కాన్వెంటు పిల్లలు గుంపులుగా బైటికి వస్తున్నారు. ముదురు ఆకుపచ్చని కాన్వెంటు డ్రెస్సులో వున్న విద్యార్థినులు అందంగా కనిపిస్తున్నారు.

అంతవరకు కారులో కూర్చుని ఎదురుచూస్తున్న వ్యక్తి కారు దిగి డోరు లాక్ చేసి, సిగరెట్టు ఆఖరి దమ్ము ఘాటుగా పీల్చి, సిగరెట్టు బూటు కింద నలిపేసి, కాన్వెంటు గేటుని సమీపించాడు.

విద్యార్థినులు కాన్వెంటు ఆవరణ దాటి అక్కడకు కొంచెం దూరంలో వున్న బస్సు స్టేండుకి చేరుకుంటున్నారు సిటీ బస్సు కోసం.

ఒక్కొక్కరినే నిశితంగా పరీక్షచేస్తూ మూడు నిమిషాలు గడిపేడు. అతనిలో సహనం నశిస్తోంది. ఆదుర్దాగా నాలుగు వైపులా పరకాయించి చూస్తున్నాడు.

అంతలో అతని కళ్ళు ఆనందంతో మెరిశాయి, దూరంగా వస్తున్న ఒక అమ్మాయిని చూచి.

"నీ పేరు నిర్మల కదూ!" అన్నాడు లాలనగా, ఆ అమ్మాయి దగ్గరకు రాగానే.

ఆగంతకుడికేసి ఒక్క క్షణం పరీక్షగా చూసి 'ఔను' అంది వినయంగా.

"నా పేరు రాజగోపాల్. మీ నాన్నగారు నేను చిన్ననాటి స్నేహితులం. నాకు ఈ మధ్యనే ఈ ఊరు ట్రాన్సర్ అయింది. మా అమ్మాయి ప్రమీలని ఈ కాన్వెంటులో చేర్పించడానికి, మీ ప్రిన్సిపాల్‌తో మాట్లాడి వెళ్ళిపోతుంటే నువ్వు కనిపించావు. ఎప్పుడో ఆరు సంవత్సరాల క్రిందట చూశాను నిన్ను, చాలా మారి పోయావు. బహుశా నన్ను నువ్వు గుర్తుపట్టలేక పోవచ్చు" అన్నాడు.

"క్షమించాలి! నాకు గుర్తు లేదు. అన్నట్టు ప్రమీల ఎక్కడ వుంది. సీటు దొరికిందా?" అంది కుతూహలంగా.

"ప్రమీలని తీసుకుని రాలేదు. ఆఫీసు నుంచి నేరుగా నేను ఒక్కడిని వచ్చాను. ప్రమీలకి సీటు దొరికింది, రేపు తీసుకువచ్చి చేర్పించాలి" అన్నాడు.

"ప్రమీల ఏ క్లాసు?"

"నైంత్!"

"రియల్లీ అయామ్ లక్కీ. నేను కూడా నైంత్ క్లాసే" అంది నిర్మల సంతోషంతో.

చిరునవ్వు నవ్వేడు రాజగోపాల్ వాత్సల్యంగా.

"నేను యిప్పుడు మీ నాన్నగారిని కలుసుకుందుకు వెడుతున్నాను. మీ నాన్నని 'సర్ ప్రైజ్' చేయాలి. అసలు నేను యిక్కడికి వచ్చినట్టు ఫోన్ కూడా చెయ్యలేదు. నిర్మలా నాతో రామ్మా, కారులో పోదాం" అంటూ కారు కేసి నడక సాగించేడు. నిర్మల ఆనందంగా అనుసరించి కారులో కూర్చుంది. కారు బయలుదేరినిది.

"మీ తమ్ముడి పేరు రవి కదూ" అన్నాడు రాజగోపాల్.

"ఔనండి!" అంది నిర్మల.

"ఎక్కడ చదువుతున్నాడు?"

"సెంట్ ఫెడరిక్ యూరోపియన్ కాన్వెంటులో!"

"మనం ఆ కాన్వెంటు ముందునుంచే కదూ పోవలసింది?"

"ఔనండి! నాలుగున్నరకి లాంగ్ బెల్ ఔతుంది."

"పోనీలే కొంచెంసేపు ఆగుదాం. రవిని కూడా మనతో తీసుకుని వెడదాం!" అన్నాడు రాజగోపాల్.

నిర్మల మనస్సు సంతోషంతో గంతులు వేసింది. నాన్నగారికి ఎంతమంది స్నేహితులు, పరిచయస్తులు. ఎంతో ఆత్మీయతతో పలుకరిస్తారు తనని, రవిని, అంతా. ఈ రాజగోపాల్ గారు కూడా చాలా మంచివారులా వున్నారు. రేపటినుంచి తనకి, ప్రమీలతో స్నేహం ఏర్పడుతుంది. ఇద్దరం కలసి ఆనందంగా వుండవచ్చు, ఊహాలోకంలో విహరిస్తోంది, నిర్మల.

నిర్మల కారులోంచి చూస్తోంది, రాజగోపాల్ రవితో మాట్లాడుతూ కారుకేసి చూపిస్తున్నాడు. కారులోంచి

నిర్మల చేయి ఊపి, రమ్మని పిలుస్తోంది రవిని. రవి చిరునవ్వు నవ్వి చేయి ఊపి కారు దగ్గరికి నడిచి వస్తున్నాడు, రాజ గోపాల్‌తో.

రవి, నిర్మల కారు వెనకసీట్లో చెరో డోరు దగ్గర కూర్చుని రోడ్డుమీది జనాన్ని, కోలాహలాన్ని చూస్తూ మాట్లాడుకుంటున్నారు. డోర్ గ్లాసెస్ పైకి యెత్తివేయ బడి వున్నాయి.

రోడ్డుమీద వెడుతున్న తన క్లాస్‌మేట్సుని కారు లోంచి పలకరించాలని అనుకున్న రవికి అది నిరాశ కలిగించింది.

కారు క్రమంగా వేగం పుంజుకుంది. కారు సిటి లిమిట్సు దాటి 'ఇండస్ట్రియల్' యస్టేట్ రోడ్డు పట్టింది. సిటి దూరంగా కనుమరుగైపోతోంది. ఇండ్లు అక్కడొకటి అక్కడొకటి కనిపిస్తున్నాయి.

అంతవరకు వేగంగా పోతున్న కారులోంచి విశాలమైన వీధుల్లో, హడావిడిగా తిరుగుతున్న వాహనాలని, జనాన్ని చూసి మైమరచిపోతున్న రవి, నిర్మల ఈ లోకంలోకి వచ్చారు. అనుమానంగా ఒకరికేసి ఒకరు చూసుకున్నారు. మనసులతో ఆందోళన, గాభరా, భయం, మాటరాని మూగవాళ్ళల్లాగ సంజ్ఞలు చేసుకుంటూ వుండిపోయారు చాలా సేపు.

డ్రైవింగ్ సీట్లో కూర్చుని, తదేకంగా, నిశితంగా రోడ్డు మీద దృష్టి నిలిపి, స్టీరింగు అతి చాకచక్యంగా తిప్పు తున్న రాజగోపాల్ కేసి చూసింది నిర్మల.

రాజగోపాల్ గంభీరంగా కనిపించాడు. ఇంతకు ముందు వున్న సౌమ్యత, వాత్సల్యం అతని ముఖంలో కనిపించటం

లేదు. పలకరించడానికి కూడా భయంగా వుంది.

రవిది కొంచెం దురుసు స్వభావం. సీటులోంచి లేచి, నిటారుగా నిలబడి "మమ్మల్ని ఎక్కడికి తీసుకు వెడుతున్నారు సార్? మీరు నిజంగా మా నాన్నగారి స్నేహితులా? అసలు మీరు ఎవరు?" కోపంగా ప్రశ్నించాడు.

"హుష్! అల్లరి చెయ్యకుండా బుద్ధిగా కూర్చోండి" అన్నాడు రాజగోపాల్ కోపంగా.

రవి భయపడలేదు. వెనకనుంచి రాజగోపాల్ భుజాలు బలంగా కుదుపుతూ 'కారు ఆపమని' కేకలు వేశాడు.

రాజగోపాల్ కుడి చెయ్యి స్టీరింగు మీదనుంచి జేబులోకి వెళ్ళింది. జేబులోంచి ఫిస్టల్ బైటకు తీశాడు. సుతారంగా గాలిలో ఊపుతూ "అల్లరి మానకపోతే, ఫిస్టల్‌తో పేల్చి చంపేస్తాను, బుద్ధిగా కూర్చో!" అన్నాడు. ఆ గొంతుకలో జాలి లేదు.

రవి అవాక్కయిపోయాడు. ఒళ్ళంతా చెమటలు పట్టేయి. గమ్మున నిర్మల, రవిని పట్టుకుని సీటులోకి లాగింది. ఇద్దరికి 'పై ప్రాణాలు పైకి పోయినట్టుగా' వుంది.

రోడ్డుమీద జనసంచారం బాగా తగ్గిపోయింది. అప్పుడప్పుడు కార్లో, లారీయో ఇటు, ఇటు పరుగెడుతున్నాయి. కారు డోర్స్ మూసివుండడంవల్ల యింజను హోరు, హారన్ తప్ప, మరే శబ్దం వినబడటం లేదు.

## 2

కారు ట్రంకురోడ్డు మీదనుంచి కుడివైపుకి తిరిగి తారు రోడ్డు పట్టింది. దూరం నుంచే రాజగోపాల్ కారు హారన్ ఆగి ఆగి వినిపిస్తున్నాడు. ఎడమవైపు వున్న పెద్ద బంగళా

గేటు తెరుచుకుంటోంది. కారు గేటులోంచి లోపలికి వెళ్ళి బంగళా వెనక్కి పరుగెత్తి చెట్టుకింద ఆగింది.

రాజగోపాల్ కారు దిగి 'అప్పన్నా!' అని కేక వేశాడు. గేటు మూసి అప్పన్న కారు దగ్గరకు పరుగెత్తుకు వచ్చాడు.

విశాలమైన మూడు అంతస్తుల భవంతి అది. చుట్టూ ఎత్తైన ప్రహరీ గోడలు. బంగళా చుట్టూ పెద్ద పెద్ద చెట్లు. అందమైన పూదోట. బంగళాకి దూరంగా అక్కడక్కడ వున్నాయి మిగిలిన బంగళాలు. సిటీకి దూరంగా వుండడం వల్ల చాలా నిశ్శబ్దంగా వుంది అక్కడి వాతావరణం.

"మిగిలిన వాళ్ళు ఎక్కడ వున్నారు?" అన్నాడు రాజగోపాల్ దర్పంగా సిగరెట్టు వెలిగిస్తూ.

లోపలనుంచి మరో యిద్దరు పరుగున బైటకి వచ్చారు. కండలు తిరిగిన వస్తాదుల్లా వున్నారు. కారు డోర్సు తీసి చెరో వస్తాదు నిర్మలని, రవిని ఎత్తుకుని బంగళాలోకి నడిచారు, అరవకుండా నోళ్ళు అరచేతులతో నొక్కిపట్టి.

మేడమీద గదిలోకి తీసుకువెళ్లేరు వస్తాదులు నిర్మలని, రవిని.

బిక్కు బిక్కు మంటున్నాయి వాళ్ళ ప్రాణాలు. మాట్లాడటానికి కూడా నోళ్ళు పెగలటం లేదు.

గదిలోకి ఒక అజానుబాహువు వచ్చాడు. ఫుల్ సూటులో వున్నాడు. చేతిలో సిగరెట్టు వెలుగుతోంది.

వస్తాదులు చల్లగా బైటకి జారుకుని తలుపులు జార్లేసి వెళ్ళిపోయారు.

"నా పేరు జాన్. ఇక్కడ మీకు ఎటువంటి భయం వుండదు. మీకు ఏది కావలసి వచ్చినా, యిదిగో ఈ

కాలింగ్ బజర్ మ్రోగించండి. క్షణంలో తీసుకువచ్చి యిస్తారు!" అన్నాడు.

జాన్ పెద్దమనిషిలా, ఆత్మీయుడిలా కనిపించాడు. నిర్మల, రవికి కొంచెం ధైర్యం కలిగింది.

"మమ్మల్ని మా యింటిదగ్గర దింపెయ్యండి. మా అమ్మ, నాన్న మా కోసం యెదురుచూస్తూ వుంటారు. మాకు యిక్కడ భయంగా వుంది." అంది నిర్మల కాస్త ధైర్యం పుంజుకుని.

"మరి అలా పేచీ పెడితే నాకు కోపం వస్తుంది. కోపం వస్తే నేను చాలా చెడ్డవాడిని. నేను చెప్పినట్టు నడచుకుంటే మీకు యిక్కడ యే లోటు రానివ్వను. మీరు యిక్కడ ఈ గదిలో కొద్ది రోజులదాకా వుండ వలసిందే, యిదిమటుకు తప్పదు. మీరు ఏడ్చి మొత్తుకున్నా ఏ పరిస్థితుల్లోనూ మిమ్మల్ని యింటికి పంపించను, సరికదా మీకు అన్నం నీరు యివ్వను, అర్థమైందా!" అన్నాడు జాన్.

అలాగే అన్నట్టు తలలు ఊపేరు.

"గుడ్ అలా వుండాలి. మీరు నాకు ఎంతో నచ్చారు. ఈ క్షణంనుంచి నేను మీ స్నేహితుణ్ణి." అన్నాడు జాన్.

నిర్మల, రవి అర్థంకానట్టు అలాగే చూస్తూ వుండి పోయారు.

జాన్ బజర్ మ్రోగించాడు.

మూడు నిమిషాల తర్వాత తలుపు తీసుకుని చేతిలో ట్రే పట్టుకుని లోపలికి ప్రవేశించాడు ఒక ముసలాడు. వయసు మళ్ళినా ధృఢంగా వున్నాడు. ట్రే టీపాయ్ మీద పెట్టేడు.

పూరీలు, లడ్డులూ, బిస్కట్లు ప్లేట్లలో సర్ది పెట్టేను.

"అదిగో అది బాత్రూం, లోపలే లెట్రిన్ కూడా వుంది. ఆ మూల కూజాలో మంచినీళ్ళు, ఈ పక్కనున్న అలమారులో రకరకాల పుస్తకాలు. ఇంకా ఏమేం కావాలన్నా క్షణాలమీద మీ ముందు ఉంటాయి. దేనికి భయపడకుండా అడగండి. ఎవరైనా మీ మాట వినకపోతే నాతో చెప్పండి. వాళ్ళ అంతు చూస్తాను. సరేనా. ముందు ఫలహారాలు కానివ్వండి. తీరుబడిగా తర్వాత మాట్లాడుకుందాం" అంటూ బైటికి వెళ్ళిపోయి, అవతల నించి తాళం పెట్టుకుని, వెళ్ళిపోయాడు.

ఏడిస్తే తిడతాడేమో! అని భయంతో ఆపుకున్న కన్నీళ్ళు జాన్ బైటకి వెళ్ళిపోగానే వర్షించడం మొదలు పెట్టేయి.

ఒకళ్ళనొకళ్ళు, ఓదార్చుకుంటూ అరగంట సేపు కుళ్ళి కుళ్ళి ఏడుస్తూ గడిపారు నిర్మల, రవి.

చాలాసేపు ఏడవడం వల్ల నీరసం ఆవరించుకుంది. మనస్సు తేలికయినట్టు అనిపించింది. ఆత్రంగా టిఫిన్ పూర్తిచేసి, పాలు త్రాగి, పరుపుల మీద వాలిపోయారు. నిద్ర పట్టేసింది.

## 3

బేంకు స్టాఫ్ అయిదు గంటల తర్వాత ఒక్కొక్కళ్ళూ వెళ్ళిపోయారు. ఏజంటు కృష్ణమూర్తి, హెడ్ ఎకౌంటెంటు, హెడ్ కాషియర్, ఆ రోజు ట్రాన్సాక్షన్స్ పూర్తి చేసుకుని 'సేఫ్' లాక్ చేసుకుని, హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. ఏజంటు కృష్ణమూర్తి దగ్గర సెలవు తీసుకుని హెడ్ కేషియర్ కూడా వెళ్ళిపోయారు.

బేంకు ఫ్యాన్ తాళాలు అన్నీ వేసి, ఏజంటుకు యిచ్చి వెళ్ళిపోయాడు. సాయంత్రం అయిదుంపావు అయింది.

ఏజంట్ కృష్ణమూర్తికి బ్యాంకు మేడమీద క్వార్టర్సు యిచ్చారు. మేడ ఎక్కి యింటిలోకి అడుగు పెడుతూనే "శాంతా పిల్లలు యింకా రాలేదా?" అన్నాడు.

"నేను యిందాకటినుంచి చూస్తున్నాను. అయిదున్నర కూడా ఐపోవచ్చింది, ఎప్పుడూ యింత ఆలస్యం అవలేదు!" అంది శాంత గాభరాగా.

"ఏవో స్పోర్ట్సు జరుగుతున్నాయేమో! వచ్చేస్తారులే!" అన్నాడు కృష్ణమూర్తి బట్టలు మార్చుకుంటూ.

సోఫాలో కూర్చున్నాడు కృష్ణమూర్తి. శాంత కాఫీ అందించింది. "టిఫిన్ పిల్లలు వచ్చిన తర్వాత తీసుకుంటారా?" అంది.

"ఔను! పిల్లలతో కాలక్షేపంగా తీసుకుంటాలే!" అన్నాడు.

కృష్ణమూర్తి, శాంతలకు ఇద్దరు పిల్లలు, కూతురు, కొడుకూను. చాలా అందంగా, ఛలాకీగా వుంటారు.

కూతురు నిర్మల పదిహేను సంవత్సరాల వయస్సుంది. నైంత్ చదువుతోంది సెయింట్ మేరీస్ కాన్వెంటులో. కొడుకు రవికి పదమూడు సంవత్సరాలు. సెవెంత్ చదువుతున్నాడు, సెయింట్ ఫెడరిక్ యూరోపియన్ కాన్వెంటులో.

ఎంతో చిన్న వయస్సులోనే బేంకు పరీక్షలు చకచక పాసవడం వల్ల, అదృష్టం కలిసిరావడం వల్ల కృష్ణమూర్తికి ఏజంటుగా ప్రమోషన్ వచ్చింది. రెండు సంవత్సరాల క్రిందట 'రాజంపేట' కొత్త బ్రాంచి తెరవడం, తను ఆ

కొత్త బ్రాంచికి రావడం జరిగింది.

అసలు రాజంపేటలో కొత్త బ్రాంచి తెరవడంలో ఒక ముఖ్య కారణం ఏమిటంటే, అక్కడకు పాతిక మైళ్ళ దూరంలో 'సిరిపురం' అనే ప్రాంతంలో కొత్త బొగ్గు గనులు పడ్డాయి. బొగ్గు గనులలో మొత్తం మూడువేల మంది కార్మికులకు పని కల్పించబడింది. క్రమంగా అక్కడ ఒక కొత్త గ్రామం వెలసింది.

బొగ్గు గనులలోని కార్మికులు వేతనాల కోసం, యితర 'మనీ ట్రేన్సాక్షన్ల కోసం' రాజంపేటలో కొత్తగా రెండవ బ్రాంచి వెలిసింది.

ఈ రెండు సంవత్సరాల కాలంలో, నిర్మల, రవి, ఇంత ఆలస్యంగా ఎప్పుడు ఇంటికి రావడం జరగలేదు.

సాయంత్రం ఆరు గంటలయింది. శాంతకి, కృష్ణమూర్తికి ఆదుర్దాగా, గాభరాగా వుంది, పిల్లలు ఇంతవరకు రాక పోవడానికి కారణం తెలియక.

"ఒకసారి ఫోన్ చేసి కనుక్కుంటే అసలు సంగతి ఏమిటో తెలుస్తుంది కదా!" అంది శాంత.

కృష్ణమూర్తి ఒక్క క్షణం ఆలోచించి "నిజమే నాకు ఆ ఆలోచనే రాలేదు యింతవరకు" అంటూ ఫోన్ గది లోకి నడిచాడు.

ఫోన్ దగ్గరకు చేరబోతుంటే ఫోన్ గణగణ మ్రోగింది.

నిర్మలో, రవో, ఫోన్ చేసి వుంటారని గమ్మున ఫోన్ తీసి 'హల్లో!' అన్నాడు.

అవతల నుంచి 'ఎవరు మాట్లాడుతున్నది?' అని వినిపించింది. మాట్లాడుతున్నపుడు గొంతుక చిత్రంగా బొంగురుగా వుంది.

"హల్లో! నేను స్టేట్ బ్యాంకు ఏజంటు కృష్ణమూర్తిని, ఎవరు మీరు?" అన్నాడు.

"నా పేరు జాన్! మీ పిల్లలు నిర్మల, రవి ప్రస్తుతం నా బందీలు. వాళ్ళ గురించి మీరు బెంగ పెట్టుకుని, ఖంగారు పడకండి. వాళ్ళకి ఏలోటూ రాకుండా చూసు కుంటున్నాను" అన్నాడు.

"నాన్ సెన్స్! ఎవరు నువ్వు? నా పిల్లలని నువ్వు బందీ చెయ్యడం ఏమిటి, వాళ్ళకి ఏలోటూ రాకుండా చూసు కోడం ఏమిటి? తక్షణం నాకు అప్పగించకపోతే పోలీసు రిపోర్టు యిస్తాను జాగ్రత్త!" అన్నాడు కృష్ణమూర్తి కోపంగా.

"అలా ఖంగారుపడి పోలీసురిపోర్టు యిస్తే మీకు దక్కేది మీ పిల్లలు కాదు; మీ పిల్లల శవాలు, గుర్తుంచు కోండి. మళ్ళీ మీకు రాత్రి పది గంటల తర్వాత ఫోన్ చేస్తాను. ఈ క్షణంనుంచి నా అనుచరులు మిమ్మల్ని, మీ యింటి పరిసరాలని వెయ్యి కళ్ళతో కనిపెడుతూ వుంటారు. మీరు తొందరపడితే అనవసరంగా మీ పిల్లల ప్రాణాలు ఎగిరిపోతాయి జాగ్రత్త!"

"రాక్షసుడా! నువ్వు మనిషివు కాదు. అమాయకులైన నా పిల్లల ప్రాణాలు ఎందుకురా నీకు? నీకు ఏం కావాలి? డబ్బు కావాలా? ఎంత కావాలి? సూటిగా అడుగు" అరిచాడు కృష్ణమూర్తి గట్టిగా.

పకపక నవ్వు వినిపించింది అవతలనించి. "ఆల్ రైట్! ఎందుకు అంత తొందర? రాత్రికి తీరుబడిగా మాట్లాడు కుందాం," అని ఫోన్ కట్ చేశాడు జాన్.

కృష్ణమూర్తికి తల తిరిగిపోతోంది. ఒళ్ళంతా తూలి

పోతోంది. చేతిలోని ఫోన్ జారి కింద పడింది.

శాంత గమ్మున వచ్చి పడిపోతున్న కృష్ణమూర్తిని పొదివి పట్టుకుని, మంచంమీద పడుకోపెట్టింది. ఫోన్ క్రెడిల్ మీద వుంచి, భర్తకి ఉపచర్యలు చేస్తోంది.

శాంత మనస్సు చాలా ఆందోళనకరంగా, బరువుగా, గాభరాగా వుంది. పిల్లలకి ఏదో ప్రాణాపాయం కలిగి వుంటుందని, చాలా ప్రమాద పరిస్థితిలో వున్నారని గ్రహించింది. ఫోన్ సంభాషణ లీలగా విన్న శాంత అంత మటుకు ఊహించ గలిగింది.

పావు గంట తర్వాత స్పృహలోకి వచ్చాడు కృష్ణ మూర్తి. పసివాడిలాగ శాంతని కౌగలించుకుని బావురు మన్నాడు.

"శాంతా! మన పిల్లలు మనకు దక్కుతారంటావా? మనం మళ్ళీ మన పిల్లలని చూసుకోగలమంటావా? భగ వాన్. ఏమిటి ఈ పరీక్ష!" అన్నాడు.

ఇద్దరు ఒకరినొకరు ఓదార్చుకుంటూ, ఏడుస్తూ పది గంటల వరకు గడిపారు.

బల్లమీది టెలిఫోన్ గణగణ మ్రోగింది.

కృష్ణమూర్తి, శాంత ఒక్కసారి ఉలిక్కిపడి ఫోన్ కేసి చూశారు.

ఆ పరిస్థితిలో వాళ్ళకి మ్రోగుతున్న ఫోన్ బుసలు కొడుతూ కాటేయడానికి ఎదురుచూస్తున్న విషసర్పంలా కనిపించింది.

బీరువామీద వున్న గడియారం పది గంటలు చూపి స్తోంది.

నాలుగుగంటల సేపు విరామం లేకుండా ఏడుస్తూ కూర్చోడంవల్ల నీరసం ఆవరించుకుంది. ఎలాగో గోడని ఆనుకుని పడిపోకుండా నిలదొక్కుకుని, భారంగా నడిచి ఫోన్ అందుకున్నాడు కృష్ణమూర్తి. శాంతకూడా భర్త ప్రక్కకు చేరి చెవులు రిక్కించుకుని నిలబడింది.

"హల్లో! నేను, కృష్ణమూర్తిని" అన్నాడు నీరసంగా.

"నేను జాన్‌ని. గుడ్! నా ఫోన్ కాల్ కోసం ఎదురు చూస్తున్నారన్నమాట."

"ఎలా వున్నారు పిల్లలు?" కృష్ణమూర్తి కంఠం బొంగురుపోయింది.

"హాయిగా వున్నారు. సాయంత్రం ఫలహారాలు ముగించుకుని నిద్రపోతున్నారు. పిల్లల గురించి మీకు ఆదుర్దాలనవసరమని యింతకుముందు చెప్పేను కదా!"

"ఫోన్ చేసింది ఈ విషయం చెప్పడానికేనా?"

"నో!నో! అసలు విషయం వేరేవుంది. జాగ్రత్తగా వినండి" చెప్పుకుపోతున్నాడు జాన్.

"ప్రతినెల నాలుగో తారీఖున సిరిపురం కాలరీస్‌కి జీతాల బట్వాడాకోసం యిరవై లక్షల రూపాయలు మీ బేంకునుంచి తీసుకురాబడతాయి. మీ బేంకునుంచి యివ్వబడే నోట్లలో వంద, యాభై రూపాయలనోట్లు వుండకూడదు. పది, అయిదు, డినామినేషన్ నోట్లు మాత్రం వుండాలి. ఎందుకంటే మా దగ్గర వున్న 'దొంగనోట్లు' చెలామణి అవ్వాలి.

మీ బ్యాంకునుంచి కేష్‌తో బయలుదేరిన వేన్ రాజంపేట, సిరిపురం రోడ్డు మధ్యలో అటకాయించబడి, కాష్ పెట్టెలు మార్పిడి జరిగి దొంగనోట్లు జీతాలకింద ప్రజల చేతుల్లో కలిసిపోతాయి. అసలునోట్లు మాదగ్గరకు చేరుకుంటాయి.

మాదగ్గరవున్న యాభైలక్షల రూపాయల దొంగనోట్లు మీద్వారా ప్రజల చేతుల్లోకి చలామణికింద మారిపోవాలి. ఇందులో అసలు మీకు ఎటువంటి ప్రమాదం వుండదని హామీ యిస్తున్నాను. ఎటొచ్చీ, మీరు హెడ్ ఆఫీసు బేంకునుంచి వంద, యాభైరూపాయిల నోట్లు రాకుండా కట్టుదిట్టం చేసుకోవాలి. ఎందుకంటే మేము వంద, యాభై నోట్లతో డీలింగ్ చెయ్యాలి. అవి పెద్దనోట్లు కనుక రిస్కు ఎక్కువగా వుంటుంది.

రెండు రోజుల్లో మా దగ్గరవున్న యాభైలక్షల రూపాయల దొంగనోట్లు, చలామణి పూర్తి కాగానే, మీపిల్లలని సురక్షితంగా మీయింటికి పంపుతాను.

ఈ కార్యక్రమం దిగ్విజయంగా పూర్తి అయితే మీకు పారితోషికంగా లక్షరూపాయలుకూడా అందజేస్తాం. ఏమంటారు!'' అన్నాడు.

''దొంగనోట్ల మారకం చట్టబద్ధమైన నేరం కాదా?''

''నాన్ సెన్స్! పరీక్షగా చూస్తే నేరం కానిది ఏముంది? న్యాయం, ధర్మం, నాకు బోధపరచడానికి ప్రయత్నించక నీకు కావలసింది న్యాయం, ధర్మం అయితే, నువ్వు చూడ గలిగేది నీ పిల్లల ప్రాణంలేని శవాలు, గుర్తుంచుకో!'' జాన్ కంఠం క్రూరంగా పలికింది.

కృష్ణమూర్తి, కాంత అవాక్కయిపోయారు.

''బాగా ఆలోచించుకుని రేపు ఉదయం ఏడు గంట లకి మీ నిర్ణయం చెప్పండి!'' ఫోన్ విసురుగా పెట్టేసిన చప్పుడు వినిపించింది అవతలనుంచి.

ఫోన్ పెట్టేసి కృష్ణమూర్తి బావురుమన్నాడు.

కాంత అతన్ని తీగలాగ పెనవేసుకుపోయింది. ఆ దంప

తుల మనస్సుల్లో తీవ్రమైన తుఫాన్ సంక్షోభం చెల రేగింది. ఏడ్చి ఏడ్చి ఎప్పుడో అర్ధరాత్రి నీరసంతో సొమ్మసిల్లి, కటిక నేలమీద వాలిపోయారు ఇద్దరూ.

## 4

గది తలుపులు నెమ్మదిగా తెరుచుకుంటున్నాయి. ఎవరో లోపలికి వస్తున్నట్టు అడుగులచప్పుడు వినిపిస్తోంది. అప్పుడే మెలకువ వచ్చిన నిర్మల కళ్ళు తెరిచింది.

"రాత్రి బాగా నిద్రపట్టిందా?" అన్నాడు జాన్ గదిలోకి ప్రవేశించి.

గమ్మున లేచి మంచం మీద కూర్చుంది నిర్మల.

"భయపడకు నిర్మలా!" అన్నాడు లాలనగా, నిర్మల పక్కన మంచంమీద కూర్చుంటూ.

రివ్వున లేచినుంచింది నిర్మల. ఒక్క క్షణం అసహ్యంగా చూసింది జాన్ కేసి.

"మమ్మల్ని త్వరగా మా యింటికి పంపెయ్యండి! ఏపాపం చేశామని మమ్మల్ని యిలా అన్యాయంగా, బంధించారు," వెక్కి వెక్కి ఏడుస్తోంది నిర్మల.

ఏడుపు విని రవికి చటుక్కున మెలుకువ వచ్చింది. పులిలాగ గాలిలోకి లేచి జాన్ మెడను బలంగా బిగించాడు.

ఈ హటాత్ పరిణామానికి జాన్‌కి మతిపోయి నట్టయింది.

"మమ్మల్ని మర్యాదగా వదిలిపెడతావా? నీపీక నులిపి చంపెయ్యనా?" ఒగరుస్తున్నాడు రవి, జాన్ మెడ చేతులతో బిగిస్తో, శక్తి అంతా కూడదీసుకుని.

జాన్ విసురుగా మంచంమీద నుంచి లేచి నిలబడి

మనం కనిపించకపోతే ఊరుకుంటారనుకుంటున్నావా? ఈపాటికి మనకోసం అన్నిచోట్ల వెతికించి, పోలీసు రిపోర్టు యిచ్చివుంటారు. ఏ క్షణానికో వెతుక్కుంటూ వచ్చి, మనల్ని తీసుకు వెడతారు. బుద్ధిగా వుండడం నేర్చుకో!" అంది నిర్మల ఓదారుస్తో.

"అలాగే!" అన్నాడు రవి బుద్ధిమంతుడిలా.

# 5

"హల్లో రాత్రంతా బాగా ఆలోచించుకుని యేనిర్ణయం తీసుకున్నారు?" అన్నాడు జాన్ ఫోన్‌లో.

"మీరు చెప్పినట్లే వినాలనుకుంటున్నాను."

"గుడ్! అలా వుండాలి!" అన్నాడు జాన్ మెచ్చుకోలుగా.

"మీరు ఈ క్షణంనుంచి కొన్ని ముఖ్యమైన షరతులు విధిగా పాటించాలి!" అన్నాడు జాన్.

"ఏమిటవి?"

"ముందు నిర్మల, రవి, ఎక్కడికో మీ బంధువుల ఇంటికి వెళ్ళినట్టు, వాళ్ళ కాన్వెంటు అధికారులకి, స్నేహితులకి, మీ యిరుగుపొరుగు వాళ్ళకి, నమ్మేలాగ చెప్పాలి. ఏ పరిస్థితుల్లోను, మీ ముఖాల్లో ఆందోళన, విచారం బాధ కనిపించకూడదు. లేకపోతే అందరికీ అనుమానం దారి తీస్తుంది.

మీ యింటికి మీ స్నేహితులని గాని, బంధువులని కాని ఎవ్వర్నీ రానివ్వకండి. వాళ్ళవల్ల లేనిపోని అనర్ధాలు కలుగవచ్చు. అలాగే మీరుకూడా నా అనుమతి లేకుండా ఊరంతా బలాదూర్లు తిరగకండి.

అన్నట్టు మీ దంపతులని అభినందించలేకుండా వుండ

అరచేత్తో రవి వీపుమీద బలంగా చరిచాడు.

"అమ్మో!" అంటూ పట్టు విడిచి పెట్టి క్రిందపడ్డాడు రవి.

పట్టకాలను ఎడంచేతితో బిగించి, రవిని గాలిలోకి లేపి యిష్టంవచ్చినట్టు గొడ్డును బాదినట్టు బాదాడు జాన్.

రవి ఏడుపు గది అంతా మారుమ్రోగింది.

నిర్మల, జాన్ కాళ్ళమీద పడి "క్షమించి వాణ్ణి వదలి పెట్టండి!" అని రోదించింది.

జాన్ కోపం క్రమంగా చల్లారింది.

"నాకు ఎదురు తిరిగిన వాళ్ళ రక్తం కళ్ళ చూస్తాను. బద్మాష్! నామీద తిరుగబడతావేం? ఈ క్షణంనుంచి మిమ్మల్ని ఆకలితో మాడ్చి చంపేస్తాను," తలుపులు తీసి గట్టిగా పిలిచాడు ఎవరినో అర్థంకాని భాషలో.

ఎవడో ఒక గళ్ళలుంగీవాడు లోపలికి వచ్చి వినయంగా నిలబడ్డాడు. జాన్ ఏదో మాట్లాడాడు.

క్షణంలో గదిలోంచి నీళ్ళకూజా, తిను బండారాలు బైటికి వెళ్ళిపోయాయి.

పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ, బుసలు కొడుతూ, గదిలోంచి బైటకి నడిచాడు జాన్. తలుపులు మూసుకుంది.

రవిని ఓదారుస్తూ చాలా సేపు కూర్చుంది నిర్మల.

"నువ్వు అనవసరంగా తొందరపడ్డావు రవీ! చూడు యిప్పుడు మనం తిండికి, కూడా మొహం వాచిపోవాలి. మనకి త్రాగడానికి నీళ్ళుకూడా వుంచకుండా పట్టుకుపోయారు. ఈ పరిస్థితిలో మనం చేయగలిగేది ఏముంది? మనకి ఎంతేనా ఓర్పు, సహనం కావాలి. నాన్నగారు

లేకపోతున్నాను. ఇంతవరకు మీరు ఈ విషయం ఎవరికి ముఖ్యంగా పోలీసులకి తెలియజెయ్యలేదు. ఇకముందు కూడా అలాగే బుద్ధిగా వుండండి. ఒకవేళ ఈవిషయంలో మీరు పోలీసుల ప్రమేయం, ఒత్తిడి తీసుకువస్తే క్షణాల మీద మీపిల్లలు నిర్మల, రవి ప్రాణాలు పోతాయి. అర్థమైందా?'' అన్నాడు జాన్.

''అర్థమైంది. మీ పని పూర్తిఅయిన తర్వాత మాపిల్లలని సురక్షితంగా మాకు అప్పచెపుతారని నాకు నమ్మకం ఏమిటి?'' వినయంగా పలికేడు కృష్ణమూర్తి.

''చూడు మిస్టర్! నాకు అబద్ధాలు చెప్పడమన్నా, అబద్ధాలు చెప్పేవాళ్ళన్నా ఒళ్ళు మండిపోతుంది. ఆడిన మాట తప్పడం జాన్ చరిత్రలో లేని పచ్చి నిజం. చూస్తారుగా, మరి శెలవ్. అవసరమైతే మళ్ళీ ఫోన్ చేస్తా!'' సడన్‌గా ఫోన్ పెట్టేశాడు.

కృష్ణమూర్తికి నవ్వాలో ఏడ్వాలో అర్థమవలేదు.

రాత్రంతా ఆలోచించుకుని, ఒక నిర్ణయానికి వచ్చారు కృష్ణమూర్తి, శాంతాను.

ధర్మం, న్యాయం, అన్యాయం, నీతి, అవినీతి, చట్టం యివన్నీ వాళ్ళ మనస్సుల్లో తీవ్రమైన సంక్షోభం కలిగించినా, పిల్లలమీద ప్రేమ, అనురాగం, కరుణ వాళ్ళను పూర్తిగా ఓడించి జాన్ చేతిలో కీలుబొమ్మగా మార్చినవి. ఎదురు తిరిగిన మనస్సు పూర్తిగా ఓడిపోయింది.

కృష్ణమూర్తికి, ఇక ఏడవడానికికూడా వీలు లేకుండా పోయింది, జాన్ షరతులవల్ల.

నిండుగా, నిబ్బరంగా, హాయిగా, రంగస్థలంమీద నటిస్తున్న నటనాజీవితంలాగా మారిపోయింది, వాళ్ళ జీవితం.

పిల్లలు ఎక్కడో, హాయిగా ప్రాణాలతో ఉంటే చాలు, అని భగవంతుని ప్రార్థిస్తున్నారు.

# 6

ఉదయం నించి ఏమీ తినకపోవడం వల్ల మధ్యాహ్నానికి నీరసం ఆవరించుకుంది. నిలబడడానికికూడా ఓపిక లేక పరుపులమీదే వాలిపోయివున్నారు రవి, నిర్మల.

ఎప్పుడూ గదిలో రెండు ట్యూబులైట్లు వెలుగుతూ వుంటాయి. ఫేను తిరుగుతూ వుంటుంది. గోడలకి బాగా ఎత్తుగా రెండు వెంటిలేటర్లు.

రవికి మెలుకువ వచ్చేసరికి జాన్ గదిలోవున్న సోఫాలో కూర్చుని తాపీగా సిగరెట్ కాలుస్తున్నాడు.

నిద్రలేస్తూనే "గుడ్ మార్నింగ్!" అన్నాడు రవి.

జాన్ సోఫాలోంచి లేచి రవిని సమీపించి ఆప్యాయంగా వెన్నుమీద నిమరసాగేడు.

"బుద్ధిగా ఉన్నవాళ్ళని చూస్తే నాకు ఎంత ప్రేమో చెప్పలేను!" అన్నాడు జాన్.

రవి చిన్నగా నవ్వుకున్నాడు.

నిర్మలకికూడా మెలుకువ వచ్చింది. కూర్చోడానికికూడా ఓపిక లేనంత నీరసంగా వుంది.

ఎదురుగా జాన్, రవి నవ్వుకుంటూ కనిపించారు.

"ఇద్దరు తయారవ్వండి టిఫిన్ తిందురుగాని!" అన్నాడు లేచి నుంచుంటూ.

చకచక పది నిమిషాల్లో తయ్యారుగా వున్నారు రవి, నిర్మల టిఫిన్ కోసం ఎదురు చూస్తో.

జాన్ ఫలహారం వెంటబెట్టుకుని గదిలోకి వచ్చాడు. ఇడ్లీలు, పూరీలు, పెసరట్లు, ప్లేట్లలో సద్దేడు నౌకరు.

గ్లాసులతో మంచినీళ్ళు, కప్పులలో కాఫీలు.

నిర్మల, రవి ఆత్రంగా దాడి ప్రారంభించారు, టిఫిన్ మీద.

జాన్ చిన్నగా నవ్వుతున్నాడు. ఇరవై నాలుగు గంటలు ఆకలితో అలమటించిపోయి, తోటకూర కాడలలాగ, ఒడిలిపోయి వాడిపోయారు నిర్మల, రవి.

"ఈరోజునుంచి మనం ముగ్గురం కలుస్తాము, భోజనాలు టిఫిన్స్ దగ్గర. అన్నట్టు ఇవాళ ఆదివారం. రేపు వినాయక చవితి. మీరు పూజ చేసుకుందుకి ఇక్కడే ఏర్పాటు చేస్తున్నాను!" అన్నాడు జాన్.

టిఫిన్ తింటున్న రవి, నిర్మల ఒకసారి ఆనందంతో ఒకరినొకరు చూసుకుని, నీరసంగా ముఖాలు దించుకున్నారు. క్షణంకాలం వాళ్ళల్లోని ఆనందం లోపించింది.

జాన్ చూపులు మరల్చుకుని టిఫిన్ పూర్తిచేసి గది లోంచి వెళ్ళిపోయాడు.

"వినాయకచవితికి నాన్నగారు, అమ్మ ఎంతగానో హడావిడి చేస్తారు ప్రతి సంవత్సరం. ఏ సంవత్సరం, ఏ పండుగులకి మనం అమ్మకి, నాన్నకి దూరంగా లేము. ఈ సంవత్సరం మటుకు ఇలా ఈ రాక్షసుడి చేతుల్లో చిక్కుకుపోయాం!" అన్నాడు రవి విచారంగా.

నిర్మలకూడా విచారంలో మునిగిపోయి, ఏదో ఆలోచిస్తో పైన గిరగిర తిరుగుతున్న ఫేన్ కేసి చూస్తూ వుండిపోయింది.

# 7

"మిస్టర్ కృష్ణమూర్తి, జాన్ స్పీకింగ్ హియర్!"

"యస్ మిస్టర్ జాన్!"

"ఇవాళ పదహారో తారీఖు. మీరు మీ హెడ్ ఆఫీసుకి తెలియపరచండి నోట్ల డినామినేషన్ గురించి" అన్నాడు జాన్.

"నిన్ననే మెసేజ్ పంపించాను ఫోన్‌లో. సరే నన్నారు. ఇవాళ స్పెషల్ రిపోర్టు పంపుతున్నాను" అన్నాడు కృష్ణమూర్తి.

"గుడ్! అన్నట్టు ఇవాళ సాయంత్రం ఆరు గంటలకి కొన్ని ఫోటోలు పంపుతున్నాను మీ పిల్లలవి. అందుకోండి!"

"థాంక్స్. అలాగే ఒకసారి మా పిల్లలను చూసుకునే అవకాశం కల్పించండి" ప్రాధేయపడ్డాడు కృష్ణమూర్తి.

జాన్ ఏం సమాధానం ఇవ్వలేదు.

సాయంత్రం ఆరు గంటలకి వీధి మెట్లమీద దృష్టి నిలిపి ఎదురు చూస్తున్నాడు కృష్ణమూర్తి. నలభైఅయిదు సంవత్సరముల వ్యక్తి ఒకడు చేతిలో ఒక పేకెట్టుతో మెట్లు ఎక్కుతూ కనిపించాడు.

కృష్ణమూర్తి బైటకి వచ్చాడు.

"మీరేనా కృష్ణమూర్తిగారు అంటే!" అన్నాడు.

"ఔను నేనే! ఏమిటది?"

"ఒకాయన హైరోడ్డు దగ్గర కనిపించి ఇది మీకు యిమ్మని చెప్పేరు."

"ఆయన పేరు?"

"నాకు తెలియదు. ఇది మీకు అందజేస్తే నాకు అయిదు రూపాయిలు బహుమానం యిస్తానని అన్నారు."

"ఇచ్చారా?"

"ముందే యిచ్చేశారు!" పేకెట్టు చేతిలో పెట్టి వెళ్ళి

పోయాడు ఆ వ్యక్తి.

'జాన్ ఎంత తెలివైనవాడు. తన ఉనికి ఎవరికి తెలియనివ్వకుండా జాగ్రత్త పడుతున్నాడు' అనుకున్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి ఆత్రంగా లోపలికి వచ్చి తలుపులు మూసి జాగ్రత్తగా పేకెట్టు చింపి అందులోంచి పది ఫోటోలు బైటకి తీశాడు. అవి రవి నిర్మల ఫోటోలు. వినాయక చవితి రోజున గణపతి పూజ చేసుకుంటూ వుండగా తీసినవి కొన్ని. మిగిలినవి, యిద్దరు కలిసి చదువుకుంటూ, ఆడుకుంటూ, మాట్లాడుకుంటూ, వున్నప్పుడు తీసినవి.

ఫోటోలలో రవి, నిర్మల ఎంతో ఆనందంగా, సంతోషంగా, ఆరోగ్యంగా, కనిపిస్తున్నారు. తనివితీరా చూసుకుంటూ, ఆనందిస్తూ, విచారిస్తూ, కూర్చున్నారు కృష్ణమూర్తి, శాంతాను.

ఫోన్ మ్రోగింది.

"ఫోటోలు, ఈ పాటికి మీ చేతికి చిక్కివుంటాయి. దూరం నుంచి గమనిస్తోనే వున్నాను. మీకు ఫోటోలు అందజేసి, అతను వెళ్ళిపోగానే నేను తిరిగి వచ్చేసి మీకు ఫోన్ చేస్తున్నాను. అలాగే రెండు రోజుల్లో రహస్యంగా మీ దంపతులు యిద్దరు మీ పిల్లలని కలుసుకునే ఏర్పాటు చేస్తున్నాను."

"నిజంగా! ఎప్పుడు?" అన్నాడు కృష్ణమూర్తి ఆనందంతో.

"చెప్పేను కదా రెండు రోజుల్లోనని, తర్వాత ఫోన్ చేసి వివరాలు తెలియజేస్తాను," ఫోన్ పెట్టేశాడు జాన్.

జాన్ ఎక్కువసేపు ఫోన్‌లో మాట్లాడడు. ముక్త

సరిగా మాట్లాడి అతి త్వరగా పెట్టేస్తాడు ఫోన్. ఫోన్ ఎక్కడనించి వచ్చిందో 'ట్రాపింగ్‌కి' వీలు లేకుండా నేమో!

కుతూహలంతో ఫోన్ చేసి ఆపరేటర్‌ని అడిగాడు కృష్ణమూర్తి "ఇంతకుముందు వచ్చిన ఫోన్ కాల్ ఎక్కడ నుంచి" అని.

"స్టేషన్ పబ్లిక్ బూత్‌నుంచి" అని ఆపరేటర్ జవాబిచ్చింది.

ఈ జాన్ ఎవరో అసాధ్యుడు అనుకున్నాడు కృష్ణమూర్తి మొదటిసారిగా.

# 8

జాన్ పెట్టిన ముహూర్తం ఆ రోజు సాయంకాలం.

ట్రంకు రోడ్డుమీద నడుచుకుంటూ, ఊరుదాటి నడుచుకుంటూ ముందుకు నడవమన్నాడు. దారిలో ఎక్కడో ఒక చోట ఒక కారు వచ్చి పక్కన ఆగుతుంది.

కారులోని వ్యక్తి "వరంగల్ యింకా ఎన్ని కిలోమీటర్లు వుంటుంది?" అని అడుగుతాడు. అందులో ఎక్కి కూర్చోండి, అని జాన్ ఉదయం ఫోన్ చేసి చెప్పేడు.

ఊరు దాటేసి ఆరు కిలోమీటర్లు వచ్చేశారు కృష్ణమూర్తి, శాంతాను. ఇంకా ఎంతదూరం నడవాలో, కారు ఎప్పుడు, ఎక్కడికి వచ్చి ఆగుతుందో అసలే తెలియదు. అంతదూరం నడిచినా వాళ్ళకి శ్రమ, ఆయాసం, కలగటం లేదు. నిర్మలని, రవిని, చూడబోతున్నామనే ఆనందం వాళ్ళని అలా నడిపిస్తున్నాయి.

నల్లరంగు అంబాసిడర్ వచ్చి పక్కగా ఆగింది.

"వరంగల్ యింకా ఎన్ని కిలోమీటర్లు వుంటుంది?" అని అడిగాడు ఒక వ్యక్తి డ్రైవింగు సీటులోంచి. కారులో

అతనొక్కడే వున్నాడు.

కృష్ణమూర్తి, శాంత చప్పున కారు బేక్ డోరు తీసుకుని లోపల కూర్చున్నారు. కారు వేగం పుంజుకుంది. చల్ల గాలికి హాయిగా అనిపించింది మనస్సుకి.

దూరంగా రోడ్డు పక్కగా యిద్దరు వ్యక్తులు నిలబడి వున్నారు. వాళ్ళకి పక్కగా వచ్చి ఆగింది కారు. ఫ్రంటు డోరు తీసుకుని లోపలికి ఎక్కారు. మళ్ళీ కారు బయలు దేరింది.

"వీళ్ళంతా జాన్ తాలూకు మనుష్యులనుకుంటాను!" అన్నాడు కృష్ణమూర్తి, శాంతితో రహస్యంగా.

ముందు సీటులో కూర్చున్న వ్యక్తి సడన్ గా వెనక్కి తిరిగాడు. వడి చేతిలో ఏదో వుంది. సరిగా కనిపించటం లేదు. ముఖంమీద చల్లగా ఏదో చల్లబడింది. తియ్యటి వాసన. చిత్రంగా వుంది అనుభూతి. అది క్లోరోఫాం అని కృష్ణమూర్తికి స్పృహ కోల్పోతున్నప్పుడు తెలిసింది.

కృష్ణమూర్తి, శాంత ముఖాలు పక్కలకు వ్రేలా డేశారు.

కృష్ణమూర్తికి, శాంతకి మెలుకువ వచ్చినట్టు అయింది. ఎదురుగా నిర్మల, రవి.

తల్లిని, తండ్రిని చూడగానే వాళ్ళకి పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్టు అయింది.

ఎన్నో సంగతులు, ఎన్నో కబుర్లు, ఎంతో ఆనందం, చెప్పలేని సంతోషం.

నలుగురు ఒకటిగా పెనవేసుకుపోయి చిత్రాతిచిత్రమైన అనుభూతులు చవిచూస్తున్నారు.

నౌకరు ఫలహారాలు, కాఫీలు తీసుకువచ్చి, బల్లమీద

సర్దివెళ్ళిపోయాడు.

నలుగురు ఒకళ్ళకొకళ్ళు ఆప్యాయంగా తినిపించు కున్నారు. రెండు గంటల కాలక్షేపం రెండు నిమిషాల్లా గడిచిపోయింది.

ఒక వ్యక్తి లోపలికి వచ్చి "టైం అయింది. ఇక మీరు బయలుదేరమని మా బాస్ జాన్ ఆజ్ఞ!" అన్నాడు. కాఫీలు త్రాగాక పిల్లలని వదలలేక వదలలేక వదిలిపెట్టి బైటికి వచ్చి కారులో కూర్చున్నారు కృష్ణమూర్తి, శాంతలు.

కారు కదిలింది. కారు వేగంగా పోతోంటే తమాషాగా నిద్ర ముంచుకు రాసాగింది. అది నిద్రమత్తు కాదు. కాఫీలో కలపబడిన మత్తుమందు ప్రభావం.

కారు సిటీకి రెండు కిలోమీటర్ల దూరంలో చీకటిలో రోడ్డు వారగా ఆగింది.

"ఇక మీరు ఇక్కడ దిగి నడచివెళ్ళండి!" అని కృష్ణమూర్తిని తట్టిలేపి అన్నాడు డ్రైవరు.

కృష్ణమూర్తి, శాంత నిద్రలోంచి లేచినట్టు లేచి, ఒక సారి కళ్ళు నులుపుకుని, కిందకి దిగారు.

కారు ఒక్క కుదుపుతో ముందుకు ఉరికి వేగంగా చీకటిలో కలిసిపోయింది.

# 9

ఉదయం తొమ్మిదిన్నర అయింది.

కృష్ణమూర్తి బ్యేంకుకి టైం అౌతోందని తొందరగా బట్టలు వేసుకుంటున్నాడు.

శాంత కాఫీ తీసుకువచ్చి టీపాయ్ మీద పెట్టింది. అంతలో టెలిఫోన్ గణగణ మ్రోగింది. ఫోన్ తీసుకుని

"హల్లో!" అంది శాంత.

"అక్కయ్యా! నువ్వేనా? నేను గోపాలాన్ని మాట్లాడుతున్నాను. అంతా కులాసాయేనా?" అన్నాడు అవతల నుంచి.

తమ్ముడు గోపాలం అని వినగానే శాంత కొయ్యబారి పోయింది. "ఏమండోయ్! అర్జంటుగా యిలా రండి. మా తమ్ముడు గోపాలం ఫోన్ చేస్తున్నాడు!" అంది ఆదుర్దాగా.

కృష్ణమూర్తి పరుగున వచ్చి ఫోన్ అందుకుని, "హల్లో గోపాలం ఎక్కడనుంచి మాట్లాడుతున్నావ్?" అన్నాడు.

"ఓహో బావగారా! నమస్కారం. రైల్వేస్టేషన్ లోంచి మాట్లాడుతున్నాను. తిరుపతి నుంచి వస్తున్నాను. రాత్రి రైల్లో నిద్రపోతున్నప్పుడు ఎవడో దొంగ వెధవ నా సూట్ కేసు కొట్టేశాడు. అదృష్టం బాగుండి మనీపర్సు మొల్లో పెట్టుకోవడం వల్ల బతికిపోయాను. ప్రస్తుతం లుంగీ, బనీనుతో వున్నాను. పైగా గుండు చేయించుకోడం వల్ల మరీ అవస్తగా వుంది నా పరిస్థితి. ఈ వాలకంతో బైటికి రావడం చాలా సిగ్గుగా వుంది.

పైగా యిప్పుడు మీ బ్యాంకు అవర్స్ కనుక, ఈ వేషంతో అక్కడకు వస్తే మీ స్టేఫ్ అంతా నవ్వుకుంటారు. అందుకని మీరు అక్కయ్యాని, అర్జంటుగా, మా పేంటు, షర్టు తీసుకుని, స్టేషన్ కి రమ్మనమని చెప్పండి. నేను బుక్కింగ్ ఆఫీసు దగ్గర ఎదురుచూస్తూ వుంటాను." అన్నాడు గుక్క తిప్పుకోకుండా.

కృష్ణమూర్తి ఆలోచనలో పడ్డాడు. బంధువుల నెవరిని యింటికి రానివ్వడానికి వీలులేదని జాన్ హెచ్చరించాడు. ఇప్పుడు గోపాలం యింటికి వస్తే జాన్ నిర్మలని, రవిని

యేం బాధ పెడతాడో ఏమో!

"బావగారూ! మాట్లాడరేం?" గుర్తుచేశాడు గోపాలం.

కృష్ణమూర్తి ఫోన్ కేసి, శాంత కేసి మార్చి మార్చి చూస్తున్నాడు గాభరాగా.

శాంత చప్పున, కృష్ణమూర్తి చేతిలోని ఫోన్ లాక్కుని "ఒరేయ్ గోపాలం! మేము ప్రస్తుతం చాలా ప్రమాదంలో, విషమ పరిస్థితిలో యిరుక్కుపోయి, మనః స్థిమితం లేకుండా, జీవచ్ఛవాల్లాగ, కాలం గడుపుతున్నాం. ప్రస్తుతం నువ్వు, మా యింటికి రాకు. కనీసం మా వీధి ఛాయలకికూడా రావటానికి ప్రయత్నించకు. ఏదో రైలెక్కి ఊరికి వెళ్ళిపో. నన్ను అర్థంచేసుకో. ఈ పరిస్థితిలో యింతకన్నా నేను నీకు ఏమీ చెప్పలేను!" శాంత కంఠం జీరపోయింది. ఏడుపు తరుముకుంటూ వస్తోంది. మరి మాట్లాడక ఫోన్ పెట్టేసింది.

"అక్కయ్యా! అక్కయ్యా!" అని అరుస్తూనే వున్నాడు గోపాలం. ఫోన్ గొంతుక చించుకుని.

# 10

స్టేషన్ క్యాంటిన్ లో మస్తుగా టిఫిన్ తిని, రెండు పెట్టెల సిగరెట్లు కొనుక్కొని, స్టేషన్ లో ఒక మూల సోఫాలో కూర్చున్నాడు గోపాలం. అతని మనస్సు ఆలోచనలతో నిండిపోయింది, సిగరెట్లు తెగ వెలుగుతున్నాయి.

గోపాలానికి ఎందుకో అక్కడి నుంచి తన వూరికి వెళ్ళాలనిపించటం లేదు. అక్కయ్య, బావగారు ఏదో ప్రమాద పరిస్థితుల్లో చిక్కుకుపోయారు. అదిమటుకు నిశ్చయంగా తెలిసిపోతోంది. ఏమిటో ఆ ప్రమాద పరిస్థితి?

ఒకవేళ బావగారు బ్యేంకు సొమ్ము అవసరానికి

వాడేసుకున్నారేమో! ఊహూ! బావగారు అలాంటి వారు కాదే! పైగా భయస్తుడు కూడాను. అసలు బ్యాంకు సొమ్ముకి కక్కుర్తి పడవలసిన అవసరం ఏముంది? ఆస్తి పరుడు కదా! అయితే కారణం ఏమై ఉంటుంది?

అసలు తనని యింటికి రాదు సరి కదా, ఆ వీధి ఛాయలకి కూడా రావద్దని తరిమి కొట్టినట్టు నిర్మొహమాటంగా చెప్పేసింది అక్కయ్య. బావగారికి, అక్కయ్యకి నేనంటే ఎంత ప్రేమో! ఎన్ని ఉత్తరాలో రాశారు తిరుపతి నుంచి తిరిగి వచ్చేటప్పుడు యిక్కడ దిగి, కొంత కాలం ఉండమని, మరి యిదేమిటి?

మనఃస్థిమితం లేకుండా, జీవచ్ఛవాల్లాగ బ్రతుకుతున్నాం అంటుంది అక్కయ్య! కొంపతీసి బావగారు, అక్కయ్య పోట్లాడుకుని, విరోధులయిపోయారా? ఒక వేళ అదే నిజమయితే, బావగారిని ఎందుకు పిలిచింది? అచ్చే యిదికూడా సరైన కారణం కాదు.

అన్నట్టు పిల్లల గురించి అసలు ఒక్క మాటకూడా మాట్లాడలేదు.

గోపాలం ఎంత తీవ్రంగా ఆలోచించినా ఒకదానికి ఒకటి పొంతన కుదరకుండా ఉంది.

గోపాలం యింకా ఆలోచిస్తోనే ఉండిపోయాడు.

గోపాలం చిన్నప్పటి నుంచీ యింతే. ప్రతీ చిన్న విషయం, నిశిత బుద్ధితో గంటల కొద్దీ ఆలోచించి అసలు విషయం గ్రహించే వరకు ఊరుకునేవాడు కాదు.

గోపాలం చదివిన అపరాధ పరిశోధన సాహిత్యం అతన్ని ఒక చిన్న పరిశోధకుడిగా మార్చింది.

రెండు గంటలు సుదీర్ఘ ఆలోచనలు ఒక నిర్ణయానికి

తీసుకు వచ్చాయి గోపాలాన్ని. అర్ధరాత్రి అయ్యేదాకా స్టేషన్‌లోనే గడిపాడు.

అర్ధరాత్రి దాటాక చీకటిలో నెమ్మదిగా నడిచి ఒక సందులోకి తిరిగేడు. అక్కడ ఒక ప్రహరీ ఎక్కి లోపలికి దిగేడు. అక్కడ అన్నీ పక్క పక్కలుగా ఉన్న మేడలు, డాబాలు.

ఒక యింటి పెరడులోంచి, ఒక యింటి పెరడులోకి మారుతూ చివరికి కృష్ణమూర్తి మేడలోకి దిగేడు.

బ్యాంకు వాచ్‌మేన్ కాపలా కాస్తూ వీధిగేటు దగ్గర కూర్చున్నాడు బీడి కాల్చుకుంటూ, వీధి వైపు బ్యాంకు దీపాల కాంతితో అందంగా ఉంది.

గోపాలం దొడ్డివైపు ఒక వారగా ఉన్న చెట్టు నీడలో చీకటిలో నుంచుని చుట్టూ పరకాయించి చూసి, బాత్‌రూం కేసి నడిచాడు.

నెమ్మదిగా బాత్‌రూంమీదకు చేరుకుని, బాత్‌రూం మీదకు వాలిన మామిడి కొమ్మ అందుకుని, మెల్లగా మేడ మీదికి చేరుకున్నాడు.

మేడమీద కొంచెం సేపు చీకటిలో నుంచుని చుట్టూ పరకాయించి చూస్తున్నాడు. తనని ఎవరూ కనిపెట్టటం లేదని నిర్ధారణ చేసుకుని, నెమ్మదిగా తలుపుమీద చప్పుడు చెయ్యడం మొదలుపెట్టేడు.

''ఎవరూ!'' అని లోపలనుంచి బావగారి గొంతుక వినిపించింది.

''నేనూ! గోపాలాన్ని!'' అన్నాడు అతి నెమ్మదిగా.

తలుపు దగ్గరకు వస్తున్నట్టు అడుగుల చప్పుడు వినిపిస్తోంది. ''బావగారూ! లైటు ఆర్పేసి తలుపు తెరవండి!'' అన్నాడు గోపాలం.

లోపల లైటు ఆర్పేసినట్టు చప్పుడు వినిపించింది. నెమ్మదిగా తలుపు తెరుచుకుంది. గదిలో గాఢాంధకారం. మెల్లగా లోపలికి వెళ్ళి తలుపులు మూసేశాడు గోపాలం.

తెల్లవారు ఝామున నాలుగు గంటలకి గోపాలం బైటికి వచ్చాడు. బావగారి పేంటు, షర్టు వేసుకున్న గోపాలం రూపం పూర్తిగా మారిపోయింది. వచ్చిన దారినే జాగ్రత్తగా బైటికి వెళ్ళి రోడ్డు చేరుకున్నాడు.

బావగారి యింటిమీద నిఘా వేసినా తను ఒక సామాన్యమైన దొంగలాగ దొంగతనానికి వచ్చినట్టు అనుకునేలాగ నటించాడు.

బావగారిని, అక్కయ్యని రహస్యంగా కలుసుకుని జరిగిన విషయాలు జాగ్రత్తగా విని అసలు విషయం తెలుసుకునే వరకు గోపాలానికి మనస్సు మనస్సులో లేదు.

# 11

"నా పేరు గోపాలకృష్ణ. ఒక అతి ముఖ్యమైన విషయంలో మీ సహాయంకోసం వచ్చాను. మీరు మేధావులు. మీ గురించి అందరూ ఎంతో గొప్పగా చెప్పగా విన్నాను. మీరు పరిశోధించిన అన్ని కేసులు, దిన పత్రికలలో చదివేను.

మీ వల్ల ప్రాణాపాయ పరిస్థితిలో ఉన్న రెండు ప్రాణాలు రక్షింపబడాలి" చెప్పడం ఆపి ఒక్కసారి ముందుకు వొంగి కుతూహలంగా చూశాడు.

"ఆల్ రైట్! మీకు తెలిసిన విషయాలు అన్ని, పూర్తి వివరాలు తెలియజెయ్యండి!" అన్నాడు డిటెక్టివ్ షణ్ముఖ రావ్ సిగరెట్టు వెలిగించుకుని. నౌఖరుని కేకేసి "మూడు కాఫీలు తీసుకురా!" అన్నాడు.

గోపాలం చెప్పుకుంటూ పోతున్నాడు. కృష్ణమూర్తి, శాంతల వద్ద సేకరించిన సమాచారం తు.చ. తప్పకుండా చెప్పేడు.

అసిస్టెంట్ ప్రసాద్ షార్టుహేండ్ లో పేడ్ మీద నోట్ చేసుకున్నాడు.

నౌఖరు కాఫీలు తీసుకు వచ్చాడు.

"కాఫీ తీసుకోండి!" అన్నాడు షణ్ముఖరావ్.

"థాంక్స్!" అన్నాడు గోపాలం కాఫీ అందుకుంటూ. నౌఖరు ఖాళీ కప్పులు తీసుకుని వెళ్ళిపోయాడు.

"నేను మీ సహాయం కోరినట్టుకాని, పోలీసులు ఈ విషయంలో తల దూర్చినట్టుగాని, జాన్ కి అనుమానం వస్తే నిముషాలమీద నిర్మల, రవి ప్రాణాలు పోతాయి. మీ విషయంలో నాకు ఎంతో నమ్మకం ఉండడం వల్ల మీ పరిశోధనలు ఏ పరిస్థితుల్లోను, ఎవరికి అనుమానాన్ని కలిగించకుండా ఉంటాయని తెలిసి, ఈ కేసు భారం మీకు అప్పచెపుతున్నాను." గోపాలం గొంతుక చిత్రంగా ఒణికింది.

షణ్ముఖరావు కుర్చీలోంచి లేచి ఆప్యాయంగా గోపాలం భుజంమీద మెల్లగా తట్టి, "మీరు ఈ విషయంలో నిర్భయంగా ఉండండి. మీరు నన్ను కలుసుకున్నట్టు, నేను ఈ కేసు తీసుకున్నట్టు ఎవరికి తెలియనివ్వకండి. త్వరలోనే ఆ దుండగులను పట్టుకుని నిర్మలని, రవిని, విడిపించడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. మీ ఎడ్రస్సు యిచ్చి వెళ్ళండి అవసరమైతే మళ్ళీ మిమ్మల్ని కలుసుకుంటాను." అన్నాడు.

గోపాలం ఎడ్రసు యిచ్చి వెళ్ళిపోయాడు.

షణ్ముఖరావ్ ఎవరికో ఫోన్ చేసి ఫోన్ లో పది నిము

పాలు మాట్లాడి తృప్తిగా ఫోన్ పెట్టేశాడు.

రివాల్వింగ్ ఛెయిర్‌లో సిగరెట్టు కాలుస్తూ సుదీర్ఘంగా ఆలోచిస్తో కూర్చున్నాడు.

అసిస్టెంటు ప్రసాద్ నిశ్శబ్దంగా కూర్చున్నాడు. అతనికి తెలుసు షణ్ముఖరావు ఏదో పథకం ఆలోచిస్తున్నాడని.

అరగంటసేపు గడిచిపోయింది. సిగరెట్టు పీకలతో యాష్‌ట్రే నిండిపోతోంది.

"ప్రసాద్!" అన్నాడు షణ్ముఖరావ్ సంతోషంగా.

"యస్ సార్! అన్నాడు ప్రసాదు కుతూహలంగా.

చెప్పసాగాడు షణ్ముఖరావు తను కార్య రూపంలో పెట్టబోతున్న పథకాన్ని అసిస్టెంటుతో.

చెప్పడం ఆపి ఢిల్లీకి, హైదరాబాద్‌కి ట్రంకాల్స్ బుక్ చేసి ఫోన్ దగ్గర యెదురుచూస్తో కూర్చున్నాడు.

"హల్లో మిస్టర్ షణ్ముఖరావ్! గుడ్ మార్నింగ్! హడావిడిగా పరుగెత్తుకుంటూ వచ్చాడు సర్కిల్ యిన్‌స్పెక్టర్ రాజారెడ్డి.

"గుడ్ మార్నింగ్! కూర్చోండి." అన్నాడు షణ్ముఖరావ్ కరచాలనం చేస్తూ.

"ఏమిటి విశేషం? యిప్పుడే యస్. పి. ఫోన్ చేసి మిమ్మల్ని అర్జంటుగా కలుసుకోమన్నారు." అన్నాడు రాజారెడ్డి.

"వెంటనే వచ్చినందుకు చాలా సంతోషం!" అంటూ చెప్పసాగేడు కేసు గురించి, తన ప్లాన్ గురించి.

## 12

"హల్లో కృష్ణమూర్తి! జాన్ స్పీకింగ్ హియర్!"

"యస్! మిస్టర్ జాన్!"

"యివాళ సిరిపురం కాలరీస్ నుంచి బయలుదేరి వస్తున్నారు కేష్ కోసం, ఆర్ యు రడీ?"

"యస్!"

"మరి నా డినోమినేషన్స్?"

"మీరు కోరినట్టుగానే ఉంది డినామినేషన్, డూ నాట్ వర్రీ!"

"వెరీ గుడ్!"

"పిల్లలు కులాసాగా ఉన్నారా?"

"ఆహా! చక్కగా ఉన్నారు! రెండు రోజుల్లో మళ్ళీ మీరు మీ పిల్లలని కలుసుకునే ఏర్పాటు చేస్తా. ఈ సారి ఒక రోజంతా మీ పిల్లలతో హాయిగా గడపవచ్చు."

"చాలా థ్యాంక్స్!"

ఫోన్ అవతలి నుంచి 'క్లిక్' మంది.

కృష్ణమూర్తి మనస్సు చాలా గాబరాగా, ఆదుర్దాగా, ఆందోళనకరంగా ఉంది. జీవితంలో మొదటిసారిగా ఘోరమైన తప్పు చేస్తున్నాడు; పరిస్థితుల ప్రభావం వల్ల.

# 13

వేన్ వేగంగా పోతోంది. అప్పుడప్పుడు కాలరీస్‌కి సంబంధించిన లారీలు, అటు, యిటు పరుగెడుతున్నాయి.

సిరిపురం కాలరీస్‌కి పదిమైళ్ళ యివతల రోడ్డుకి అడ్డంగా ఒక లారి ఆపి ఉంది. డ్రైవరు, క్లీనరు, లారీ క్రింద దూరి ఏదో రిపేరు చేసుకుంటున్నారు.

వేన్ లారీకి దగ్గరగా వచ్చి ఆగింది.

"లారీ రోడ్డుకి అడ్డంగా ఆపి యేమిటి రిపేరు! కాస్త సైడుకి అప్పుకోకూడదూ?" అంటున్నాడు వేన్ డ్రైవరు చిరాకుగా.

క్లీనరు, డ్రైవరు లారీ క్రింద నుంచి బైటికి వచ్చి, వేన్ ని సమీపించారు.

వేన్ డ్రైవర్ వెనక్కి తిరిగి చూశాడు. హెడ్ కేషియర్, మేనేజర్ నిద్ర మత్తులో మునిగి తేలుతున్నారు. పోలీసులు తుపాకీలు ఒళ్ళో పెట్టుకుని జోగుతున్నారు.

వేన్ డ్రైవర్ హుషారుగా రెండుసార్లు హారన్ మ్రోగించాడు. చెవులు చిల్లులు పడేలా.

వేన్ లో ఎవరూ అది వినిపించుకునే పరిస్థితిలో లేరు.

ఈ లోపుగా వేన్ ప్రక్కగా వచ్చి ఆగింది ఒక ఎంబాసిడర్. అందులోంచి నిలుగురు క్రిందకు దిగి వేన్ తలుపు మారు తాళాలతో తీసి, వేన్ లోని కేష్ బాక్సు కారులోకి, కారులో ఉన్న అదే సైజులో దొంగ నోట్లతో ఉన్న కేష్ బాక్సు వేన్ లోకి మార్చేశారు.

కారులోంచి దిగిన జాన్, వేన్ డ్రైవర్ని, లారీడ్రైవర్, క్లీనర్ ని అభినందించాడు.

లారీ డ్రైవర్, క్లీనర్ కూడా జాన్ ముఠా వాళ్ళు.

ఎంబాసిడర్ వెనక్కి మళ్ళి, సిటీలోకి వేగంగా పరుగెత్తింది. లారీకూడా అనుసరించింది, జాన్ కారుని.

వేన్ సిరిపురం వైపు బయలుదేరింది. క్రమంగా వేగం పుంజుకుంది.

వేన్ లో డేష్ బోర్డు కింద ఒక అర అమర్చబడి ఉంటుంది. వేన్ వేగంగా పోతున్నప్పుడు అందులోంచి ఒక వాయువు వెలువడి, వేన్ లో ఉన్న అందరిని నిద్రలోకి దింపుతుంది.

అవసరమైతే నిద్ర లేపడానికి యింకో అరలోంచి యాంటీడోట్ వాయువు వెలువడి నిద్ర లేపుతుంది.

అసలు ఏ మాత్రం అనుమానం కలిగించని విధంగా వేన్‌లో ఉన్న వాళ్ళు నిద్రలోకి జారిపోగలరు?. మెలు కువలోకి రాగలరు.

వేన్ డ్రైవర్ ముందుగానే యాంటీడోట్ టేబ్లెట్స్, తీసుకోవడం వల్ల, అతనికి నిద్ర వాయువు ప్రభావం చూపించదు.

వేన్ వేగంగా ముందుకు ఉరుకుతోంది. వేన్ డ్రైవర్ ఆనందం అవధులు దాటి పోతోంది. జాన్ పథకం యింత పకడ్‌బందీగా, జయప్రదంగా ముగిసినందుకు.

కాని డ్రైవర్ ఆనందం ఎక్కువసేపు నిలబడలేదు. వేగంగా పోతున్న వేన్ క్రమంగా వేగం తగ్గి సడన్‌గా ఆగిపోయింది. కారణం తెలియక తికమక పడుతున్న డ్రైవర్‌ని బలంగా కొట్టి, పక్కకి తోసి, డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు ఒక పోలీసు. ఈ హటాత్ పరిణామానికి డ్రైవర్‌కి మతి పోయింది.

డ్రైవింగ్ సీట్లోకి మారినది. పోలీసుకానిస్టేబుల్ యూని ఫాంలో ఉన్న సర్కిల్ యినస్పెక్టర్ రాజారెడ్డి.

వేన్ బ్రేకులకి కనక్షన్ కలుపుతూ ఒక బలమైన తీగ వేన్‌లో సీటు కింద అమర్చాడు షణ్ముఖరావు. తీగ బలంగా లాగడం వల్ల వేన్ ఆగిపోయింది.

షణ్ముఖరావు ముందు నుంచి వేన్ డ్రైవర్‌ని అనుమా నించడం జరిగింది. ఎందుకంటే అంతకు ముందే ప్రతీ వేన్‌ని క్షుణ్ణంగా పరిశీలించడం వల్ల డేష్‌బోర్డు క్రింద అమర్చిన పరికరం కనిపించింది.

పోలీసుల వేషంలో వున్న షణ్ముఖరావు, ప్రసాద్, డి. యస్. పి, సర్కిల్ యిన్‌స్పెక్టర్ రాజారెడ్డి, ముందుగా

యాంటీడోట్ టేబ్లెట్లు తీసుకోవడం వల్ల, మత్తురాక పోయినా నిద్ర నటించారు.

ప్రసాద్ డ్రైవర్ ని పిచ్చివేషాలు వెయ్యకుండా నోటిలో గుడ్డలు కుక్కి, తీగలతో కాళ్ళు, చేతులు బంధించాడు. రాజారెడ్డి వేన్ చెక్ చేసి సిటీవైపు మళ్ళించి, వేగంగా పోనిచ్చాడు.

షణ్ముఖరావు వైర్ లెస్ సెట్ తీసుకుని, పోలీసు కంట్రోల్ రూంకి మెసేజ్ పంపుతున్నాడు.

స్పెషల్ పోలీసు ఊరంతా వలపన్ని అప్రమత్తతతో ఉంది.

సిటీలోకి అడుగు పెట్టిన జాన్ కారు యిండస్ట్రియల్ యెస్టేటు వైపు పరుగెత్తింది.

బస్సులు, కారులు, వేనులు, లారీలు, సైకిళ్ళు, మోటర్ సైకిళ్ళమీద మఫ్టీ పోలీసులు జాన్ కారుని, అనుమానం కలగకుండా, మామూలు ట్రేఫిక్ తిరుగుతున్నట్టుగానే, వెంబడించసాగేయి.

ఏ వాహనం కూడా అనుమానం రాకుండా జాన్ కారుని వెంబడించి, ప్రక్క వీధులకో, సందులకో తిరిగి పోతున్నాయి. ప్రక్క వీధుల నుంచి క్రొత్త వాహనాలు ముందుకు సాగిపోతున్నాయి. ఆ విధంగా జాన్ కారు ఎటు వెళ్ళేది వేయి కళ్ళతో గమనించసాగారు.

తన కారుని ఎవరూ వెంబడించటం లేదని జాన్ కి ఎంతో ధీమాగానూ, తృప్తిగాను ఉంది.

## 14

రాత్రి పదిగంటలయింది.

షణ్ముఖరావు, రాజారెడ్డి, ప్రసాద్, డి. యస్. పి,

నలుగురు వేషం మార్చుకుని జాన్ ఇంటి ఆవరణలోకి ప్రవేశించారు. నలుగురి చేతుల్లో రివాల్వర్స్. జాన్ బంగళా చుట్టూ పోలీసులు రహస్యంగా కాపలా కాస్తున్నారు.

బంగళా అంతా చుట్టూ కిటికీలు మూయబడి ఉన్నాయి. బంగళా వెనకవైపు నుంచి నీళ్ళ గొట్టాలు పట్టుకుని నలుగురు మేడమీదకు చేరుకున్నారు.

అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా మెట్లగది వైపు నడిచారు. తలుపు లోపలకి బోల్టు వేసి ఉంది.

నెమ్మదిగా చప్పుడు కాకుండా, రంపంతో కొయ్యడం మొదలుపెట్టేడు ప్రసాద్. పావుగంటలో అడుగు చదరంలో తలుపు చెక్కని కోసి, బైట నుంచి, చేతులు లోపలికి పోనిచ్చి, లోపల ఉన్న బోల్టు తీసి, లోపలికి ప్రవేశించారు.

మెల్లగా ఒక్కో మెట్టు దిగి లోపలికి ప్రవేశించారు.

క్రింద వంట గది. మొత్తం నలుగురు ఉన్నారు అక్కడ. ఒకడు వంట చేస్తున్నాడు. యిద్దరు సర్వర్స్ లాగ ఉన్నారు. యింకో వ్యక్తి నడి వయసులో ఉన్న స్త్రీ.

డిటెక్టివ్‌లు నలుగురు మెల్లగా సంజ్ఞలతో మాట్లాడుకున్నారు.

ఒక్కసారిగా నలుగురు వంట గదిలోకి ప్రవేశించి, తలుపులు బంధించి, నలుగురికి క్లోరోఫాం వాసనలు చూపించారు. అనుకోకుండా వెల్లువలాగ ప్రవేశించిన నలుగురిని చూసి, నోరు తడారిపోయి, అరవడం కూడా మరిచిపోయి, అలాగే బొమ్మల్లాగ నిలబడిపోయారు.

ప్రసాద్, రాజారెడ్డి, వాళ్ళని తాళ్ళతో బంధించి

అరవకుండా నోటికి ప్లాస్టర్ పట్టీలు బిగించాడు.

షణ్ముఖరావు మెల్లగా తలుపులు తీసుకుని నడవలోకి ప్రవేశించాడు. అక్కడ ఒక విశాలమైన గదిలో ఏదో కోలాహలం వినిపిస్తోంది. అటువైపుకి నడిచాడు. చేతిలో రివాల్వర్ తయారుగా ఉంది.

వెనక నుంచి ప్రసాద్, రాజారెడ్డి, షణ్ముఖరావుని అనుసరించారు.

తలుపు ప్రక్కనుంచి ఓరగా చూశాడు షణ్ముఖరావు.

లోపల విశాలమైన గదిలో మధ్యగా ఉన్న డైనింగ్ టేబులు చుట్టూ పదిమంది కూర్చుని విస్కీ త్రాగుతూ, ఖుషీగా ఉన్నారు.

విస్కీ నిషా ఒళ్ళంతా ప్రాకినట్టు, వాళ్ళ మాటలు ముద్దగా వస్తున్నాయి.

"బేరర్!" అని పిలిచాడు వాళ్ళలో ఒకడు విసుగ్గా. సమాధానం లేదు.

"అసలు వీళ్ళు కిచన్‌లో ఏం చేస్తున్నట్టు?" అంటూ ఒకడు తూలుకుంటూ బైటికి వచ్చాడు.

రాజారెడ్డి చీకటిలో తయారుగా నుంచుని వాడి తల మీద బలంగా కొట్టేడు. మెడ వాల్చేశాడు స్పృహ కోల్పోయి.

అలా మొత్తం నలుగురు బేరర్! బేరర్! అనుకుంటూ బైటికి రావడంవల్ల, అంతా స్పృహలు కోల్పోయి కిచన్‌లో బంధింపబడ్డారు.

"నాన్‌సెన్స్!" జాన్ గొంతుక గట్టిగా వినిపించింది, "వెళ్ళిన వాళ్ళు మళ్ళీ తిరిగి రాకుండా ఎక్కడకు పోయినట్టు?" అనుమానం వచ్చింది జాన్‌కి.

గదిలోంచి కాలింగ్ బజర్ ప్రోగించాడు.

బైట నుంచి వచ్చిన ముగ్గురు నౌఖర్లు దార్లోనే బంధింపబడ్డారు.

జాన్ అసహనంతో లోపలినుంచి అరుస్తున్నాడు.

నౌఖరు బట్టలు ధరించిన షణ్ముఖరావు గదిలోపలికి ప్రవేశించాడు.

"ఇంత వరకు ఎక్కడ అఘోరిస్తున్నావు? ఇందాకటి నుంచి పిలుస్తుంటే, యిప్పుడా రావడం?" దగ్గరకు వచ్చిన జాన్ విసురుగా చెయ్యి పైకి యెత్తేడు.

షణ్ముఖరావ్ లాఘవంగా ప్రక్కకు తప్పుకుని అరచేత్తో జాన్ ముఖంమీద చరిచాడు. జాన్ కళ్ళు పచ్చబడ్డాయి. చూపు సరిగా ఆనటం లేదు. షణ్ముఖరావు క్షణ కాలం కూడా ఆలస్యం చెయ్యకుండా బలంగా నాలుగు గుద్దులు గుద్దేడు, పొత్తి కడుపులో.

మెలికలు తిరిగి నేలమీద కట్టెలాగ విరుచుకు పడిపోయాడు జాన్.

ఈ హటాత్ పరిణామానికి జాన్ విస్తుపోయాడు.

షణ్ముఖరావ్ రివాల్వర్ గురి చూపించి "అడుగు ముందుకు వేస్తే కాల్చిపారేస్తాను!" అన్నాడు మిగిలిన అనుచరులని ఉద్దేశించి.

జాన్ గమ్మున లేచి కిటికీ దగ్గరకు పరుగెత్తేడు అవతలకి దూకి పారిపోయేందుకు.

షణ్ముఖరావు చేతిలోని రివాల్వర్ నిప్పులు కక్కింది. రివాల్వర్ గుండు జాన్ తొడలోకి దూసుకుపోయింది.

పెద్దగా మూలుగుతూ జాన్ క్రింద పడ్డాడు.

రివాల్వర్ ప్రేలిన శబ్దానికి ప్రసాద్, రాజారెడ్డి, డి.

యస్. పి. లోపలికి ప్రవేశించి, జాన్ అనుచరులని బంధించారు.

క్షణంలో బైట కాపు కాస్తున్న పోలీసులతో బంగళా నిండిపోయింది.

జాన్ అనుచరుల నందర్నీ బంధించి, వేనుల్లోకి యెక్కించారు. నిర్మల, రవిని తీసుకొని బయటికి వచ్చాడు షణ్ముఖరావ్.

## 15

పోలీసు స్టేషన్‌లో షణ్ముఖరావు, ఎస్. పి., గోపాలం, రాజారెడ్డి, ప్రసాద్, కూర్చుని ఉన్నారు.

నిర్మల, రవి చెప్తున్నది వింటూ కూర్చున్నారు.

ఇంతలో బైట నుంచి కృష్ణమూర్తి, శాంత పరుగెత్తుకుంటూ లోపలకి వచ్చారు.

నిర్మల, రవి తల్లిదండ్రుల బాహువుల్లో కరిగిపోయారు.

ఇంతలో బల్లమీద టెలిఫోన్ గణ గణ మ్రోగింది.

"ఐ. జి. గారు మాట్లాడుతున్నారు; ఫోన్ మీ కోసమే!" అని అందించాడు యస్. పి. షణ్ముఖరావుకి.

షణ్ముఖరావు పది నిమిషాలు మాట్లాడేడు ఫోన్‌లో.

"అంతర్ రాష్ట్రీ ముఠానాయకుడు జాన్, అతని అనుచరులని పట్టుకుని, నిర్మల, రవిలను విడిపించినందుకు నన్ను అభినందించారు. జాన్ యింతకు ముందు చాలా చోట్ల భారీ ఎత్తున చేసిన నేరాలు చాలా ఉన్నవిట. యింత కాలం తప్పించుకుని, పోలీసు డిపార్ట్‌మెంటుకి దొరకకుండా తిరిగి ఆఖరికి ఈ కేసుతో అతని ఆట కట్టింది. జాన్‌ని పట్టించి, పోలీసు డిపార్ట్‌మెంటుకు ఎంతో సహాయ

పడిన నాకు కేంద్ర ప్రభుత్వం నుంచి భారీ ఎత్తున ఫీజు ముట్టేలా చూస్తానని! అన్నారు'' అన్నాడు షణ్ముఖరావు అక్కడ ఉన్న వాళ్ళని ఉద్దేశించి ఫోన్ పెట్టేస్తూ.

''నిర్మలని, రవిని మాకు ప్రాణాలతో అప్పచెప్పి నందుకు మీ ఋణం తీర్చుకోలేము!'' అన్నారు శాంత, కృష్ణమూర్తి.

''మీరు కృతజ్ఞతలు తెలుపుకోవలసింది నాకు కాదు. మీ బావమరిది గోపాలకృష్ణకి. ఈ విషయంలో ఆయన నా సహాయం కోరి ఉండకపోతే, మీకు, మీ పిల్లలకి, ప్రభుత్వానికి ఎంతో అన్యాయం జరిగి ఉండేది!''అన్నాడు షణ్ముఖరావు కుర్చీలోంచి లేచి బైటికి నడుస్తూ.

—: ఐపోయింది :—

# పాము కాటు

## హుస్సేన్ బాషా

అర్ధరాత్రి గడిచింది.

ఆకాశం మేఘావృతమైంది. గాలి రివ్వున వీస్తోంది. కుంభ వృష్టి కురిసే సూచనలు కనబడుతున్నాయి... సన్నని తుంపర పడుతూంది.

వీథుల్లో మనుష్య సంచారం లేదు. వీధి దీపాలు కూడా ఆరిపోయాయి.

రోడ్డమ్మట ఒక వ్యక్తి తన నెవరైనా చూస్తున్నారేమోనని అటూ యిటూ చూపులను ప్రసరిస్తూ గబ గబా నడుస్తున్నాడు. తను చేరుకోవలసిన గమ్యం యింకా కొద్ది దూరముంది. ఆ వ్యక్తి పరుగుదీసి ఒక బంగళా గేటు ముందు ఆగాడు.

గేటు ప్రక్కన కాబిన్‌లో వాచ్ మెన్ ఉన్నాడేమో చీకట్లో అతను త్రాగుతున్న బీడి ఎర్రగా మెరుస్తూ, ఆరుతూ వుంది. వాచ్ మెన్ మేలుకొనే ఉన్నాడని అర్థం చేసుకున్న ఆ నిశాచరుడు చప్పున ప్రక్కకు జరిగి గోడ వారగా నిలుచున్నాడు.

ఏదో ఆకారం గేటు ముందుకు వచ్చి ఆగి వెంటనే ప్రక్కకు తప్పుకున్నట్లు గ్రహించిన వాచ్ మెన్ బీడి అవతల పారేసి, వెంటనే కాబిన్‌లోంచి బాటరీలైటు వేసి గేటు వైపుకు చూశాడు. అతనికి ఎవరూ కనిపించ లేదు.

అయినా అతని అనుమానం తీరలేదు. వర్షం అధికంగా కురువసాగింది. వాచ్ మెన్ గొడుగు వేసుకొని గేటు దగ్గరికి వచ్చి ప్రక్కలకు వేసి చూశాడు. గోడ ప్రక్క ఒదిగి వర్షంలో తడుస్తూ నిలుచున్న మనిషిని చూసి ఆశ్చర్య పోయాడు.

"ఎవరు నువ్వు?" ఆ మనిషి ముఖంపై ఫోకస్ ఉంచి అడిగాడు వాచ్ మెన్.

"కనబడ్డంలా... పాములవాడిని!" నిర్భయంగా సమాధాన మిచ్చాడు అతను. చంకలో యున్న గుండ్రని పాముల బుట్టను సవరించుకుంటూ.

వాచ్ మెన్ కొద్దిక్షణాలు అతన్ని తేరిపార జూసాడు.

తలకు పచ్చటి పాగా, మెడలో రెండు రుద్రాక్ష దండలు, చేతులకు రెండు వెండి కడియాలు, చెవులకు సర్పాకృతిలో వున్న దుద్దులున్నాయి. ఎర్రటి పంచె పైకి దోపుకొని కట్టుకున్నాడు. ఒక ముతక బనీను వేసుకున్నాడు. ఎడమ పాదానికి రాగి కడియం వుంది.

మనిషి నల్లగా ఉన్నాడు. కుడి చెంపమీద ఆముదపు గింజంత నల్లని పులిపిరి; ఎడమ చెంపమీద సన్నని గాటు వుంది. నల్లని కోర మీసాలు ఉన్నాయి. కళ్ళు ఎర్రగా చింత నిప్పుల్లా మెరుస్తున్నాయి.

పాములవాడి ఆకారాన్ని చూసే సరికి వాచ్ మెన్ కి భయం పుట్టింది! అతని చంకలో వున్న బుట్టలో పాము వుంటుందనుకున్న వాచ్ మెన్ శరీరం గగుర్పొడిచింది.

“ఎందుకొచ్చావ్ యిక్కడికి?” భయం వేస్తున్నా కోపంగానే అడిగాను.

“వరుసం వొస్తుంటే ఈడ నిలబడ్డాను. ఏంటి వాచిమేనయ్యా. లైటు వేసి అలా సూత్తవు?” అన్నాడు పాములవాడు.

“అర్ధరాత్రి పూట వీధుల్లో నీకేం పని?”

“ఊరులు, ఊరులు తిరిగి పొట్టపోసుకునే వాడ్ని. నాకు ఒక సోటని ఏముంది వాచిమేనయ్యా? ఆ సెట్టు కింద తొంగుంటే సినుకులు పేరంబమైతే ఎక్కడైనా తల దాసుకుందామని బయలుదేరాను. వరుసం ఎక్కువైతే ఈడ గోడకానుకొని నిలుసున్నాను.”

“ఇది ఎవరి బంగళా అనుకున్నావ్? రావ్ బహదూర్ రాజా నరేంద్ర సింహుల వారిది. ఇక్కడ యెవరూ ఉండ కూడదు. వెళ్ళు! వెళ్ళు!”

“వరుసం కాస్త తగ్గితే వెళ్తానులే వాచిమేనయ్యా!”

“ముందు వెళ్ళు అక్కడ్నించి” గద్దించాడు వాచ్ మెన్.

పాములవాడికి కోపం వచ్చింది.

బుట్టమీద చెయ్యి వేసి “ఎళ్తాను...ఎళ్తాను. బుట్ట

లోని పామును తీసి...'' అని మాట తెరవబోయాడు.

''వద్దు, వద్దు. ఆ పని మాత్రం చెయ్యకు. వాన శగ్గాక నే వెళ్లు!'' అనేసి కాబిన్ దగ్గరికి వెళ్దామని కంగారుగా వెను దిరిగి ముందుకు రెండడుగులు వేశాడు.

అంతే!, బొడ్లోంచి తీసిన పాములవాడి కత్తి వాచ్‌మెన్ వెన్నులో దిగబడింది. అతను 'అమ్మా' అంటూ అలాగే నేలకొరిగిపోయాడు.

## 2

టెలిఫోన్ గణ గణ మ్రోగసాగింది.

ఇన్‌స్పెక్టర్ మనోహర్ వెళ్ళి టెలిఫోన్ రిసీవర్ అందుకున్నాడు.

''సార్! రావ్‌బహద్దూర్ రాజా నరేంద్ర సింహ పాము కాటుతో మరణించారు. ఆయన గదిలోనే ఒక పాముల వాడు రివాల్వర్ షాట్స్‌తో ప్రాణాలు వదిలాడు. అంతే కాదు సార్... గేటు వాచ్‌మెన్‌ని కత్తితో పొడిచి హంతకులు పారిపోయారు. రాజా నరేంద్ర సింహగారి యింటి నుండి ఆయన కూతురు మిసెస్. రాధికా నాగేశ్వర్ ఫోన్ చేసింది. మీరు వెంటనే రావాలి.''

ఇన్‌స్పెక్టర్ మనోహర్ ఆశ్చర్యచకితుడయ్యాడు.

రావ్‌బహద్దూర్ రాజా నరేంద్ర సింహ... ఒక పాములవాడు... గేటు వాచ్‌మెన్... వీరు ముగ్గురు మూడు విధాలుగా మరణించారు. ఒకరు పాముకాటుతో, ఒకడు రివాల్వర్ షాట్స్‌తో, మరొకడు కత్తితో పొడవబడి. మూడు హత్యలు చాలా విచిత్రంగా జరిగాయి.

''మిస్టర్ 301! వెంటనే ఫోటోగ్రాఫర్ ప్రభుదాస్‌ని, ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్ట్ మిస్టర్ మూర్తిని స్టేషన్ దగ్గ

రికి రమ్మని కబురు చెయ్యి. నేను వెంటనే వస్తున్నాను.''
అని రిసీవర్ పెట్టేసి; యూనిఫాం వేసుకోడానికి ప్రక్క
గదిలోకి వెళ్ళాడు మనోహర్.

పోలీస్ జీపు రావ్ బహద్దూర్ రాజా నరేంద్ర సింహ
యింటి ముందాగింది. ఇన్‌స్పెక్టర్ మనోహర్ జీపు దిగి
తన బృందంతో బంగళా గేటు దగ్గరకి వచ్చాడు. గేటు
కానుకొని వాచ్‌మెన్ శవం బోర్లా పడివుంది. శవంమీదికి
బ్యాటరీ లైట్ వేసి చూశాడు.

శవం వర్షంలో బాగా తడిసి వుంది. వర్షానికి రక్త
మంతా కొట్టుకుపోయి వెన్నులో బాగా దిగబడిన కత్తి
పిడి కనిపించింది. అంటే హంతకుడు బలంగా కత్తితో
పొడిచాడు. ఆ ఒక్క దెబ్బతో వాచ్‌మెన్ ప్రాణాలు
పోయాయి. హంతకుడు హత్యాయుధాన్ని విడిచి పెట్టి
వెళ్లాడు.

వాచ్‌మెన్ శవాన్ని పరీక్షిస్తున్నంతలో బంగళా
లోంచి ఓ యువకుడు గబగబా అక్కడికి వచ్చాడు.
''ఇన్‌స్పెక్టర్! లోపలికి వెళ్దాం రండి. మేడమీద మా
మామగారు పాముకాటుతో మరణించారు. పాములవాడి
శవం కూడా అక్కడే వుంది'' అన్నాడు కన్నీళ్ళు
తుడుచుకుంటూ.

''మీరెవరు?''

''నా పేరు నాగేశ్వర్. రాజా నరేంద్ర సింహగారి
అల్లుడ్ని!''

మనోహర్ ఇద్దరు కానిస్టేబుల్స్‌ని అక్కడ వుంచి పరు
గెత్తే విధంగా నడిచి బంగళాలో ప్రవేశించాడు. అక్కడ
నరేంద్ర సింహ కూతురు మిసెస్ రాధిక కుమిలి కుమిలి

ఏడుస్తోంది గోడకు తల ఆనించి.

మనోహర్ హత్యా ప్రదేశంలో అడుగు పెట్టాడు.

పందిరి మంచానికి యివతల రాజా నరేంద్ర సింహా శవం వెల్లకిలా పడివుంది. అతనికి మూడు గజాల దూరంలో పాములవాడి శవం పడివుంది. వెల్లకిలా పడి యున్న పాములవాడి గుండెలమీద రక్తం పేరుకొని వుంది. శవానికి కుడి చేతి ప్రక్క పాముల బుట్ట రెండుగా వీడిపోయి పడివుంది. అందులోని పాము కనిపించలేదు.

ఇన్‌స్పెక్టర్ మనోహర్ మొదట రాజా నరేంద్ర సింహా శవం దగ్గరికి వెళ్ళాడు. అతని కళ్ళు తెరుచుకొని నురుగతో నిండిన నాలుక బయటికి వచ్చి చూపరులను భయభ్రాంతులు కలిగించేలా వుంది.

అర్థరాత్రి సమయం ఒక పాములవాడు రాజా నరేంద్ర సింహా యింట్లోకి ఎందుకు ప్రవేశించాడు? రాజా నరేంద్ర సింహా పాముకాటు వల్ల మరణించాడంటే, ఆ పాములవాడే బుట్టలో పామును తెచ్చి రాజా నరేంద్ర సింహా మీదికి వదిలి వుండవచ్చు. అంటే రాజా నరేంద్ర సింహాను హత్య చేయడానికి పాములవాడు ఆ సమయంలో అక్కడికి వచ్చాడని అర్థమవుతోంది.

రాజా నరేంద్ర సింహా నుండి ఏం ఆశించి పాములవాడు ఆ హత్య చెయ్యడానికుపక్రమించాడో కారణం తెలియదు. కారణం ఏదైనా, అతను నరేంద్ర సింహాను హత్య చేశాడు. మరి, హత్య చేసిన పాములవాడిని రివాల్వర్ పేల్చి ఎవరు చంపి వుంటారు? గేటు వాచ్‌మెన్‌ను చంపింది పాములవాడా? పాములవాడిని హత్య చేసిన హంతకుడా?_

మనోహర్ సిగరెట్ వెలిగించి రెండు దమ్ములు లాగి పొగను గాలిలో వదిలాడు. "మిస్టర్ ప్రభుదాస్! త్వరగా అన్ని కోణాల నుంచి జాగ్రత్తగా ఫోటోలు తియ్యి. డాక్టర్! మీరు శవాలను పరీక్షించండి."

"అలాగే సార్!" అని ఫోటోగ్రాఫరు ప్రభుదాస్ ఫోటోలు తియ్యడానికి సిద్ధమయ్యాడు.

"మిస్టర్ నాగేశ్వర్ గారూ!_ యెవరో పాములవాడు మీ మామయ్యను పాముకాటుతో హత్య చేయాలని యిక్కడికి ఏ ఉద్దేశ్యంతో వచ్చాడని చెప్పగలరా?"

"తెలియదు సార్."

"పాములవాడు మీ మామయ్యని హత్య చేయడానికి వచ్చిన సమయమే, పాములవాడిని చంపడానికి మరో హంతకుడు యిక్కడికి వచ్చి వుండాలి. అంటే రెండవ హంతకుడికి పాములవాడు యిక్కడికి వస్తాడని తెలిసి యుంటుంది. ఇద్దరి ఆశయం ఒకటై యుంటుంది కనుక, మీ మామయ్య పాములవాడి చేతిలో హత్య కాబడ్డాడు. రెండో హంతకుడు పాములవాడిని చంపేసి వుంటాడు, కనుక అతను ఆశించినదేదో సాధించుకుని వెళ్ళి వుంటాడని నా అనుమానం. హంతకుడు యింట్లోంచి ఏమైనా ఎత్తుకు పోయాడా?"

"ఐరన్ సేఫ్కు బీగాలు వ్రేలాడుతున్నాయి. దాని తలుపు మూసి వుంది. ఎందుకైనా మంచిదని ఏం పోయిందో తెరిచి చూడడానికి నేను ప్రయత్నించలేదు."

"అలాగా? రండి చూద్దాం."

నాగేశ్వర్, ఇన్స్పెక్టర్ను ఐరన్ సేఫ్ దగ్గరికి పిలుచుకు వెళ్ళాడు. ఐరన్ సేఫ్ రాజా నరేంద్ర సింహ పడుకో

నున్న పందిరి మంచానికి సమీపంలో వుంది. ఆ ఐరన్ సేఫ్‌ని రాజా నరేంద్ర గాని, అతన్ని చంపిన హంతకుడు గాని తెరిచి ఉండాలి. కనుక, సేఫ్ మీద వ్రేలి ముద్రలు దొరక వచ్చు.

ఇన్‌స్పెక్టర్ మనోహర్ ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్ మూర్తికి ఆ పని అప్పగించాడు. మూర్తి వెంటనే పౌడరు చల్లి, ప్రభుదాస్‌తో ఫోటోలు తీయించాడు.

మనోహర్ సేఫ్ తలుపును తెరిచాడు. అందులో యాభై వేల రూపాయల వరకు క్రొత్త కరెన్సీ ఉంది. క్రింది అరలో బంగారు నగలున్నాయి. దాని ప్రక్క అరలో ఏవో పత్రాలున్నాయి.

మనోహర్ ఆశ్చర్యపడ్డాడు. హంతకుడు డబ్బును గాని, నగలను గాని ముట్టినట్లు లేదు. కనీసం డబ్బుమీద చెయ్యి వేసి ఉన్నా దొంతలు, దొంతలుగా వున్న కరెన్సీ చెల్లా చెదరై యుండేది.

మనోహర్, రాధికను పిలిపించాడు. రాధిక చీర కొంగుతో కన్నీళ్ళొత్తుకుంటూ అక్కడికి వచ్చింది. తండ్రి శవాన్ని చూసి భోరున ఏడ్చింది.

"మిసెస్ రాధికా! ఎంత ఏడ్చినా గతించిన వాళ్లు తిరిగి రారు. గుండెను దిటవు చేసుకోండి. ఈ బంగారు నగలు మీవే ననుకుంటాను."

"అవును... ఇన్‌స్పెక్టర్... ఆ నగలు నావే!"

"ఇవిగాక యింకా నగలు ఏమైనా ఉండేవా?"

"లేవు. నగల్లో ఏ ఒక్కటీ పోయినట్లు లేదు."

"మీకు తెలియకుండా మీ నాన్నగారు ఈ సేఫ్‌లో యింకేదైనా వుంచినట్లు మీకేమైనా తెలుసా?"

"నాకు తెలిసినంతవరకు డబ్బు, నగలు, ఏవో పత్రాలు తప్ప యింకేమీ ఉంచలేదు నాన్నగారు."

"మీ నాన్నగారిని ఒక పాములవాడు పాముచేత కాటువేయించి హత్య చేశాడు. అదే సమయానికి మరో హంతకుడు యిక్కడికి వచ్చాడు. అతను పాములవాడి మీద రివాల్వర్ ప్రేల్చి చంపాడు. విచిత్రమేమిటంటే మీ నాన్నను హత్య చేసిన పాములవాడు ఐరన్ సేఫ్ లోంచి ఏమీ తీసుకోలేదు. అతను ఏదైనా తీసుకొని యుంటే అది ఈ గదిలోనే పడివుండేది. పాములవాడిని చంపిన హంతకుకూడా డబ్బుగాని, బంగారు నగలు గాని ముట్టుకోలేదు. మరి, ఈ హత్యలు ఎందుకు జరిగినట్లు? కారణం మీరేదైనా ఊహించి చెప్పగలరా?"

"చెప్పలేను ఇన్‌స్పెక్టర్. ఆ కారణమేదో మా నాన్న గారికే తెలిసుండాలి."

"మీ నాన్నగారిని కాటేసిన పాము ఏమైంది?"

"ఎటో పారిపోయి వుంటుంది."

"ఆల్ రైట్. జరిగిందేమిటో చెప్పండి."

"ఈ హత్యలు యెలా జరిగాయో నాకేమీ తెలియదు. నేను పక్కగదిలో పడుకొని వున్నాను. కిటికీలోంచి విసురుగా చలిగాలి వీస్తుంటే నిద్ర మెలుకువ వచ్చింది. లేచి కిటికీదగ్గరికి వెళ్ళాను. అంతవరకు బయట వర్షం కురుస్తుందని నాకు తెలియదు. అంతలో ప్రక్క గదిలో యున్న గోడ గడియారం 12 గంటలు కొట్టింది. రాత్రి 11 గంటలు లోగా యింటికివచ్చే మా వారు 12 గంటలు అయినా రాలేదంటే, 11 గంటల ముందునుంచి వర్షం పడుతుండవచ్చునని, అందుక్కారణంగా వారు యింకా

యింటికి రాలేదనుకొని వెళ్ళి పడుకున్నాను.

కొద్దిసేపట్లోనే నాకు నిద్ర పట్టింది. మావారు ఎప్పుడు వచ్చారో 'రాధీ!...రాధీ!!...' అంటూ భుజం తట్టి లేపారు. వారు ఆలస్యంగా ఇంటికి వచ్చారన్న కోపంతో నాకు మెలుకువ వచ్చినా పలుకకుండా కళ్ళు మూసుకొని ఊఁ...కొట్టసాగాను. 'రాధీ, త్వరగా లే రాధీ కొంప మునిగింది' అంటూ ఈసారి ఆయన నా భుజంమీద బలంగా చరిచారు. ఆయన ఎందుకో కంగారు పడు తున్నట్లు గ్రహించి వెంటనే కళ్ళు తెరిచి 'ఏం జరిగింది? ఎందుకలా కంగారు పడుతున్నారు?' అని అడిగాను.

'మామయ్యను పాము కరిచింది. పాములవాడెవడో హత్య కాబడ్డాడు. బయట వాచ్ మెన్ నందయ్యకూడా హత్య కాబడ్డాడు. ఇంత జరిగినా యింకా నిద్ర పోతు న్నావా? మొద్దు నిద్రా!' అన్నారు.

నా నిద్రమత్తు ఒదిలిపోయింది. మంచంమీదినుండి గెంతి యిక్కడికి వచ్చాను. ఇక్కడ నాన్నగారు, అక్కడ పాములవాడు ప్రాణాలు కోల్పోయి పడు న్నారు. ఇన్ స్పెక్టర్ గారూ, మాకు చాలా అన్యాయం జరిగింది!'' అంటూ కుమిలి కుమిలి ఏడ్వసాగింది రాధిక.

''మీ భర్త వచ్చి చెప్పేవరకు యింట్లో ఏం జరిగిందో మీకేమీ తెలియదంటారు.''

''అవును సార్. నాకేమీ తెలియదు.''

''మిస్టర్ నాగేశ్వర్! రాధిక చెప్పినదాన్నిబట్టి చూస్తే హత్యలు జరిగినప్పుడు మీరు యింట్లో లేరని అర్థమవు తోంది. ఆ సమయంలో మీరెక్కడున్నారు?''

''క్లబ్ లో.''

"ఏ క్లబ్?"

"క్లబ్ 'జాలీ ఫ్రెండ్'లో."

"మీరు ఎన్ని గంటలకు ఇంటికి వచ్చారు?"

"టైం సరిగా చెప్పలేను. బహుశా ఒంటిగంట దాటి వుంటుంది."

"మీరు రోజూ క్లబ్బునుండి 11 గంటలలోగా ఇంటికి వచ్చేవారని మీ ఆవిడ చెబుతోంది. రాత్రి మీరెందుకు ఆలస్యంగా వచ్చారు?"

"వర్షం పడుతుంటే రాలేకపోయాను. కాస్త వర్షం తగ్గాక వచ్చాను."

"మీకు తెలిసిన విషయాలు చెప్పండి!"

"నేను రోడ్ మీద టాక్సీ దిగి గేటుముందు నిలుచున్నాను. గేటులోపల నందయ్య శవం కనిపించి ఆశ్చర్యపడ్డాను. మేడవైపుకు చూశాను. మామయ్య పడుకున్న గది కిటికీ అద్దాలు పచ్చగా కనిపించాయి. అంటే, మామయ్య గదిలో లైటు వెలుగుతోందన్నమాట. ఆవేళప్పుడు మామయ్య గదిలో లైటు ఎందుకుంటుంది?

అంటే, ఎవరో వాచ్‌మెన్‌ను హత్యచేసి దొంగతనానికి ఆ గదిలో ప్రవేశించి వుంటారనుకొని ఆలస్యం చేయకుండా గేటుమీదుగా యివతలికి దూకి, మేడమీదికి వచ్చాను. అంతే, యిక్కడ మామయ్య, అక్కడ పాములవాడి శవాలు చూసి దిగ్భ్రాంతుడినయ్యాను. వెంటనే వెళ్ళి రాధికను నిద్ర లేపాను. వెంటనే హంతకు లెవరైనా కనిపిస్తారేమోనని టార్చి తీసుకొని బంగళా చుట్టూ చూసివచ్చాను. ఈలోగా రాధిక పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసింది."

"మీకు యెవరూ కనిపించలేదా?"

"ఎవరూ కనిపించలేదు."

ఇన్‌స్పెక్టర్ మనోహర్, నాగేశ్వర్‌ను యింకేమీ అడుగలేదు.

రిపోర్ట్సు అన్నీ సిద్ధంచేసి మూడు శవాలను మార్చ్యురీ కోసం, హాస్పిటల్‌కు తరలించారు.

# 3

ఉదయం 9 గంటలైంది.

ఇన్‌స్పెక్టర్ మనోహర్ స్టేషన్‌కు వచ్చి ఆఫీసులో కూర్చున్నాడు. సిగరెట్ వెలిగించుకొని, రావ్ బహద్దూర్ రాజా నరేంద్రసింహ, నందయ్య, పాములవాడి హత్యల గురించి ఆలోచించసాగాడు.

ఆ పాములవాడెవడో, యెక్కడ్నించి వచ్చాడో, ఎందుకు రాజా నరేంద్రసింహను పాముతో హత్య చేయించాడో, అసలు అతని పేరు, ఊరు ఏమిటో తెలియక అంతుచిక్కని ఆలోచనలతో సతమత మవసాగాడు.

అతని ఆలోచనలకు అంతరాయం కలిగించేలా టేబిల్ మీదున్న టెలిఫోన్ మ్రోగింది. మనోహర్ సిగరెట్‌ను ఆష్‌ట్రేలో పడేసి వెంటనే రిసీవర్ ఎత్తి "ఎస్. మనోహార్ హియర్..." అన్నాడు.

"గుడ్‌మార్నింగ్ సర్. నేను డాక్టర్ నరహరిని మాట్లాడుతున్నాను. సార్! ఒక క్రొత్త విషయం బయట పడింది. పాములవాడి శవపరీక్ష ముగిసింది. అతను పాముల వాడు కాదు సార్..."

"వాట్ ఆర్ యూ టాకింగ్ డాక్టర్? అతను పాములవాడు కాదా?"

"ఎస్ ఇన్‌స్పెక్టర్. అది వఠి వేషమే! అతని చెవులకు దుద్దులున్నాయి. కాని, చెవులకు రంధ్రాలు లేవు. అతని కుడి చెంపమీదున్న నల్లని పులిపిరి, ఎడమ చెంపమీదున్న సన్నని గాటు అతను చేసుకున్న మేకప్ మాత్రమే! మీసాలుకూడా తగిలించుకున్నవి సార్! అతనికి సమ్మర్ క్రాపు వుంది. ఫ్రెంచ్‌కట్ సన్నని మీసాలు వున్నాయి. గుండెలోంచి రెండు పాయింట్ 32 కాలిబర్ రివాల్వర్ తూటాలు బయటపడ్డాయి. మొదటి షాట్ గుండెకు సమీపంలో తగిలింది. రెండో షాట్‌కు గుండు గుండెలో దిగబడి, గుండె తెగడంవల్ల అతను వెంటనే ప్రాణాలు వదిలాడు."

పాములవాడనుకుంటున్న ఆ హతునికి సంబంధించిన రిపోర్ట్ విని ఆశ్చర్యచకితుడయ్యాడు మనోహర్. డాక్టర్ పరీక్ష జరిపేవరకు అతను పాములవాడు కాదని తనుకూడా గుర్తించలేదంటే, మేకప్ చేసుకోవడంలో అతను ఎంత జాగ్రత్త తీసుకున్నాడో మనోహర్‌కు అర్థమైంది. పాములవాడి వేషంలో యున్న అతను ఎవరు?...

"డాక్టర్! అతని అసలురూపు బయటపడింది. శవాన్ని మళ్ళీ ఫొటో తీయాలి. ఆ శవం యెవరిదో తేలేవరకు డెడ్ బాడీస్ రూములో జాగ్రత్త పరచండి. ఆ ఫొటోను వెంటనే దినపత్రికలో అచ్చువేయిస్తే, శవానికి సంబంధించిన వ్యక్తులు రావచ్చు. అతను ఎవరైనదీ తెలుసుకుంటే, వివరాలు కొన్ని దొరకవచ్చు. డాక్టర్! నేను ఫొటోగ్రాఫర్ ప్రభుదాసును హాస్పిటల్‌కు పంపించేవరకు మీరు అక్కడే వుండండి."

"అలాగే!"

"మిగిలిన రెండు శవాల పరీక్షలు ముగిశాయా?"

"నరేంద్రసింహ శవపరీక్ష ముగిసింది. ఆయన పాము కాటుచేతనే చనిపోయాడు. శవపరీక్ష రిపోర్ట్ కూడా సిద్ధం చేశాను. ఇకపోతే నందయ్య శవపరీక్ష జరుగుతోంది. త్వరలో రిపోర్ట్ సిద్ధం చేస్తాను. అది అయిన వెంటనే సబ్-ఇన్‌స్పెక్టర్ సుధీర్ యిక్కడే వున్నారుగా? మూడు రిపోర్ట్సు వారితో పంపిస్తాను."

"ఆల్‌రైట్! త్వరగా కానియ్యండి."

మనోహర్ రిసీవర్ దించేశాడు.

వెంటనే హెడ్ కానిస్టేబుల్ నెంబర్ 301 ని పిలిచాడు.

301 వచ్చి అటెన్షన్‌లో నిలుచున్నాడు.

"మిస్టర్ 301! వెంటనే యిద్దరు కానిస్టేబుల్స్‌ని వెంట తీసుకువెళ్ళి పట్టణమంతా గాలించి కనిపించిన పాములవాళ్ళ నందరినీ స్టేషన్‌కు తీసుకురా!" అన్నాడు.

"అలాగే సార్!" అని, 301 యిద్దరు పోలీసులను పిలుచుకొని, పట్టణంలో పాములవాళ్ళ వేటకోసం సైకి లెక్కి బయలుదేరాడు.

అంతలో ఫింగర్ ప్రింట్సు ఎక్స్‌పర్ట్ మూర్తి వచ్చాడు.

"సార్. సేఫ్‌మీద దొరికిన వేలిముద్రలు హతుడు రాజా నరేంద్రసింహవి. సేఫ్‌మీద మరెవరి వేలిముద్రలు లభించలేదు. హంతకుడు తన వేలిముద్రలు పడకుండా గ్లోవ్స్ ధరించి వుండాలి. రాజా నరేంద్రసింహ పందిరి మంచం పట్టెలమీద పాములవాడి వేలిముద్రలున్నాయి సార్" అని ప్రింట్సు చూపించాడు మూర్తి.

సాయంత్రం 4 గంటలకు నెం. 301 హెడ్ కానిస్టేబుల్ మరి యిద్దరు పోలీసులు కలిసి ఆరుగురు పాముల వాళ్ళను వెంటబెట్టుకొని పోలీస్ స్టేషన్‌కు వచ్చారు.

"సార్! పట్టణమంతా గాలిస్తే వీరు ఆరుమంది దొరికారు" అన్నాడు 301.

వరుసగా నిలుచునివున్న ఆరుగురి వంక పరీక్షగా చూశాడు ఇన్‌స్పెక్టర్ మనోహర్. రాజా నరేంద్రసింహ యింట్లో తీసిన పాములవాని ఫొటోలను టేబుల్ సొరుగులోంచి బయటికి తీశాడు.

ఫొటోల వంక, పాములవాళ్ళ వంక చూడసాగాడు. తను ఆశించిన విధంగా ఆ పోలికలు గల పాములవాడు ఆ ఆరుగురిలో లేకపోవడంతో నిరుత్సాహపడ్డాడు మనోహర్.

పోలీసులు వారిని ఎందుకు స్టేషన్‌కు తీసుకువచ్చారో వారికేమీ అర్థం కాలేదు. ఎన్నడూ స్టేషన్ ముఖమెరుగని పాములవాళ్ళకి అక్కడికి ఎందుకు పిలుచుకువచ్చారో నన్న భయం లేకపోలేదు. "బాబూ! ఏదో పొట్టకూటి కోసం, ఇంటింటికీ, వీధివీధికీ తిరిగి పాముల నాడించుకుని బతికేవాళ్ళము. మేము ఏమీ తప్పు సేయలేదు బాబూ! పోలీసుబాబులు రాకుంటే మక్కలు విరగ్గొడతామని భయపెట్టి మమ్మల్ని లాక్కొవచ్చారు బాబూ! సత్తె పెమాణంగా సెబుతున్నాను బాబూ - మేమేమీ తప్పు సేయనేదు," అన్నాడు వారిలో పాముల నాగన్న అనే అతను.

ఇన్‌స్పెక్టర్ మనోహర్ ఆ ఫొటోలను పాములవాళ్లకు

చూపిస్తూ, "ఈ ఫొటోలో చనిపోయివున్న పాములవాడు ఎవరో మీకు తెలుసా?" అని అడిగాడు.

పాముల నాగన్న ఫొటోలను చూసి, "ఆయనెందుకు తెలియదు బాబూ? ఆయన పేరు పాముల పుల్లయ్య! మా పాములవాళ్ళందరికీ గురుదేవుడు... పాపం! గురుదేవుడ్ని యెవరు చంపారు బాబూ?" అంటూ, నాగన్నతో బాటు మిగతావాళ్ళుకూడా విచారవిషణ్ణవదనులయ్యారు. నాగన్న నేత్రాలు చెమ్మగిల్లాయి.

"నాగన్నా! ఇతను మీ గురుదేవుడు పాముల పుల్లయ్య కాదు. ఎవడో రాజా నరేంద్రసింహను హత్య చేయడానికి అతని వేషంలో వచ్చి హత్య కాబడ్డాడు."

"అలాగా బాబూ! మా గురుదేవుడు సావలేదన్న మాట!" కన్నీళ్ళు తుడుచుకుంటూ ఫొటోవంక చూస్తూ అన్నాడు నాగన్న.

"మీ గురుదేవుడు అచ్చం యిలాగే వుంటాడా?"

"మా గురుదేవునికీ, ఈ ఫొటోలోని మనిషికీ యేమీ తేడాలేదు బాబూ! ఆయన్ని మా గురుదేవుడు పాముల పుల్లయ్యే అనుకున్నాను."

"పాముల పుల్లయ్య యిప్పుడెక్కడున్నాడు?"

"ఆయన ఈ ఊర్లోనే కాదు; ఈ రాష్ట్రంలోనే లేరు. ఆయన వుంటున్నది ఆంధ్రప్రదేశ్‌లో."

ఇన్‌స్పెక్టర్ మనోహర్ ఆశ్చర్యంగా చూస్తూ, "సరియైన అడ్రసు చెప్పి ఏడవకూడదూ?" అన్నాడు.

"కర్నూలు జిల్లాలో, నల్లమల కొండల్లో యున్న దూలాలకుంట!"

"దూలాలకుంట!...ఆ పేరు నే నెప్పుడూ వినలేదు. నన్ను మోసం చేయాలనుకుంటున్నావేంరా?"

"దూలాలకుంట ఊరు కాదు బాబూ! బొగడ-చలమల మధ్యనున్న చిన్న రైలుస్టేషను. ఎక్స్‌ప్రెస్సులు ఆగవు బాబూ! అంతా కలిసి యిరవై ముప్పై యిళ్ళకంటే ఎక్కువ లేవు. భయంకరమైన కొండప్రాంతం గనుక, అక్కడంతా లంబాడీలు నివాసముంటున్నారు బాబూ! మా గురుదేవుడు పాముల పుల్లయ్య వుంటున్నది అక్కడే బాబూ!"

ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడో కొండప్రాంతాల్లో నివాసముంటున్న పాముల పుల్లయ్య వేషాన్ని యెవరో ధరించి, రాజా నరేంద్రసింహను పాముతో హత్య చేయడానికి ప్రయత్నంచేసి సఫలీకృతుడయ్యాడు. కాని, మరొకని చేతుల్లో అతను హత్య గావింపబడ్డాడు. అతను పాముల పుల్లయ్య వేషం ధరించి రాజా నరేంద్రసింహను చంపడానికి వెళ్ళడంలో ఏదో బలమైన కారణ ముంటుంది. ఎప్పుడైనా పాముల పుల్లయ్య మద్రాసుకు వచ్చాడా? లేక హాతుడు దూలాలకుంటకు వెళ్ళి అతన్ని కలుసుకున్నాడా?

"నాగన్నా! మీరందరూ ఎక్కడ్నించి ఈ పట్టణానికి వచ్చారు?"

"కర్నూలు జిల్లానుండి పొట్టకూటికోసం తలా ఊరు నుండి వచ్చాము" అని, తమతమ ఊర్ల పేర్లు చెప్పి, "మాకు పాము మంత్రాలు, విద్యలు నేర్పింది ఆయనే బాబూ! ఆయనవద్ద విద్యలు నేర్చిన పాములవాళ్ళెందరో బ్రతుకు తెరువుకోసం దేశాలు పట్టుకొపోయారు."

"సరే, యిక మీరు వెళ్ళవచ్చు!"

అందరూ వెళ్ళిపోయారు.

# 5

"రండి ఇన్‌స్పెక్టర్ గారూ! కూర్చోండి!" రాధిక కుర్చీ చూపించింది. తండ్రి మరణించిన దుఃఖం నుంచి ఆమె ఇంకా కోలుకోలేదు. "ఏమైనా ఆచూకీ తెలిసిందా ఇన్‌స్పెక్టర్?" రాధిక నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి.

"ఇంకా ఏమీ బయట పడలేదు." మనోహర్ కుర్చీలో కూర్చున్నాడు.

"మీరు అస్తమానం మీ నాన్నగారిని తలచుకొని దుఃఖిస్తుంటే మీ ఆరోగ్యం దెబ్బతింటుంది. పోయినవాళ్లు తిరిగి రారు. అలా కూర్చోండి; మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడ్డానికి వచ్చాను. ఏడ్వకండి. ధైర్యంగా ఉండండి."

"ఎంత మరిచిపోవాలని ప్రయత్నిస్తున్నానో అంతగా నాకు దుఃఖమెక్కువవుతునే ఉంది. అన్ని ప్రాణాలు నాపై పెట్టుకొని జీవించే నాన్న నాకు దూరమైపోయారు. నాకు చాలా అన్యాయం జరిగింది. హత్యకు కారణాలేమిటో, హంతకులెవరో మీరు త్వరగా తెలుసుకోవాలి."

"నా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తున్నాను. హంతకులు త్వరలోనే పట్టుబడే సూచనలున్నాయి. అందుకోసమే నేను యిప్పుడు మీ దగ్గరికి వచ్చాను. మీరు అన్యథా భావించకుంటే మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను."

"ఏమిటో చెప్పండి!"

"మీరు నిలబడే ఉన్నారు కూర్చోండి!"

"ఫరవాలేదు." కన్నీళ్లు తుడుచుకుంటూ అంది రాధిక.

"మీ భర్త నాగేశ్వర్ ఎక్కడికి వెళ్ళారు?"

"నాతో పోట్లాడి యిప్పుడే బయటికి వెళ్ళారు."

"పోట్లాటా? ఎందుకొచ్చింది మీకిద్దరికి మధ్య పోట్లాట?"

"ఈ కేసును పరిశోధించడానికి ప్రైవేటు డిటెక్టివ్ శ్రీ ప్రేమ్‌కుమార్‌తో మాట్లాడి వచ్చానన్నారు. ప్రేమ్ కుమార్ గారు యాభైవేలు రూపాయలు అడ్వాన్సు అడిగారట. మిగతా యాభైవేలు కేసు పరిశోధనానంతరం యివ్వమన్నారట. మొత్తం లక్షరూపాయలు యిప్పుడే యిచ్చేస్తే కేసును త్వరలో పరిష్కరిస్తారని, మామయ్యను హత్య చేసిన హంతకుడ్ని త్వరలో ఉరికంబమెక్కించేవరకు నా మనస్సుకు శాంతి లభించదని అన్నారు.

ఆయన అభిప్రాయం నాకు సమంజసంగా-ఆసక్తిదాయకంగా కనిపించింది. నాన్నను హత్య చేసిన హంతకులు పట్టుబడాలని నాకూ ఆత్రంగానే వుంది. కాని, ఇన్‌స్పెక్టర్! డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ గారు ఒక హత్య కేసు పరిశోధించటానికి లక్షరూపాయలు డిమాండ్ చేశారంటే నేను నమ్మలేకపోయాను.

ఆ విషయమే మావారితో చెప్పాను. ఆయన కోపంతో కస్సుమన్నారు. మిగతా యాభైవేల రూపాయలు నేను కాజెయ్యాలని అనుకుంటున్నావని కదా నీ అభిప్రాయం? అయితే, నేనీ విషయంలో ఏమీ జోక్యం చేసుకోను. నువ్వలాగే కుమిలి, కృషించు అని కోపంగా వెళ్ళిపోయారు. నేనే ప్రేమ్‌కుమార్ గారితో కన్సల్ట్ చేద్దామనుకున్నాను. ఇంతలో మీరు వచ్చారు."

"ప్రేమ్‌కుమార్ గారు లక్ష రూపాయలు డిమాండ్ చేశారని నాగేశ్వర్ చెప్పినప్పుడు,మీ భర్త అబద్ధం చెప్పి

యాభైవేలు కాజేయాలని అనుకున్నట్లు - మీకా సందేహం ఎందుకు వచ్చింది?"

"నాన్న బ్రతికున్నప్పుడు కూడా ఎప్పుడు చూసినా డబ్బు - డబ్బు అని నన్ను పీక్కు తినేవారు. నాన్నకు తెలియకుండా నేను ఎంతో డబ్బు యిచ్చాను. ఆ డబ్బంతా క్లబ్బులపాలు చేసేవారు. అదీగాక క్లబ్బులో డాన్సర్ కామినిని ఆయన ప్రేమిస్తున్నారని నాకు తెలిసింది. ఆ డబ్బంతా కామిని ప్రేమకు ధారపోస్తున్నాడేమోనని నా అనుమానం."

"నాగేశ్వర్ కామినిని ప్రేమిస్తున్నారని మీకు తెలిసి ఊరుకున్నారా? మీ భర్త ప్రవర్తన పట్ల మీకు అసహ్యం వేయడం లేదా?"

"ఇన్‌స్పెక్టర్! ఏ స్త్రీ-తన భర్త పరస్త్రీ వ్యామోహపరుడు కావడం సహించదు. నేనూ స్త్రీని! ఆయన పరస్త్రీ కౌగిళ్ళ కోసం పరుగెత్తుతున్నాడంటే - సహించే ఓర్పు, క్షమించే త్యాగ గుణం నాకు లేవు. కాని, ఇనస్పెక్టర్!-ఆయన అలా ప్రవర్తిస్తున్నా ఏమీ చెప్పలేని పరిస్థితిలో ఉండి, దుఃఖాన్ని దిగమింగుకో గలుగుతున్నానంటే అందుకు కారణం లేకపోలేదు.

నాకు మూడు మాసాల నుంచి కాన్సర్ వచ్చింది. వ్యాధి బిగినింగ్ స్టేజిలో ఉంది కనుక త్వరలోనే నయమవుతుందని డాక్టర్లు చెప్పారు. ఇప్పటికి వ్యాధి మూడొంతులు నయమయిందనే చెప్పాలి. కానీ, పూర్తిగా ఒక సంవత్సర కాలం వరకు భర్త సాంగత్యానికి దూరంగా ఉండాలని డాక్టర్లు కఠినంగా చెప్పారు. అందుకోసం వారికి నా నుండి శారీరక సుఖ సంతోషాలు లేవు. అందుకోసం వారు

డాన్సర్ కామినిని ప్రేమించి సుఖ సంతోషాలనుభవిస్తుంటే అడ్డుకునేందుకు శక్తి హీనురాలినయ్యాను. నా బాధను, దుఃఖాన్ని నాలోనే సమాధికట్టుకున్నాను. ఆ కారణంతోనే వారు నిర్భయంగా కామినితో సరస సల్లాపాలు సాగిస్తున్నారు.

"కాని, ఇన్‌స్పెక్టర్!_మీరు నాకు తండ్రిలాంటి వారు గనుక_నిన్న రాత్రి జరిగిన ఒక సంఘటన చెబుతున్నాను."

"ఏమిటో చెప్పమ్మా!"

"ఇన్‌స్పెక్టర్!_ నా జబ్బు గురించి జాగ్రత్త వహించమని మా వారిని డాక్టర్ హెచ్చరించారు. అప్పట్నుంచి వారు మరో గదిలో పడుకునే వారు. నిన్న రాత్రి 11 గంటలకు యింటికి వచ్చారు. ఆలోచనలతో అలిసిపోయిన నాకు అప్పుడే కునుకు పట్టింది. వారు నా ప్రక్కలో పడుకున్నారు. నా కాళ్ళమీద కాళ్ళు వేసి నన్ను హత్తుకున్నారు. నేను ఉలిక్కిపడ్డాను. అకస్మాత్తుగా వారికా ఆలోచన ఎందుకు వచ్చిందో అర్థంగాక, వారి బంధం నుండి తొలగి దూరంగా నిలబడ్డాను.

"రాధీ! ఎందుకు నా కౌగిల్లోంచి దూరంగా ఉండాలని ప్రయత్నిస్తున్నావు? నేనంటే నీకిష్టంలేదా? త్రాగి వచ్చానని అసహ్యించుకుంటున్నావా?" అని అడిగే సరికి నేను ఆశ్చర్యపడ్డాను. డాక్టర్ చెప్పిన గడువు యింకా చాలా రోజులుంది. ఆ విషయం వారికి తెలుసు. తెలిసి వారు నాతో శారీరక సుఖాన్ని ఎందుకు కోరుతున్నారో నాకు అర్థం కాలేదు.

త్రాగిన మైకంలో ఆ విషయాన్ని మరిచిపోయారేమోనని 'సంవత్సరం వరకు డాక్టర్_మనం దూరంగా ఉండా

లని చెప్పారు. మరిచి పోయారా?' అని అడిగాను. దానికి ఆయన యిచ్చిన సమాధానం "ఏ డాక్టర్ చెప్పాడు? భార్యా, భర్తలు కలువకూడదని ఎందుకు చెప్పాడు... నాన్ సెన్స్! రాధీ! ఏదో సాకు చెప్పి ఈ రాత్రికి తప్పించుకోవాలని చూస్తున్నావు. నో. ఐ. మస్ట్ ఎంజాయ్ విత్ యూ!" అని మంచం దిగి వచ్చి నన్ను కౌగలించుకున్నారు. బలవంతంగా ముద్దు పెట్టుకున్నారు. మంచం మీదికి తోసి మీద పడ్డారు.

"ఏమండీ! నాకున్న జబ్బు మామూలు జబ్బు కాదు. భయంకరమైన జబ్బు! కాన్సర్..." అని నేను చెబుతుంటే స్ప్రింగ్ లా లేచి నిలుచున్నారు. నాకేసి కోపోద్రేకాలతో చూశారు. "రాధీ! నీకు కాన్సరా?... మరైతే నాకు ముందు ఎందుకు చెప్పలేదు?" అని అడిగారు.

నా వ్యాధి గురించి వారికి తెలియనట్లు మాట్లాడే సరికి వారు నిజంగా నా భర్త అవునా? కాదా?_ అన్న అనుమానం వచ్చింది. వారేమనుకున్నారో ఏమో, వెళ్ళి వారి గదిలో పడుకున్నారు.

రాత్రంతా వారి ప్రవర్తన గురించి ఆలోచిస్తూన్న నాకు నిద్ర పట్టలేదు. నేను వ్యాధిగ్రస్తురాలిని. నాన్న పోయిన దుఃఖం నుండి తేరుకోలేదు. నా మనసు_మనసులో లేదని వారికి తెలిసి రాత్రి ఆయన అలా ఎందుకు చేశారు? నా వ్యాధి గురించి ఏమీ తెలియని వారిలా, అప్పుడే ఆ విషయం తనకు తెలిసినట్లు ఎందుకు ప్రవర్తించారు? ఎంత ఆలోచించినా వారి స్వభావమేమిటో నాకు అంతు చిక్కలేదు.

ఉదయమే లేచి నా గదిలోకి వచ్చారు. "రాధీ! రాత్రి

త్రాగిన కైపులో, నీ వ్యాధి విషయమే మరచిపోయి తొందరపడ్డాను. అందుకు కారణం నీ అందం నన్ను పిచ్చి వాణ్ణి చెయ్యడమే! మూణ్ణెల్ల నుంచి లేని కోరిక రాత్రి నాలో కలుగడం నాకే విచిత్రమనిపించింది. నన్ను క్షమించు రాధీ!" అన్నారు.

"మూణ్ణెల్ల నుంచి నేను యివ్వలేని సుఖాన్ని డాన్సర్ కామిని యిస్తోంది మీకు. మీరెందుకు తొందర పడి రాత్రి నన్ను... నాకు అర్థం కావడం లేదు." అన్నాను. అప్పుడు ఆయన ఆ విషయాన్ని దాటేసి-ప్రేమ్ కుమార్ గారి విషయాన్ని తీసుకు వచ్చారు. ఎందుకో నాకు వారిమీద అనుమానం కలుగుతోంది. ఆయనను నమ్మి కేసు పరిశోధనకు లక్షరూపాయలు యివ్వాలనిపించ లేదు. అందుకే వారు నాతో పోట్లాడి వెళ్ళిపోయారు బయటికి.''

ఇన్‌స్పెక్టర్ మనోహర్ బాగా ఆలోచించాడు.

కొద్ది నిమిషాలనంతరం "రాధికా!- ఆయన నీ భర్త నాగేశ్వర్ కాదు." అన్నాడు.

చైతన్యాన్ని కోల్పోయిన శిలావిగ్రహమే అయింది రాధిక.

"ఇన్‌స్పెక్టర్! ఏమిటి మీరంటున్నది?"

"మీ భర్త స్థానంలో-నాగేశ్వర్ పోలికలను సృష్టించుకొని నాటకమాడుతున్న హంతకుడు."

"మరి నా భర్త ఏమయ్యారు?"

"అతన్ని ఎక్కడైనా బంధించి వుండాలి."

"అంతేనంటారా? యింకేమైనా చేసి వుంటారంటారా?" భయాందోళనలతో అడిగింది రాధిక.

"రాధికా!- మీరేమీ కంగారుపడి మనస్సు పాడు

చేసుకోకమ్మా. మీరు లక్షరూపాయలు యివ్వకుండా మంచి పని చేశారు. మీ భర్త నాగేశ్వర్ గురించి విచారిస్తాను. నాగేశ్వర్ మీద నాకు అనుమానం వుంటే సందేహ నివృత్తి చేసుకోడానికి వచ్చాను. రాధికా!_ మీ నాన్నను పాములవాడి వేషంలో వచ్చిన వ్యక్తి ఎందుకు హత్య చేశాడో నాగేశ్వర్‌కి తెలిసివుంటుంది. పాములవాడు బంగళాలో ప్రవేశించడానికి నందయ్యను హత్య చేసి_మీ నాన్నను పాముకాటుకు గురిచేసి హత్యచేశాడు. ఆ పాములవాడిని నాగేశ్వర్ హత్యచేశాడని అనుమానించి ఇటు వచ్చాను."

"మరయితే ఆ హంతకుడ్ని అరెస్ట్ చెయ్యవచ్చుగా?"

"మీ రిచ్చిన కొన్ని వివరాలతో నా అనుమానం తీరిపోయింది. అతనే హంతకుడు. అతడు ఎక్కడున్నా వెదికి యిప్పుడే అరెస్ట్ చేస్తాను. నాగేశ్వర్‌ను ఎక్కడ బంధించారో తెలుసుకొని మీ భర్తను తెచ్చి మీకు అప్పగిస్తాను."

"అతనికోసం ఎక్కడికో వెళ్ళి. వెతకడం ఎందుకు. మనం అనుమానించినట్లు అతనికి తెలియదు. భోజనానికి యిక్కడికే వస్తాడు. అతనికి తెలియకుండా మీకు ఫోన్ చేస్తాను. వెంటనే మీరు వచ్చి అరెస్ట్ చెయ్యవచ్చు!"

"పిచ్చి తల్లీ! అతను యిక రాడు."

"మనం అనుమానించినట్లు అతనికి తెలియదు."

"అతని ప్రవర్తనవల్ల అతను నీ భర్త కాదని నువ్వు అనుమానించి వుంటావని అతనికి తెలుసు. అందుకే లక్ష రూపాయలకు ప్లాన్ వేసి, అది సారక వెళ్ళిపోయాడు. అతను తిరిగి రాడు. కాని, ఒక విషయం చెప్పు రాధికా?

నీ భర్త డాన్సర్ కామినిని ప్రేమించాడన్నావు."

"అవును. నిజం."

"నీకీ రహస్యం ఎన్నాళ్ళ క్రితంనుంచి తెలుసు?"

"రెండు మాసాలై యుంటుంది."

"నీ భర్త వెళ్ళకుంటే కామిని నీ భర్తకోసం ఎప్పుడైనా ఫోన్ చేసేదా?"

"ఆయన వెళ్ళకుంటే చేస్తుండేది."

"కామిని నీ భర్తకోసం చివరిసారిగా ఎప్పుడు ఫోన్ చేసిందో చెప్పగలవా?"

"అయిదు రోజులనుండి ఆమెనుండి ఫోన్ కాల్స్ రావడంలేదు."

"అయితే, నీ భర్త ప్రతిరోజూ కామినితో కలుస్తూ వుండాలి. ఆయన వెళ్ళని దినమేగా కామిని ఫోన్ చేసేది?"

"అవును."

"చాలా ఆశ్చర్యంగా వుంది. ఈ అయిదురోజుల్లో కామిని దగ్గర్నుండి ఫోన్ కాల్ రాలేదంటే నాగేశ్వర్ ఆమెను కలుస్తూ వుండాలి. కాబట్టి అతన్ని యెవరూ బంధించి వుండరు. అతను పూర్తిగా యింటికి రావడం మానుకొని కామినివద్దనే వుండివుండాలి. ఆ అవకాశాన్ని పురస్కరించుకొని ఎవరో నాగేశ్వర్‌లా నాటక మాడుతుండాలి."

"అంతే జరిగిందంటూరా?"

"అలా జరుగకుంటే ఇతను నీ భర్తే అయుండాలి."

"వారు ఎన్నటికీ అంత నీచానికి ఒడిగట్టరు. ఈ సస్పెన్స్ ఏమిటో మీరే తెలుసుకోవాలి."

"కామిని ఎడ్రస్ నీకు తెలుసా?"

"ఆమె "జాలీ ఫ్రెండ్స్" క్లబ్ డాన్సరు. ఇంటి అడ్రసు_ 25, సెకెండ్ క్రాస్ సి. ఐ. టి నగర్."

మనోహర్ కామిని అడ్రస్ నోట్ చేసుకుని అక్కడ్నించి బయలుదేరాడు.

# 6

ఇన్స్పెక్టర్ మనోహర్ స్టేషన్‌కు వచ్చేసరికి అక్కడ ఒక మధ్య తరగతి స్త్రీ యిద్దరు పిల్లల్ని దగ్గర కూర్చోబెట్టుకొని ఏడుస్తోంటే పిల్లలు కూడా ఏడవసాగారు. ఆమె చేతిలో ఒక దినపత్రిక నలుగుతోంది.

మనోహర్ ఆమె ముందు నిలబడ్డాడు.

మనోహర్‌ను చూసి, ఆమె లేచి నిలబడింది. పిల్లలు కూడా లేచి నిలుచున్నారు. ఇద్దరూ ఆడపిల్లలే. పెద్దపిల్లకి ఎనిమిదేండ్లు, చిన్న పిల్లకి ఆరేండ్లు ఉండొచ్చు.

"సార్!_ రావ్‌బహద్దూర్ రాజా నరేంద్ర సింహ యింట్లో పాములవాడి వేషంలో హత్య కాబడిన హతుని భార్య సునందిని. వీళ్ళిద్దరూ అతని బిడ్డలు! పత్రికల్లో ప్రచురింపబడిన ఫోటోను చూసి వచ్చింది, ఊరు_కర్నూలు జిల్లాలోని గాజుల పల్లె గ్రామం." అని చెప్పాడు 301 హెడ్ కానిస్టేబుల్.

మనోహర్ తల పంకించి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. హేట్ తీసి టేబుల్‌పై ఉంచాడు.

"ఏమ్మా! పత్రికల్లో ప్రచురింపబడిన హతుడు_ నీ భర్తేనా?"

"అవును. ఆయన నా భర్త భాస్కరరావ్. ఉద్యోగ రీత్యా ఆయన మద్రాసుకు వచ్చి ఆరు నెలలు అవుతుంది. 21వ తేదీన ఊరికి వచ్చి నన్ను_పిల్లల్ని తీసుకుపోతానని

మొన్న నే ఉత్తరం వ్రాశారు. ఆయన నన్నూ-పిల్లల్ని తీసుకొని మద్రాసుకు వస్తానని వ్రాసినందుకు నేనెంతో సంతోషపడ్డాను. ఎంతో ఆశతో వారి రాకకోసం ఎదురు చూశాను. 23వ తేదీ అయినా వారు రాలేదు. ఏదో అత్యవసరమైన పనులుండడం వల్ల రాలేకపోయి వుండొచ్చని అనుకున్నాను. మళ్ళీ ఎప్పుడొస్తారు అని ఉత్తరం వ్రాశాను. కాని, ఉత్తరం పోస్ట్ చేయకముందే వారి హత్యావార్తతో బాటు, వారి ఫోటో గల ఈ పత్రిక నా చేతికి అందింది. నా ఆశలన్నీ నిరాశలై జీవితం దుఃఖభూయిష్టమైంది. ఇన్స్పెక్టర్ గారూ! నేను చాలా అన్యాయమై పోయాను. నా భర్త శవాన్ని నాకు చూపించండి!"

"నీభర్త శవం కెమికల్ లేబొరేటరీలో జాగ్రత్తపరచి ఉంచాం. తప్పకుండా నీభర్త శవాన్ని నీకు అప్పగిస్తాము. ముందు నేనడిగే కొన్ని ప్రశ్నలకి సమాధానాలు చెప్పు!"

"ఏమిటో అడగండి!"

"భాస్కర్ రావ్ ఉద్యోగరీత్యా మద్రాసుకు వచ్చి ఆరుమాసాలైందన్నావు?"

"అవును."

"ఆయన చేసే ఉద్యోగమేమిటో నీకు తెలిసి ఉంటుందనుకుంటాను. అతను ఉద్యోగం చేస్తున్నది ఎక్కడ? ఏం ఉద్యోగం?"

"ఆయన ఏదో "జాలీ ఫ్రెండ్స్" క్లబ్ లో ఉద్యోగం చేస్తున్నానని, నెలకు జీతం అయిదువందలని-నాకు నెలకు మూడు వందలు పంపించే వారు. కాని, వారు అక్కడ ఏం ఉద్యోగం చేస్తుండేవారో నాకు తెలియదు."

"ఐ. సీ-రావ్ బహద్దూర్ రాజా నరేంద్ర సింహ-పేరు నువ్వెప్పుడైనా విన్నావా?"

"నేను చిన్నప్పుడు నంద్యాలలో సెయింట్ మేరీ ఫాతిమా అప్పర్ ప్రైమరీ స్కూలులో చదువుకుంటు న్నప్పుడు అతను స్కూలుకు ఎదురుగా వున్న చాంద్ జాడాలో నివసించేవారు. అక్కడ ఆయన లెదర్ యింపోర్ట్ బిజినెస్ చేసేవారు. కాని..."

సునందిని చెప్పడం ఆపింది. ఏదో ఆలోచించసాగింది.

"కాని?__" కుతూహలంగా సునందిని ముఖంలోకి చూస్తూ అడిగాడు మనోహర్.

"అకస్మాత్తుగా ఆయన బిజినెస్ స్టాప్ చేసి నంద్యాల నుండి మద్రాసుకు మకాం మార్చారు. నంద్యాలలో వుంటున్నప్పుడు అతని పేరు రాజా నరేంద్ర్!__ కాని, రాజా నరేంద్ర్ మద్రాసుకు వచ్చాక రావ్‌బహద్దూర్ రాజా నరేంద్ర సింహా అయ్యారు. వేలులో వ్యాపారం చేసే వారు, కోటీశ్వరులయ్యారు."

"అకస్మాత్తుగా అతను కోటీశ్వరుడు కావడానికి కారణం నీకు తెలుసా?"

"తెలియదు."

"రాజా నరేంద్ర్-రావ్‌బహద్దూర్ రాజా నరేంద్ర సింహాగా మారాడన్న విషయం నీకు ఎప్పుడు తెలిసింది?"

"ఆరు మాసాల క్రితం. అంటే, నా భర్త గాజుల పల్లెలో వుంటున్నప్పుడు."

"అప్పటికి ఎన్నేళ్లు అయ్యుంటుంది?"

"పంద్రెండేళ్ళు!"

"అంటే రాజా నరేంద్ర్ నంద్యాల విడిచి పెట్టి మద్రాసుకు వచ్చి పంద్రెండేళ్ళు అయినదన్న మాట!"

"అవును."

"ఏ సందర్భంలో భాస్కర్ రావ్ అతని విషయం నీతో చెప్పాడు?"

"మా ప్రక్కింటి వారికి రోజూ ఆంధ్రపత్రిక దిన పత్రిక వచ్చేది. మా వారికి పత్రిక చదివే అలవాటుంది. పెద్దమ్మాయి పత్రిక యిప్పించుకు వచ్చి వాళ్ళ నాన్నకు యిచ్చేది. ఒక రోజు వారు దిన పత్రిక చదువుతూ 'సునందినీ!—' అని పిలిచారు. ఎందుకు పిలిచారో అని వంట గదిలోంచి ఆయన దగ్గరికి వెళ్ళాను. 'సునందినీ!— ఈ ఫోటోలోని వ్యక్తి యెవరో నీకు తెలుసా?' అని 'స్వర్ణ జయింతి' సిల్వర్ జూబ్లికి సంబంధించిన సినిమా స్టిల్‌ను చూపిస్తూ అడిగారు.

మా వారు చూపిన ఫోటో క్రింద నిర్మాత–రావ్ బహద్దూర్ రాజా నరేంద్ర సింహ అని వ్రాసి వుంది. అది రాజా నరేంద్ర ఫోటో!– ఆ విషయమే మా వారితో చెప్పాను. ఒకప్పుడు నంద్యాలలో తోళ్ళ వ్యాపారం చేసే రాజా నరేంద్ర–ఈనాడు మద్రాసులో అంతటి పేరు ప్రఖ్యాతులు సంపాదించారంటే అందుకు కారణం లేకపోలేదు అన్నారు. ఆ కారణం ఏమిటో చెప్పమని అడిగాను.

దూలాలకుంటలో పాముల పుల్లయ్య కూతురు కస్తూరిని హత్య చేసి, పాముల పుల్లయ్య పగబట్టగా అతనికి తెలియకుండా ఎటో పారిపోయాడట. అతను చేసిన ద్రోహానికి ప్రతీకారం తీర్చుకోవాలని పాముల పుల్లయ్య చేసిన ప్రయత్నమంతా వృధా అయింది. రాజా నరేంద్ర తన కూతురు కస్తూరిని హత్య చేసిన విషయం పాముల పుల్లయ్యకు సాక్ష్యాధారాలతో తెలుసు. అతను పోలీస్ రిపోర్ట్ యిస్తే అతను ఎక్కడున్నా హంతకుడిగా పట్టుబడతాడని పుల్ల

య్యాకు తెలుసు. కాని, పుల్లయ్య పోలీసులకు రిపోర్ట్ యిస్తే కస్తూరి హత్యకు కారణం చెప్పవలసి వస్తుంది. ఆ కారణం బయట పడితే పాముల పుల్లయ్య ప్రాణాలమీదికి వస్తుంది. కనుక, మనిషినే పట్టుకొని తన ప్రతీకారం తీర్చుకోవాలని సమయంకోసం 12 సంవత్సరాల నుండి ఎదురు చూస్తు న్నాడు.

సునందినీ!- పాముల పుల్లయ్య నాకు బాగా తెలుసు. ఏనాటికైనా రాజా నరేంద్ర- జాడ తెలిస్తే రహస్యంగా తనకు తెలియజెయ్యమని నాతో ఎన్నోసార్లు అన్నాడు. అతను చేసిన ద్రోహమేమిటి, అని అడిగితే నా కూతుర్ని ప్రేమించి-చివరికి ప్రాణాలు తీశాడు, అంటాడే గాని— ఎందుకు హత్య చేశాడు?-అని అడిగితే మాత్రం చెప్పడం లేదు. అదో దేవ రహస్యం లాంటి రహస్యంలే బాబూ!- అంటాడు. ఇక్కడ్నించి దూలాలకుంట రెండు స్టేషన్లేగా అర్ధ గంటకు లోకల్ ట్రైను వస్తుంది. రాజా నరేంద్ర అడ్రసు అతనికిచ్చి తిరుగు ట్రైన్ పట్టుకొని వచ్చేస్తాను! అన్నారు.

దూలాలకుంటకు వెళ్ళి పాముల పుల్లయ్యతో మాట్లాడి వచ్చారు. పేపరు కూడా అతని చేతికే యిచ్చి వచ్చారు. మరుసటి దినం పాముల పుల్లయ్య మా యింటికి వచ్చారు. ఇద్దరు కలిసి నంద్యాలకు పోయి ఏదో పని చూసుకొని వెంటనే తిరిగి వస్తామని వెళ్ళిపోయారు. అయిదు రోజులైనా పాముల పుల్లయ్యా గాని-మా వారు గాని రాలేదు. నాకేదో భయం వేసింది. మరుసటి రోజు, తను మద్రాసుకు వెళ్ళానని-జాలీ ఫ్రెండ్స్ క్లబ్ లో ఉద్యోగం చేస్తున్నానని, చెప్పకుండా వచ్చి అక్కడ ఉద్యోగం చేసుకున్నం

దుకు క్షమించమని_వారు ఉత్తరం వ్రాశారు.''

సునందిని చెబుతున్న చరిత్ర వింటుంటే మనోహర్ కు ఎంతో ఆశ్చర్యం వేయసాగింది. రాజా నరేంద్ర సింహ జీవిత విశేషాలు చాలా విచిత్రంగా వున్నాయి. అతని హత్య వెనక యింకా ఎన్ని రహస్యాలు బయటపడతాయో తెలియదు.

భాస్కరరావ్_పాముల పుల్లయ్య ఆరు మాసాల క్రితం మద్రాసుకు వచ్చారు.

భాస్కరరావ్ జాలీ ఫ్రెండ్స్ క్లబ్బులో ఉద్యోగం సంపాదించుకున్నాడు. వెంటనే భార్యకు ఉత్తరం వ్రాశాడు. అతను ఉద్యోగం కోసం మద్రాసుకు రాలేదు. రాజా నరేంద్ర సింహ మీద ప్రతీకారం తీర్చుకునే పాముల పుల్లయ్య వెంట వచ్చి, ఏ కారణం చేతనో మద్రాసులో వుండాలని ఉద్యోగం సంపాదించుకున్నాడు.

మరి, పాముల పుల్లయ్య ఏమయ్యాడు.

ఆరు మాసాల నుంచి అతను రాజా నరేంద్ర సింహ మీద ఎందుకు ప్రతీకారం తీర్చుకోలేదు? పాముల పుల్లయ్య వేషంలో వెళ్ళి భాస్కరరావ్ - రాజా నరేంద్ర సింహను పాముకాటుతో ఎందుకు అంత విచిత్రంగా హత్య చేశాడు?

అసలు పాముల పుల్లయ్య ఏమయ్యాడు.

నకిలీ నాగేశ్వర్ ను అరెస్ట్ చేస్తే అన్ని విషయాలు బయట పడతాయి. భాస్కరరావ్, నాగేశ్వర్, డాన్సర్ కామిని_వీళ్ళంతా 'జాలీ ఫ్రెండ్స్' క్లబ్ కు సంబంధించిన వాళ్ళు. కనుక ఈ హంతకులకు అది కీలక స్థానమై యుంటుంది, అని ఒక నిర్ణయానికి వచ్చాడు మనోహర్.

# 7

ఇన్‌స్పెక్టర్ మనోహర్ "జాలీ ఫ్రెండ్స్ క్లబ్"కు వచ్చాడు-మఫ్టీలో. అతని కళ్ళు నాగేశ్వర్ కోసం వెదక సాగాయి. అతను కనిపించలేదు.

అప్పటికి సాయంత్రం 6 గంటలైంది. నకిలీ నాగేశ్వర్ ఉదయం 9 గంటల ప్రాంతంలో రాధికతో పోట్లాడి కారు వేసుకొని బయలుదేరినతను నేరుగా క్లబ్‌కువచ్చి వుండా లనుకున్న మనోహర్, ఆ కారు పార్కింగ్ స్పేస్‌లోగాని, గేరేజిలో గాని, ఉంటుందేమోనని చూశాడు. గేరేజి కూడా ఓపెనింగ్‌లోనే వుంది. అక్కడ రెండు కార్లు కనపించాయి. వాటిలో నాగేశ్వర్ కారు లేదు.

"నీ పేరు?"

"కుళ్ళాయప్ప."

"నేనెవరో నీకు తెలుసా?"

"ఇన్‌స్పెక్టర్ మనోహర్ బాబుగారు."

"కనుక, అబద్ధాలు చెప్పడానికి ప్రయత్నించకు. నాగేశ్వర్ వచ్చి వెళ్ళాడా?"

"రాలేదు సార్."

"నీ డ్యూటీ ఎప్పట్నుంచి?"

"ఉదయం 6 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు."

మనోహర్ వాచీకేసి చూశాడు. 6-12 నిమిషాలైంది.

"నీ డ్యూటీ అయిపోయిందిగా?"

"నైట్ వాచ్‌మెన్ యింకా రాలేదు. అతను వచ్చే వరకు నేనుండాలి సార్."

"అయితే నాగేశ్వర్ ఉదయం నుండి క్లబ్బుకు రాలే దంటావు?"

"రాలేదు సార్."

మనోహర్ అక్కడ్నించి క్లబ్బులో ప్రవేశించాడు. కౌంటర్ ఎదురుగా నిలబడ్డాడు. కౌంటర్‌లో కూర్చున్న మనిషి వెంటనే లేచి "కూర్చోండి సార్" అన్నాడు.

"మేనేజర్ ఎక్కడ?"

"ఒంట్లో బాగాలేదని ఈరోజు శెలవు పెట్టాడు సార్. ఆ పని ఈ రోజు నేనే చూసుకుంటున్నాను సార్."

"నాగేశ్వర్ యిక్కడికి వచ్చాడా?"

"ఈ రోజు అతను రాలేదు సార్."

"ఈ రోజు మిస్. కామిని డాన్స్ ప్రోగ్రాం వుందనుకుంటాను."

"వుంది సార్."

"కామిని యిప్పుడు క్లబ్‌లో ఉందా?"

"రాత్రి 10 గంటలకు ప్రోగ్రాం వుంది సార్. 9 గంటలకు వస్తుంది."

"మిస్టర్! నీ పేరేమిటో చెప్పావు కాదు."

"మీరు అడుగకుంటే మీకు నా పేరు తెలుసుననుకున్నాను. నా పేరు రాజేష్."

"మిస్టర్ రాజేష్!_ నీవు ఈ క్లబ్బులో పనిచేయ బట్టి ఎంత కాలమైంది?"

"రెండు సంవత్సరాలుదాటి మూడో సంవత్సరం జరుగుతుంది."

"భాస్కరరావ్ నీకు తెలుసు కదూ?"

"తెలుసు."

"అతను పాములవాని వేషంలో రావ్ బహద్దూర్ రాజా నరేంద్ర సింహ ఇంటికి వెళ్ళి ఎందుకు హత్య చేయ

బడ్డాడో నీకు తెలిసి వుంటుంది.”

“ఆ వివరాలన్ని నాకేమీ తెలియవు సార్. అతను క్లబ్ విడిచి ఎన్నడూ బయటికి వెళ్ళిన మనిషి కాదు. ఆ రోజు అతను పాములవాడి వేషం ధరించి అక్కడికి ఎందుకు వెళ్ళాడో అతన్ని యెవరు హత్య చేశారో ఎవరికీ అర్థం కావడం లేదు. అతను చాలా మంచివాడు సార్.”

“నువ్వు అతని గురించి నిజమే చెబుతున్నావా?”

“నిజమే చెబుతున్నాను సార్.”

“అతను ఇక్కడ ఏం పని చేసేవాడు?”

“మా బాస్‌కు అతను సెక్రటరీ సార్.”

“మీ బాస్ రామ్మూర్తి ఇప్పుడెక్కడున్నాడు?”

“ఆయన యింకా యింటి నుంచి రాలేదు.”

“ఎన్ని గంటలకు వస్తాడు?”

“7 గంటలకు.”

మనోహర్ అతన్నింకేమీ ప్రశ్నించలేదు. వెంటనే టెలిఫోన్ రిసీవర్ ఎత్తి, రాధిక ఇంటి నెంబర్‌కి డయల్ చేశాడు. అయిదు నిమిషాలైన రాధిక యింటి నుంచి రెస్పాన్స్ రాలేదు.

15 నిమిషాలు ఆగి మళ్ళీ ఫోన్ చేశాడు.

రెస్పాన్స్ లేదు.

మనోహర్ రిసీవర్ దించేసి గబగబా క్లబ్ బయటికి వచ్చాడు. పార్కింగ్ స్పేస్‌లో యున్న తన రాజ్‌దూత్ మోటర్ సైకిల్ ఎక్కి రాధిక యింటికి బయలుదేరాడు.

పది నిముషాల్లో రాధిక బంగళా చేరాడు మనోహర్. బంగళా ఆవరణలో నాగేశ్వర్ కారు కనిపించింది. నాగేశ్వర్ యింటికి వచ్చాడనుకొని నేరుగా యింట్లోకి ప్రవే

శించాడు. డ్రాయింగ్ రూంలో ఒకతను కాళ్ళు చేతులు కట్టబడి వాకిలి ప్రక్కగా పడున్నాడు. అతని నోటినిండా గుడ్డ కుక్కబడి వుంది.

మనోహర్ వెంటనే అతని నోట్లోంచి గుడ్డను బయటికి లాగాడు.

"ఎవర్నువ్? నిన్నెవరిలా చేసింది? రాధిక ఎక్కడ?" అని అడిగాడు ఆతృతగా.

"నేను ఇంటి నౌఖర్ని బాబూ! నాగేశ్వర్ బాబు నన్ను యిలా బంధించి, తన భార్య రాధిక వీపుకు రివాల్వర్ ఆనించి మేడపైకి నడిపించుకు వెళ్ళారు. మనిషి బాగా త్రాగి వచ్చారు. చాలా కోపంగా వున్నారు. వారు యింత దారుణంగా యెందుకు ప్రవర్తించారో తెలియదు. రాధికమీద ఆయనకి ఎంతో ప్రేమ! ఆమెకు ఒక రోజు జలుబు చేసినా నలుగురు డాక్టర్లని పిలిపించి చూపించేవారు."

నౌఖరు చెబుతున్న మాటలు మనోహర్ వినిపించుకునే పరిస్థితిలో లేడు. నాగేశ్వర్ రాధికను ఏం చేశాడోనని అతని ఆందోళన. రివాల్వర్ తీసి చేతిలో పట్టుకొని మేడపైకి పరుగెత్తాడు.

పడగ్గదిలో రాధిక అదే పరిస్థితిలో వుంది.

బాగా ఏడ్చినందువల్ల కళ్ళు ఎర్రగా వాచివున్నాయి. కణతలమీదుగా కన్నీరు ధారలుగా పోతూనేవుంది. ఆమె నోట్లోంచి గుడ్డను లాగుతూ, "మిసెస్. రాధికా! నాగేశ్వర్ ఎక్కడు?" అని అడుగుతున్నంతలో, ప్రక్కన వుంచిన రివాల్వర్ దూరంగా ఎగిరిపడింది. ఇన్స్పెక్టర్ మనోహర్ తిరిగి చూసేలోగా—

"హేండ్సప్ మై డియర్ ఇన్‌స్పెక్టర్!" అన్న మాటలతోబాటు నకిలీ నాగేశ్వర్, చేతిలో రివాల్వర్ పట్టుకొని గంభీరంగా నిలుచున్నాడు.

ఆశ్చర్యచకితుడయ్యాడు మనోహర్. అతను వచ్చిన వెంటనే నౌఖరును, రాధికను పరామర్శించకుండా నేరుగా సేఫ్ వున్న గది దగ్గరికి వెళ్ళివుంటే నాగేశ్వర్‌ను సులభంగా లొంగదీసుకునేవాడు. అక్కడే తను తెలివితక్కువగా ప్రవర్తించాడు.

"ఇన్‌స్పెక్టర్! అక్కడ్నించి లేవడం అటుంచి, ఏ కాస్త కదిలినా అనవసరంగా నీ ప్రాణాలు పంచభూతాల్లో కలిసిపోతాయి. నేను రాధిక భర్త నాగేశ్వర్ కాదని నువ్వు అనుమానించి నన్ను పట్టుకోడానికి అన్వేషిస్తున్నావని నాకు తెలుసు. మిస్టర్ ఇన్‌స్పెక్టర్! నా గురించి అన్వేషించినా యిక ప్రయోజనమేమీ వుండదు. నేను ఎన్నటికీ నీ చేతులకు చిక్కను!"

"నీలాంటి కొమ్ములు తిరిగిన మొగాళ్ళ నెందరినో చూశాను. నా చేతుల్లోంచి యింతవరకు తప్పించుకోలేదెవరూ" అన్నాడు మనోహర్ తీక్షణంగా చూస్తూ.

"ఇన్‌స్పెక్టర్! నేను నీకు చిక్కను!! ఈ డబ్బు, నగలతో నేను వెళ్ళిపోతాను. ఇక ఎన్నటికీ ఈ యింటి ఛాయలకు కాదు కదా, ఈ మద్రాసు నగరంలోనే అడుగు పెట్టను. నా దారికి అడ్డు వచ్చావంటే నిర్దాక్షిణ్యంగా షూట్ చేస్తాను. గుడ్ బై!" అంటూ అతను బ్రీఫ్ కేస్ తీసుకొని అవతలికి గెంతబోయాడు.

మనోహర్ వెంటనే కాలు ముందుకు చాపాడు స్ప్రింగ్‌లా. పోతున్నవాడల్లా కాలు తట్టుకొని దభీలుమని

క్రింద పడ్డాడు. మనోహర్ ప్రక్కకి దొర్లి లేవబోతున్న అతని గుండెలకేసి తన్నాడు. ఇనుపసుత్తిలా పడిన బూటు కాలు దెబ్బకు ఆ వ్యక్తి 'అమ్మా' అని అనకుండా ఉండ లేకపోయాడు. కాని, చేతిలోని రివాల్వర్‌ను అతను విడిచి పెట్టలేదు.

అతని చేతిలోని రివాల్వర్‌ను ఎగురగొట్టాలని బూటు కాలుతో మళ్ళీ తన్నబోయాడు మనోహర్. అతను కుడి చేతిని ప్రక్కకు జార్చి, ఎడమచేత్తో మనోహర్ బూటు కాలును అందుకొని బలంగా మెలిత్రిప్పాడు. మనోహర్ కాలు నరము కలుక్కుమంది. వెంటనే క్రింద పడ్డాడు మనోహర్.

మనోహర్ యిటు తిరిగి లేచేలోగా ఆ వ్యక్తి చేతిలోని రివాల్వర్ ప్రేలిపోయింది.

అందులోంచి బుల్లెట్ దూసుకురాలేదు. కాని, అందు లోంచి వెలువడిన క్లోరిన్ గాస్ మనోహర్‌ను, రాధికను స్పృహ తప్పించింది. అతను వికృతంగా నవ్వి బయటికి పరుగెత్తాడు.

కారులో కూర్చొని స్టార్ట్ చేశాడు.

# 8

వీధుల్లో కార్పొరేషన్ లైట్లు వెలుగుతున్నాయి.

చీకటి పడుతున్న సమయం గనుక వచ్చే పోయే కార్లతో, లారీ, రిక్షాలతో, షాపింగ్స్ చేసుకువెళ్ళే స్త్రీ పురుషులతో రోడ్ చాలా రద్దీగా వుంది. జనసమ్మర్దాన్ని లెక్కచెయ్యకుండా, ట్రాఫిక్ రూల్స్‌కు వ్యతిరేకంగా రాజా నరేంద్రసింహ యింట్లోంచి బ్రీఫ్ కేస్‌తో బయట పడ్డ వ్యక్తి, కారును రాష్‌గా డ్రైవ్ చేసుకు వెళ్తున్నాడు.

తనను యెవరు చూసినా భయంలేదు. చూసినవాళ్ళు ఆ కారు రాజా నరేంద్రసింహ అల్లుడు నాగేశ్వర్‌దని, అతను నాగేశ్వర్ అని అనుకుంటారు. కాని, పోలీసులు నాగేశ్వర్ రూపంలో యున్న తనను అరెస్ట్ చేయడానికి తనకోసం వేటకుక్కల్లా తిరుగుతున్నారు. కనుక తను పోలీసుల కంట బడకూడదు. ముఖ్యంగా తను బాస్ కంట బడకూడదు. అంతేకాదు. అతని అనుచరులు చూసినా తనకు ప్రమాదమే! వారు తన కారుకు ఆక్సిడెంట్ చెయ్యొచ్చు! ప్రాణాలతో గాకపోయినా తన శవాన్నయినా తీసుకువెళ్ళి బాస్ పాదాల ముందు పడవేయడం ఖాయం!

కారులో ఎంతోదూరం వెళ్ళడం కష్టం. జనసమ్మర్దం లేని స్థలంలో కారును విడిచి ఎవరికంట బడకుండా తప్పించుకోవాలి.

కారు మలుపు తిరిగి బీచ్‌రోడ్ ఎక్కింది. రోడ్ ప్రక్కగా కారు నిలిపాడు. తన మేకప్ తుడిచేసుకొని అక్కడ్నించి అదృశ్యమై పోవాలనుకున్నాడు. జేబులోంచి కర్‌చీఫ్ తీసి ముఖం తుడుచుకోబోతున్నంతలో వెనుకనుండి మెడమీద చల్లగా ఒత్తుకుంది. అది రివాల్వర్ అని గ్రహించడానికి అతనికి ఎంతోసేపు పట్టలేదు.

అతనికి ఆశ్చర్యంతోబాటు ఆందోళన అధికమైంది. తనకు తెలియకుండా కారు బాక్ సీట్లో దాక్కొని ఎవరో అంతదూరం వచ్చారు. అంటే, తను రాజా నరేంద్రసింహ యింట్లో ప్రవేశించడం యెవరో చూశారు. తను పని పూర్తి చేసుకొని తిరిగి వచ్చేలోగా కారులో నక్కి కూర్చున్నారు. తప్పించుకోవాలనే తొందరబాటులో కారులో తొంగిచూసే అవకాశం లేకపోయింది.

"మిస్టర్ రమేష్! నీ ఎత్తులు నా దగ్గర సాగవు" అని హెచ్చరించిందా స్వరం.

ఆమె డాన్సర్ కామిని అని గ్రహించడానికి అతనికి ఎంతో సేపు పట్టలేదు. ఆమె సాహసానికి రమేష్ ఆశ్చర్యపోయాడు.

"డార్లింగ్! నువ్వా?" అన్నాడు.

రమేష్ ఆ మాట చెబుతూనే కామిని కాలసర్పంలా బుసకొట్టింది.

"షటప్! చేసిన మోసం చాలక నన్ను యింకా 'డార్లింగ్!' అని పిలుస్తున్నావా? సిగ్గులేదూ?"

అతను నవ్వాడు.

"నేనెందుకు సిగ్గుపడాలి డియర్?"

"నాగేశ్వర్లా నటించి నా యవ్వనంతో ఆటలాడినందుకు. నన్ను నమ్మించి నా జీవితాన్ని నాశనం చేసినందుకు!"

"అందుకు బాధ పడుతున్నావా?"

"అంతేకాదు. మోసపోయి నా శీలాన్ని ఒక దుర్మార్గుడికి అర్పించినందుకు అవమానంతో కుమిలి పోతున్నాను."

"అలా ఫీలవడానికి నువ్వేం పతివ్రతవు కాదుగా?"

"ర... మే...ష్!?"

"కాళ్ళకు గజ్జలుకట్టి నీ సొగసు సోయగాలను పదిమంది ముందు ప్రదర్శించి రసికులను ఉన్మత్తులను చేసే విధంగా నాట్యం చేసే నాట్యకత్తె! నీకూ మానాభిమానా లున్నాయా? వాట్ ఎ వండర్?"

"ఉదరపోషణకోసం నేను నాట్యగత్తె నయినంత

మాత్రాన, సువ్యాహించినంతటి నీచురాలిని కాను. నాట్యగత్తెలకుకూడా హృదయముంటుందని, పవిత్రంగా ప్రేమించే మనసు వుంటుందని తెలియని మూరుడివి! నాగేశ్వర్‌ను నేను హృదయపూర్వకంగా ప్రేమించాను. అతను నన్ను ప్రాణాధికంగా ప్రేమించాడు. మేము త్వరలో వివాహం చేసుకోబోతున్నాము. ఇంతలో నీ మోసానికి నేను బలి అయిపోయాను. నాగేశ్వర్‌కు నేను ద్రోహం చెయ్యలేను. నీ అసలు స్వరూపం తెలుసుకొని నీమీద కసి తీర్చుకోడానికి బాస్‌తో చేతులు కలిపి నిన్ను అనుసరించవలసి వచ్చింది. ఎందుకు తెలుసా?''

''నన్ను చంపడానికా?''

''ఆ పని చెయ్యాలంటే ఈ క్షణమే నీ శవాన్ని నేను కళ్ళ జూడగలను. నా ప్రతీకారం తీర్చుకొని ఆనందించగలను. కాని, నాగేశ్వర్ ఏమయ్యాడో చెప్పేవరకు నీ గుండెల్లో నిద్రపోతాను. చెప్పు! నాగేశ్వర్ ఎక్కడ?'' రివాల్వర్ బారెల్‌ను అతని మెడకు కాస్త గట్టిగా ఒత్తుతూ అంది కామిని.

''కామినీ! నాగేశ్వర్‌ను మర్చిపో! మనిద్దరం దూరంగా పారిపోయి పెళ్ళిచేసుకొని హాయిగా జీవిద్దాం.''

''నీతో పెళ్ళి ఈ జన్మలో జరుగదు.''

''ఏం? నాగేశ్వర్‌ను పెళ్ళి చేసుకుంటావా?__'' అంటూనే సడెన్‌గా ప్రక్కకు జారి రెప్పపాటులో కామిని చేతిలోని రివాల్వర్‌ను లాక్కున్నాడు.

కామిని కెవ్వున కేక వేసింది. రివాల్వర్‌తో ఆమెను షూట్ చేయబోయేంతలో కారు టైర్ బర్స్ట్ అయిన శబ్దమయ్యింది.

కామినికి మెరుపులా ఒక ఆలోచన తట్టింది. అతను ట్రిగ్గర్‌పై వ్రేలుంచే లోగా కాలెత్తి రమేష్ చేతికేసి తన్నింది. రివాల్వర్ ఎగిరి కారు టాపుకు తగిలి లోపలే పడిపోయింది.

ఓ కారు వచ్చి వెనుక కొద్దిదూరంలో ఆగింది. ఆ కారులో వున్న అయిదుగురు వ్యక్తులు రివాల్వర్లు పట్టుకొని రమేష్‌వద్ద కురికారు.

రమేష్ చటుక్కున వంగి కారులో పడియున్న రివాల్వర్‌ను అందుకోబోయాడు. కామిని అతను రివాల్వర్ అందుకోడానికి వంగేసరికి అమాంతంగా రెండుకాళ్ళు ఎత్తి అతని మెడమీద వేసింది. అతని తల ఆమె కాళ్ళ మధ్య యిరుక్కుంది.

ఆమె చేసిన మోసానికి మహోగ్రుడై, "కామినీ! నీ ప్రాణాలు తీస్తాను" అని మెడ విదిలించుకుంటూనే రివాల్వర్‌ను అందుకోబోయాడు. కాని, కామిని అతనికి ఆ అవకాశాన్ని యివ్వక వెంటనే అతని చెయ్యి అందుకొని గట్టిగా కొరికింది.

అతని చేతిలో ఆమె పళ్ళు దిగబడ్డాయి. రక్తం కారింది. అతను బాధగా అరిచాడు. ఎంత బలంగా లాగినా కామిని నోట్లోంచి చెయ్యి విడిచిపెట్టలేదు. రక్తం చల్లగా జారుతోంది.

"కామినీ? ఏమిటీ రాక్షసత్వం? యూ డెవిల్! నా చెయ్యి..." అతని మాటలు పూర్తికాక ముందే, కారు దగ్గరికి చేరిన బాస్ అనుచరులు, అయిదుగురు అయిదు రివాల్వర్లను అతని వీపుకు ఆనించారు.

"వెల్‌డన్ మిస్. కామినీ! నీ సమయస్ఫూర్తి అభినంద

నీయమైంది. రమేష్ యిక పారిపోలేడు, అతన్ని విడిచి పెట్టు!'' అన్నాడు ఒకవ్యక్తి కారులోకి తొంగిచూస్తూ.

కామిని కాళ్ళు తీసుకుంటూ ఒక కాలుతో అతని ముఖంమీద తన్నింది. అతని తల కారు టాప్‌కు తగిలింది. ముక్కు అదిరి బొటబొట రక్తం కారసాగింది. ఆమె అతని చేతిని విడిచిపెట్టి నడుమువరకు జారిపోయిన చీరను సవరించుకుంటూ లేచి కూర్చుంది. ఆమె ఆయాసంతో రొప్పుతూనే—

''మిస్టర్ రమేష్! దగాపడ్డ ఆడది తెగిస్తే యేమైనా చెయ్యగలదు. నువ్వు నాకు చేసిన మోసానికి నీకీ శిక్ష చాలదు. నిన్ను ముక్కలుగా నరికి పోగులు పెట్టినా నా కసి, కక్ష, ప్రతీకార వాంఛ చల్లారదు. ఇక నువ్వు బాస్‌కు చేసిన ద్రోహానికి ఎంతటి శిక్షను అనుభవిస్తావో తెల్సుకుందువుగాని!'' అని కామిని మరో దెబ్బ వెయ్యడానికి చెయ్యి ఎత్తింది.

''మిస్. కామినీ! నీ కసి, క్రోధం తీర్చుకోడానికి యిది సమయము కాదు. ఆలస్యం చేస్తే మనమందరము పోలీసులకు దొరికిపోవచ్చు. కామినీ! త్వరగా వెళ్ళి మన కారులో కూర్చో. ఈ యిడియట్‌ని బంధించి బాస్ దగ్గరికి తీసుకువెళ్దాం!'' అని చెప్పగానే కామిని కారులోంచి క్రిందికి దిగి, వాళ్ళు తెచ్చిన కారువైపుకు బయలుదేరింది.

''మిస్టర్స్! ఇంతమందిలోంచి నేను తప్పించుకో వెళ్ళడం కల్ల. నన్ను బంధించకండి. ఈ బ్రీఫ్‌కేసులో ఎంతో డబ్బు, నగలున్నాయి. మీరు 'సరే' నంటే యీ సంపదను అందరము సమంగా పంచుకొని ఎవరి దారిన వాళ్ళం వెళ్ళిపోదాం. అర్ యూ అగ్రీడ్?'' ముక్కు

ల్లోంచి కారుతున్న రక్తాన్ని తుడుచుకుంటూ, కామిని కొరికినందువల్ల కండ తెగి రక్తం చిమ్ముతున్న చేతికేసి చూచుకుంటూ అన్నాడు రమేష్.

"మొత్తం విలువ ఎంత వుంటుంది మిస్టర్ రమేష్?" అడిగాడు ఒకడు.

"డబ్బు నగలు కలిసి పంద్రెండు లక్షలు!"

అందరూ ఫక్కుమని నవ్వారు.

"ఆఫ్టరాల్ పంద్రెండు లక్షలు!..." ఒకడు నిర్లక్ష్యంగా అన్నాడు.

"సిగరెట్‌కు పదిపైసలు లేక అడుక్కుతిన్న రోజులు మర్చిపోయావా మిస్టర్ రాబర్ట్? లక్షలంటే లెక్క లేకుండా మాట్లాడుతున్నావు?"

"నాన్ సెన్స్!" రాబర్టు కోపంగా అరిచాడు. "నిన్ను పట్టి తెచ్చిస్తే బాస్ మాకేం బహుమానం యిస్తానన్నాడో తెలుసా? మనిషికి పాతిక లక్షలు బహుమానం!"

"నన్ను పట్టుకుంటే మీ కందరికీ లభించేది 150 లక్షలు! ఓ మైగాడ్! అంతడబ్బు మీ కెందు కిస్తానన్నాడు బాస్?"

"నీవల్ల బాస్‌కు అయిదుకోట్ల రూపాయలు లాభిస్తాయి గనుక!"

"ఎలా?"

"షటప్! అధికప్రసంగం అక్కర్లేదు" అని రాబర్టు అతని చేతులను కట్టివేశాడు.

రమేష్‌ను కారులో వేశారు. అరవకుండా నోటికి ప్లాస్టర్ అంటించారు.

కారు బాణంలా ముందుకు దూసుకువెళ్ళింది.

# 9

"మిస్టర్ రమేష్!"

బాస్ నేత్రాలు చింతనిప్పుల్లా మెరుస్తున్నాయి. అతని చేతుల్లో వున్న హంటర్ నల్లత్రాచులా నిగనిగలాడుతోంది. ఆకలిగొన్న పెద్దపులిలా రమేష్‌కేసి తీక్షణంగా చూస్తున్నాడు.

"మి...స్ట...ర్...ర...మే...ష్!?" పళ్ళు పటపట కొరుకుతూ, "నన్ను ద్రోహం చేసినవారెవ్వరూ యింతవరకు బ్రతికి బట్టకట్టలేదని నీకు తెలుసు. నాకు ద్రోహం చెయ్యడానికి నీకు ఎన్ని వేల గుండెలున్నాయి? ఆశ అంటు రోగం వంటిది. దురాశాపీడితుడైన మానవుడు ప్రాణాలకు తెగించి ఎంతటి సాహసం చేయడానికైనా వెనుదియ్యడు. అలాంటి కోవకు చెందిన మానవుడివి నువ్వు! నెవర్ మైండ్. చేసేదేదో చేశావు. జరిగిందేదో జరిగిపోయింది. నువ్వు దురదృష్టవంతుడివి గనుక మళ్ళీ నా సమక్షానికి రాగలిగావు. చేసింది ద్రోహమని సిగ్గుపడకు! ఇప్పటికైనా నిజాన్ని బయటపెట్టు!"

హృదయం అవమానాగ్నితో భగభగ మండుతున్న రమేష్‌నుండి నిజం గ్రహించడానికి, శాస్త ఓర్పుతో బుజ్జగిస్తున్న ధోరణిలో అడిగాడు బాస్.

"క్షమించండి బాస్! నేను అబద్ధం చెప్పడంలేదు. నన్ను నమ్మండి!"

"నిన్ను నమ్మాను రమేష్! అందుకే నేను స్వయంగా నిర్వహించవలసిన కార్యాన్ని నీకు అప్పగించాను. కాని, నువ్వేం చేశావ్?..."

"మీరు చెప్పిన విధంగా నాగేశ్వర్‌లా నటించాను.

రాజా నరేంద్రసింహను హత్యచేసి రహస్యంగా కాజేసిన వజ్రాలపెట్టెను అపహరించిన, పాములవాడి వేషంలో వున్న భాస్కరరావ్‌ను హత్యచేసి, అయిదుకోట్లు వెల జేసే వజ్రాలపెట్టెను మీకు తెచ్చియిచ్చాను.''

''ఆ పెట్టెలోవున్న వజ్రాలను అపహరించి, అందులో నకిలీ వజ్రాలను వుంచి పెట్టెను తెచ్చి నాకు యిచ్చావు. ఆ నకిలీ వజ్రాలు వెయ్యిరూపాయలుకూడా వెలచెయ్యవు. చెప్పు! ఆ వజ్రాలు ఎక్కడ దాచావు?''

''నా మాట నమ్మండి బాస్. నేనలాంటి మోసం చేసి యుంటే ఈ డబ్బు, నగలకోసం కక్కుర్తిపడి మీ చేతులకు చిక్కియుండేవాడిని కాదు. ఆ వజ్రాలతో నే మాయమైయుండేవాడిని. ఆ వజ్రాలు భాస్కర్‌రావ్‌కు రాజా నరేంద్రసింహ యిచ్చినవే బాస్!''

''షటప్! యూ బ్లడీ సువ్వర్!'' నోటిలోని సిగరెట్‌ను తీసి నేలకేసి విసరికొట్టాడు. అతని చేతిలోని హంటర్ గాలిలో లేచి రమేష్ వీపుమీద నాట్యం చేసింది.

''నీ మాయమాటలకు మోసపోవడానికి నేను పాలు త్రాగే పసివాడిని కాదు. బద్మాష్! నిన్ను ముక్కలు ముక్కలుగా నరుకుతాను. చెప్పు! ఆ వజ్రాలు యెక్కడ దాచావు?''

''ఆ వజ్రాలను రాజా నరేంద్రసింహ యెక్కడ దాచాడు?...ఇలాంటి మోసాలు జరుగవచ్చునని రాజా నరేంద్రసింహ తగిన జాగ్రత్త తీసుకొని వుంటాడు గనుక, ఆ పెట్టెలో నకిలీ వజ్రాలు పెట్టివుంటాడు బాస్. నేను నిజమే చెబుతున్నాను బాస్. నన్ను చిత్రవధ చెయ్యకండి!'' అన్నాడు బాధగా రమేష్.

బాస్, రమేష్ సమాధానాన్ని ఒకసారి అవలోకనం చేసుకొని ఒక నిర్ణయానికి వచ్చాడు. "మిస్టర్ ఆల్ ఫ్రెడ్!"

"ఎస్. బాస్" ఆల్ ఫ్రెడ్ ముందుకు వచ్చాడు.

"ఈ యిడియట్ ని ఐరన్ రూంలో బంధించండి! అక్కడ బంధించివున్న నాగేశ్వర్ ను యిక్కడికి తీసుకు రండి!" అని ఆజ్ఞాపించాడు.

నలుగురు కలిసి రమేష్ను ప్రక్కగదిలోకి తీసుకువెళ్ళి బంధించారు.

నాగేశ్వర్ ను తీసుకొచ్చి బాస్ ముందు ప్రవేశపెట్టారు.

నాగేశ్వర్ ను చూసేసరికి మిస్. కామిని ఆశ్చర్యాన్వితురాలైంది. రమేష్, నాగేశ్వర్ లా ఎందుకు నాటక మాడాడు ఆమెకు ఇప్పుడు అర్థమైంది. రమేష్ నాగేశ్వర్ లా నాటకమాడుతున్నాడంటే, అతను నాగేశ్వర్ ను హాత్యచేసి వుండొచ్చనుకుంది. రాజా నరేంద్రసింహ ఎందుకు హాత్య కాబడ్డాడో, అతన్ని ఎవరు హాత్యచేశారో తెలుసుకున్న కామిని, నాగేశ్వర్ కు సహాయంచేసి ప్రియురాలుగా తన ధర్మం నెరవేర్చుకోవాలనుకుంది.

నాగేశ్వర్ అక్కడే రివాల్వర్ చేతబట్టి నిలుచున్న కామినిని చూసి విస్తుపోయాడు. ఆ కుట్రలో కామిని కూడా కలిసియుందని అపార్థం చేసుకున్న నాగేశ్వర్ హృదయం మండిపోయింది. కోపోద్రేకాలతో తీక్షణంగా చూస్తూ, "కామినీ! నీ నిజరూపు యిదన్నమాట! నీ వలపంతా బూటకమని యింతవరకు తెలుసుకోలేకపోయాను. రాక్షసీ! ఎంత వంచన! ఛూత్!" అని ఉమ్మేశాడు.

అతను నిజం గ్రహించలేక అపార్థం చేసుకుంటున్నా

డని కామిని ఎంతో బాధపడింది. అతని పరిస్థితి ఆమె మనసులోని ప్రేమను కరిగించి కన్నీళ్ళను తెచ్చిపెట్టింది. ఆ వజ్రాలతో తనకు సంబంధంలేదని ఇప్పుడు చెబితే బాస్ అపార్థం చేసుకోవచ్చు. కనుక బాస్‌కు తెలియకుండా అతని ప్రాణాలు రక్షించాలి అని నిర్ధారించుకున్న కామిని కళ్ళనుండి జారుతున్న కన్నీళ్ళను జాగ్రత్తగా తుడుచుకుంది.

"మిస్టర్ నాగేశ్వర్! మీ మామయ్యవద్దనున్న వజ్రాలను అపహరించడానికి నీ స్థానంలో రమేష్‌ను వుంచాను. ఎవరికీ అనుమానం వెయ్యకుండా సులభంగా ఆ కార్యం సాధించాలని నిన్ను రహస్యంగా బంధించి వుంచాను. కాని, అనుకున్నదొకటి, జరిగిందొకటి! రమేష్ తెచ్చిన వజ్రాలు అసలైన వజ్రాలు కాదు. నకిలీ వజ్రాలు. ఆ వజ్రాల రహస్యం నీ మామయ్య నీతో చెప్పివుంటాడు. చెప్పు! అసలైన వజ్రాలు ఎక్కడున్నాయి?"

"అసలు మామయ్యవద్ద వజ్రాలున్న విషయమే నాకు తెలియదు. ఇక అసలు వజ్రాలు ఎక్కడున్నాయని అడిగితే నేనేం చెప్పేది?"

"నో...నీవు అబద్ధం చెబుతున్నావు. రాజా నరేంద్ర సింహ నకిలీ వజ్రాలను తనదగ్గర వుంచుకున్నాడంటే అసలు వజ్రాలను ఎక్కడైనా దాచివుంటాడు. ష్యూర్. సందేహంలేదు. ఆ రహస్యం మీ యింట్లో ఏ ఒక్కరికీ తెలియకుండా వుంటుందంటే నేను కాదు కదా, ఎవ్వరూ నమ్మే విషయం కాదు. అతనికి కొడుకులు లేరు. రాధిక ఒక్కతే కూతురు! ఆ రాధిక భర్తవు నువ్వు! కొడుకువైనా, అల్లుడివైనా నువ్వే అతనికి. ఏ కారణంవల్లా,

ఎన్నడూ అతను మరణించినా ఆ వజ్రాల రహస్యం అతని తోనే సమాధి కట్టుకుపోతుందని అతనికి తెలుసు. కనుక, ఆ సంపదకు సంబంధించిన రహస్యాలు తప్పకుండా చెప్పి వుంటాడు. ఇంతవరకు నిన్ను బంధించి గౌరవంగానే చూసుకున్నాము. నిజం బయట వెయ్యకపోతే ఏం జరుగు తుందో తెలుసా?"

"వజ్రాల విషయం మీరు చెప్పేవరకు మామయ్యవద్ద వజ్రాలున్నాయనే సంగతి నాకు తెలియదంటే నమ్మండి. మామయ్యవద్ద వజ్రాలున్నాయన్న విషయం నిజమైతే వాటిని ఎక్కడ దాచాడో మామయ్యకే తెలిసివుంటుంది. అసలు అయిదుకోట్లు విలువచేసే వజ్రాలు మామయ్యకు ఎక్కడివి?"

"షటప్! యూ స్కౌండ్రల్! ఏమీ తెలియని అమా యకుడిలా నటించకు! 12 సంవత్సరాల క్రితం మీ మామయ్య నంద్యాలలో వున్నప్పుడు తోళ్ళ వ్యాపారం చేసేవాడు. మీ మామయ్య మంచి వేటగాడు. వేటకోసం అప్పుడప్పుడు నల్లమల అడవులకు వెళ్ళేవాడు. నల్లమల అడవుల్లో యున్న దూలాలకుంటలో పుల్లయ్య అనే ఒక పాములవాడు నివాస ముంటున్నాడు. భార్య పోయిన మీ మామయ్య పాముల పుల్లయ్య కూతురు కస్తూరిని ప్రేమించాడు.

ఒకనాడు పాముల పుల్లయ్య పాములు పట్టడానికి అడవిలోకి వెళ్ళాడు. ఒక చెట్టుక్రిందనున్న పాముపుట్టను త్రవ్వాడు. పూర్తిగా పుట్టను త్రవ్వినా పాము కనిపించ లేదు. ఒక పెద్దరాయి కనిపించింది. పుట్టక్రింద పెద్దరాయి కనిపించడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. వెంటనే

రాయిని తొలగించాడు. ఆ రాయి క్రింద ఒక చిన్న పెట్టె దొరికింది. తెరిచి చూశాడు. ఆ పెట్టెనిండా వజ్రాలు వున్నాయి. పాముల పుల్లయ్య ఆశ్చర్యానికి అంతులేదు.

ఆ వజ్రాల పెట్టె అక్కడ యెలా దొరికిందో తెలుసా? పూర్వం గజదొంగలకు స్థావరం నల్లమల అడవులు. ఒక నాడు ఒక విదేశ విమానం కూలిపోయింది అడవుల్లో. ఎందరో చచ్చారు. కొందరు గాయపడ్డారు. ఆ సమయం ఆ గజదొంగలు కూలిపోయిన విమానాన్ని పరిశోధించారు. ఆ వజ్రాలపెట్టె వారికి విమానంవద్ద దొరికింది. వాళ్ళు, ఆ పెట్టెను తీసుకొని భూమిలో గుంట త్రవ్వి పాతిపెట్టారు. గుర్తుకోసం దానిమీద రాయిని ఉంచి వెళ్ళారు.

కూలిపోయిన విమానం వద్ద పదిహేను రోజుల వరకు పోలీసులు గస్తీ ఉన్నారు. వాళ్ళు పేరు గాంచిన గజ దొంగలు గనుక పోలీసుల కంటబడకుండా ఆ పదిహేను రోజులు మరోచోట తలదాచుకున్నారు. ఒకనాడు తుఫాను లాంటి గాలివాన వచ్చింది. ఆ గాలి ఉధృతానికి చెట్లు ఒరిగిపోయాయి. వర్షం నీళ్లు ప్రవహించి అది పల్లపు ప్రాంతం కావడం వల్ల మట్టి మేట వేసింది.

పోలీసులు అడవి వదిలిపోయిం తరువాత గజదొంగలు వజ్రాల పెట్టెకోసం వెతికారు. ఆ భయంకరమైన అడవిలో దారి తప్పి ఆ గుర్తును కనుక్కోలేకపోయారు. పైగా మట్టి మేటవేయడం వల్ల రాయి కనిపించలేదు. మన భారతదేశానికి స్వాతంత్ర్యం రాకపూర్వం జరిగిన విషయం.

అదృష్టం కొద్ది ఆ వజ్రాల పెట్టె పాముల పుల్లయ్యకు దొరికింది. బాల్యం నుండి అతను దూలాలకుంటలోనే

నివాసముంటున్నాడు గనుక ఆ వజ్రాల చరిత్ర అతనికి జ్ఞాపకముంది. పుల్లయ్యా ఆనందానికి అంతులేదు. ఆ వజ్రాల పెట్టెను తీసుకుని పాముల బుట్టలో పెట్టుకొని యింటికి వచ్చాడు. ఆ విషయం కూతురు కస్తూరితో చెప్పాడు. ఆ వజ్రాల విలువ అన్నీ కలిసి రెండు లక్షలు కావచ్చని అతని అంచనా.

అసలు ఒక వజ్రాన్ని తీసుకొని నంద్యాలలో ఒక సేఠ్‌కు అమ్మాడు. యాభై లక్షలు ఖరీదు చేసే ఆ వజ్రానికి వెయ్యి రూపాయలు ఇచ్చాడు సేఠ్. ఆ వెయ్యి రూపాయలకే సంతోషంతో పొంగిపోయిన పాముల పుల్లయ్యా-కూతురికి క్రొత్త బట్టలు-కొన్ని బంగారు నగలు తీసుకొని యింటికి వెళ్ళాడు. అతను ఎక్కడికైనా ఊరికి వెళితే, తిరిగొచ్చేసరికి కస్తూరి చిరునవ్వుతో ఎదురు పడేది. కాని, ఆ రోజు కస్తూరి శవం-తండ్రికి స్వాగత మిచ్చింది.

కస్తూరి హత్య చేయబడింది గన్‌తో. కల్లా కపట మెరుగని అమాయకురాలు కస్తూరి-ప్రియుడైన మీ మామయ్యకు ప్రేమవాహినిలో కొట్టుకుపోయి ఆ ఆనందంలో వజ్రాల పెట్టె చూపించింది. అతని కళ్ళు కుట్టాయి. ఆ వజ్రాలు తన సొంతం చేసుకోదలచి మనసిచ్చిన మగువ కస్తూరిని షూట్ చేసి వజ్రాల పెట్టెతో పరారీ అయ్యాడు.

పరిస్థితిని అర్థం చేసుకున్న పాముల పుల్లయ్యా హృదయం పగిలి కన్నీటి రూపమై బయటపడింది దుఃఖం. ఒక్కగా నొక్క కూతురు కస్తూరి మీద అతనికి పంచ ప్రాణాలు. అంతటి దారుణం యెవరు చేశారో కూతురిపైన గాయాలను బట్టి అర్థంచేసుకున్న పాముల పుల్లయ్యా మీ మామయ్య రక్తం త్రాగాలని నంద్యాలకు వెళ్ళాడు. అప్పటికే మీ మామయ్యా ఊరు విడిచి-మద్రాసుకు చేరుకున్నాడు.

నాగేశ్వర్!_ఈ చరిత్రంతా నాకెలా తెలుసునని అడుగుతావేమో!_12 సంవత్సరాల తర్వాత మీ మామయ్య ఉనికి పాముల పుల్లయ్యకి పత్రికల ద్వారా తెలిసింది. పాముల పుల్లయ్యకు భాస్కరరావ్ తెలుసు. భాస్కర రావ్‌కు చరిత్రంతా చెప్పి తనకు సహాయం చేస్తే అందులో రెండు వజ్రాలు యిస్తానన్నాడు.

భాస్కరరావ్, పాముల పుల్లయ్యకు తెలియకుండా రాజా నరేంద్ర సింహ వద్ద నున్న వజ్రాలను దక్కించు కొని కుబేరుడు కావాలని కలలు కన్నాడు. పాముల పుల్లయ్యను హత్య చేసి భాస్కరరావ్ నా కంటబడ్డాడు. పోలీసులకు చెప్పకుంటే నాకు రహస్యం చెబుతానన్నాడు. అతనికి అభయమిచ్చాను. వజ్రాల రహస్యం బయట పెట్టాడు భాస్కరరావ్. అంతే, పాముల పుల్లయ్య శవాన్ని అడ్రసు తెలీకుండా చేశాను.

"పాముల పుల్లయ్యను చూస్తే రాజా నరేంద్ర సింహ గుండెలు పగులుతాయి. మరెవరైనా వెళితే వజ్రాల రహస్యం బయట పెట్టడని తెలుసు. కనుక, భాస్కర రావ్‌ను పాముల పుల్లయ్యగా వేషం వేయించి_ఒక పాముల వాని ద్వారా నాగుపామును తెప్పించి ఆ పని భాస్కరరావ్‌కు అప్పగించాను. ఆ సాయంత్రంకు నిన్ను బంధించాను. పుల్లయ్యనే చంపిన భాస్కరరావ్ నన్ను మోసం చేయడని నమ్మకం ఏమిటి? అందుకే వజ్రాలు అతని చేతికి రాగానే అక్కడే అతన్ని అంతం చేయమని రమేష్‌ను_నీ రూపంలో పంపించాను.

వేసుకున్న ప్లాన్ సక్సెస్ అయింది. కాని, మీ మామయ్య చేసిన మోసమో_లేక రమేష్ చేసిన మోసమో_

నా చేతికి నకిలీ వజ్రాలు వచ్చాయి. నాగేశ్వర్!_ఆ వజ్రాల రహస్యం తప్పకుండా నీకు తెలిసియుంటుంది. అవి ఎక్కడున్నాయో చెప్పి ప్రాణాలు రక్షించుకో!"

"మిమ్మల్నెలా నమ్మించాలో నా కర్థం కావడం లేదు. వజ్రాల సంగతి నాకేమీ తెలియదు."

బాస్ చేతిలోని హంటర్ అతని ముఖంపై ఆడింది. గడ్డం చిట్లి రక్తం వచ్చింది.

బాస్ నిర్దాక్షిణ్యంగా చంపేస్తాడేమోనని కామిని మనసు విలవిల్లాడింది. వెంటనే కామిని ముందుకు వచ్చి, "ఆగండి బాస్! మీరు అతన్ని చిత్రవధ చేసి చంపినా నిజం చెప్పడు. నాగేశ్వర్ వజ్రాల రహస్యం బయట పెట్టాలంటే నేను చెప్పినట్లు చెయ్యండి బాస్" అంది కోపాన్ని నటిస్తూ.

హంటర్ చేతిలో పట్టుకొనే "మిస్ కామినీ! ఏం చేయాలో త్వరగా చెప్పు!" అని కామినివైపు తిరిగి అడిగాడు బాస్.

# 10

కామిని నాగేశ్వర్‌కేసి తీక్షణంగా చూసింది.

"కామినీ! నీవు గోముఖ వ్యాఘ్రానివి! తేనెపూసిన కత్తివి! నన్ను ప్రేమించి, నీతోనే నాకు లోకమని నమ్మించి, చివరికి యింతకు తెగిస్తావా? కృతఘ్నురాలా! వంచకీ! నీ ముఖం నాకు చూపించకు. సిగ్గులేదూ?"

కామిని వికటంగా నవ్వింది.

"నువ్విలాగే మొండికేశావంటే నీ ముఖమే ప్రపంచానికి కనబడకుండా పోతుంది."

"ఏం? చంపేస్తావా వగలాడీ?"

"నిన్నింత సులభంగా చంపను మిస్టర్. నీ భార్యను క్షణాలమీద తెప్పించి నీ ముందుంచుతాను. నీ కళ్ళ ఎదురుగా, యమభటుల్లా నిలుచునున్న బాస్ మనుషులు రాధికను అనుభవించి ఆనందిస్తారు. వివస్త్రను చేసి ఆమె శరీరాన్ని ఒక్కొక్క కండగా కోసి నీ పాదాలముందు పడవేస్తారు. నువ్వు ఆ భయంకర దృశ్యం చూడలేక..." అని చెబుతుంటే, కామిని మాటలు పూర్తి కాకముందే—

"కా...మి...నీ! రాక్షసీ! నీవు ఆడదానివి కాదూ? నీకు హృదయం లేదూ?" అని అరిచాడు.

కామిని ఒక్క పరుగులో నాగేశ్వర్ ముందు నిలిచింది. "షటప్!" అంటూ చెంపపై ఈడ్చి కొట్టింది.

తోకత్రొక్కిన భుజంగంలా తీక్షణంగా కామినికేసి చూశాడు.

కామినికూడా క్రోధపూరితంగా అతని కళ్ళల్లో కళ్ళు పెట్టి చూసింది. బాస్‌గాని, అతని అనుచరులుగాని తనను గమనించని విధంగా, నాగేశ్వర్‌కు కనుసైగ చేసింది. ఆ సైగతోబాటు రెండు కన్నీటి చుక్కలు జారి పయిటపై బడ్డాయి.

"నాగేశ్వర్! చెప్పు! ఆ వజ్రాలు ఎక్కడున్నాయి?"
"నాకు తెలియదు."

"దట్స్ ఆల్ రైట్!" అని బాస్ ముందుకు వెళ్ళి, "బాస్! ఈ మూర్ఖుడు దారికి రావాలంటే రాధికను యిక్కడికి తీసుకురావాలి. నేను చెప్పినట్లు చేస్తేగాని నాగేశ్వర్ నిజం బయటపెట్టడు" అంది కామిని.

"వండర్‌ఫుల్ ఐడియా. కామినీ! యువార్ ఏ గ్రేట్

గర్ల్! మంచి ప్లాన్ వేశావ్! క్షణాల్లో రాధికను తెప్పి స్తాను. మిస్టర్ ఆల్ ఫ్రెడ్!"

"ఎస్. బాస్" ఆల్ ఫ్రెడ్ ముందుకు వచ్చాడు.

"మిస్. కామిని చెప్పిన మాటలు విన్నావ్ కదూ? వెంటనే వెళ్ళి రాధికను జాగ్రత్తగా తీసుకురండి! పోలీసుల కంట బడితే మీ ప్రాణాలు తీస్తాను."

"అలాగే బాస్" అని ఆల్ ఫ్రెడ్, రివాల్వర్ జేబులో వేసుకొని, యింకా ముగ్గుర్ని పిలుచుకొని బయటికి వెళ్ళి పోయాడు.

"ఆగండి!" అని అరిచాడు నాగేశ్వర్.

నలుగురు చప్పున ఆగిపోయారు. అర్థంగాక బాస్ ముఖంలోకి చూశారు.

బాస్ ఆశగా నాగేశ్వర్ ముఖంకేసి చూశాడు.

"చెబుతాను. నా భార్య జోలికి పోకండి!"

బాస్ ముఖం సంతోషంతో వికసించింది.

నాగేశ్వర్ రెండు భుజాలు పట్టుకొని, సంతోషంతో ప్రేమపూర్వకంగా ఊపాడు. "మై డియర్ నాగేశ్వర్! త్వరగా చెప్పు! మీ మామయ్య ఆ వజ్రాలను ఎక్కడ దాచాడు?"

"ఏ పుట్టలో ఏ పాముంటుందో యెవరూ గ్రహించలేరు. రహస్యం అందరికీ తెలిస్తే మీరు మోసపోయే అవకాశముంది. కామిని తప్ప..."

"గుడ్. నీ బుర్ర చాలా గట్టిది. ముందాలోచన లేకనే ముఠాను తయారుచేసి మోసపోతున్నాను. ఒక్క కామిని తప్ప అందరూ దురాశాపరులు, మోసగాళ్ళూను. ఆల్ రైట్!" అని అందరివైపు తిరిగి చూస్తూ, "మీరందరూ

వెళ్ళండి! అవసరమొచ్చినప్పుడు పిలిపిస్తాను. యు ఆల్ కెన్ గో!'' అన్నాడు.

అందరూ వెళ్ళిపోయారు.

''కమాన్ ప్రొసీడ్ మై డియర్'' అన్నాడు.

''రహస్యం బయటవేశాక నా ప్రాణాలు తీయరని గ్యారంటీ ఏమిటి?''

''రహస్యం బయట వేస్తే నీ ప్రాణాలు తీయను. వజ్రాలు చేతికి రాకుంటే నువ్వనుకున్నంతా జరుగుతుంది.''

''సరే, అదృష్టంలో యెలా రాసివుంటే అలా జరుగుతుంది. అదృష్టవంతుల్ని చెడగొట్టేవారు, దురదృష్టవంతుల్ని బాగుచేసేవారెవ్వరూ లేరు. బాస్! మా మామయ్యా పడుకునే పందిరిమంచం క్రింద నున్న కార్పెట్ తొలగిస్తే గచ్చునేల కనిపిస్తుంది. ఆ గచ్చునేలమీద చదరంగా నాలుగు నల్లని చుక్కలు కనిపిస్తాయి. ఆ నాలుగు చుక్కలు నిజంగా రంగుతో పూసిన చుక్కలు కావు. అలాంటి చుక్కలు కార్పెట్ క్రింద గదినిండా వుంటాయి. ఎవ్వరూ కనుక్కోలేరు.

కాని, మంచం క్రిందనున్న ఆ నాలుగు చుక్కలు పరిమాణంలో మిగతా చుక్కలకంటే పాతికభాగం పెద్దగా వుంటాయి. ఆ చుక్కలు మైనంతో పూరింపబడి వుంటాయి. సిగర్ లైటర్‌తో వేడిచేస్తే మైనం కరిగి వ్రేళ్ళు దూరే సందులు ఏర్పడతాయి. సందుల్లో వ్రేళ్ళు జొనిపి బలంగా పైకి లాగితే అవలీలగా చెక్క ఊడి పైకి వస్తుంది. అక్కడే అసలైన వజ్రాలపెట్టె వుంటుందని మామయ్యా చెప్పాడు. రాధిక యింట్లోలేని సమయం ఒక రోజు మామయ్యా చూపించాడు వజ్రాలను. అందులో

తొమ్మిది వజ్రాలున్నాయి. ఒక్కొక్క వజ్రం యాభై లక్షలు ఖరీదు చేస్తుంది" అన్నాడు నాగేశ్వర్.

బాస్ నమ్మాడు.

అదంతా అబద్ధమని కామినికి తెలుసు.

# 11

"నన్ను క్షమించు డియర్ నాగేశ్వర్! బాస్ నన్ను అపార్థం చేసుకుంటాడని అతని ఎదురుగా అలా మాట్లాడి నీ మనసును గాయపరిచాను. ప్లీజ్? ఎక్స్‌క్యూజ్ మీ" అని కన్నీళ్ళు పెట్టుకొని నాగేశ్వర్ చేతులు పట్టుకొని క్షమాభిక్ష కోరింది కామిని.

"కామినీ! నీ నాటకం నాకేమీ అర్థం కావడంలేదు."

"నాటకం కాదు. నీ కోసం నా ప్రాణాలిస్తాను డియర్."

"ప్రాణాలిచ్చేదానివి ఆ దొంగలతో ఎందుకు చేతులు కలిపావు? ఆ వజ్రాల విషయం అసలు నాకేమీ తెలియదు. నువ్వు కన్ను గీటినందుకు, కల్పించి ఏదో కథ చెప్పాను. అతనికి అక్కడ వజ్రాలు దొరకవు. తిరిగొచ్చి నా ప్రాణాలు తీస్తాడు."

"నీ ప్రాణాలు రక్షించడానికే వజ్రాల గురించి నీకు తెలిసినట్లు చెప్పమని సైగచేశాను. అతను ప్రాణాలు రక్షించుకోవడంకోసం నిజం చెప్పావని నమ్మాడు. అందు కోసం అతను ఈ రాత్రికి స్వయంగా వెళ్ళి వజ్రాలకోసం వెదుకుతాడు. నన్నుకూడా తనవెంట రమ్మన్నాడు. అతని వెంట నేనూ అక్కడికి వస్తాను. నాగేశ్వర్! మిస్టర్ ఆల్‌ఫ్రెడ్ నీకు యిప్పుడు భోజనం తెస్తాడు. ఎత్తుకు పై ఎత్తు వేయాలి."

"ఏమిటి?"

"ఆల్‌ఫ్రెడ్‌ను బంధించి స్పృహ తప్పిస్తాను. నిన్ను అద్భుతంగా మేకప్ చేసి ఆల్‌ఫ్రెడ్‌లా తీర్చిదిద్దుతాను. నువ్వు నిర్భయంగా బయటికి వెళ్ళిపోవచ్చు. వెంటనే రహస్యంగా ఇన్‌స్పెక్టర్ మనోహర్‌గారిని కల్సుకొని, రహస్యంగా బంగళా చుట్టూ పోలీసు బందోబస్తు చేయమని చెప్పు! అతనికి కుడిభుజంలాంటివాడు ఆల్‌ఫ్రెడ్. కనుక, అతనికి ఆల్‌ఫ్రెడ్‌తో ఎంతయినా అవుసరముంటుంది. నువ్వు వెంటనే తిరిగొచ్చి క్లబ్‌లో వుండాలి. లేకుంటే అతనికి అనుమానం రావచ్చు. ఆల్‌ఫ్రెడ్ లేకుండా సామాన్యంగా అతను ఎక్కడికీ బయలుదేరడు. అతను ప్రోగ్రాం మార్చుకుంటే గుట్టు బయటపడుతుంది. అతడితో మెలగడం కత్తిమీద 'సాముచేసినట్లే అవుతుంది."

"ఆల్‌రైట్ డియర్. నీ సహాయం నే నెన్నటికీ మర్చిపోలేను."

ఆమె అందమైన చెక్కిలిమీద ముద్దు పెట్టుకున్నాడు నాగేశ్వర్.

రమేష్ చేసిన మోసం జ్ఞాపకమొచ్చేసరికి ఆమె నేత్రాలు సజలపూరితాలయ్యాయి.

# 12

"ఆల్‌ఫ్రెడ్!" బాస్ వేషం మార్చుకుంటూ పిలిచాడు.

"ఎస్ బాస్!" అన్నాడు ఆల్‌ఫ్రెడ్ ముందుకు వస్తూ.

"చెప్పిన పని చేశావా?"

"సుభాస్ చంద్రబోస్ రోడ్‌లో, 76 నెంబర్ ఇంట్లో

హత్య జరిగింది. వెంటనే ఇన్‌స్పెక్టర్ మనోహర్‌ను రమ్మని ఫోన్ చేశాను. ఇన్‌స్పెక్టర్ మనోహర్ 'ఇప్పుడు బయలుదేరుతున్నాను, మీ రెవరు?' అని అడిగాడు. ఇక్కడికి వస్తే అన్ని వివరాలు తెలుస్తాయి అని చెప్పాను. బాస్! మనోహర్ నిజంగా అక్కడ హత్య జరిగియుంటుందని తన బృందంతో బయలుదేరి వుంటాడు. రాధిక మంచి నిద్రలో వుంటుంది. మనకు యిదే మంచి ఛాన్స్" అన్నాడు ఆల్‌ఫ్రెడ్ వేషంలో యున్న నాగేశ్వర్.

"మన మిగతా అనుచరులంతా ఎక్కడున్నారు?"

"డాన్సింగ్ హాల్లో."

"కామిని డాన్సింగ్ ప్రోగ్రాం యిస్తూంది. కామినిని కూడా తీసుకువెళ్ళాలనుకున్నాను. అడది. మనవెంట వద్దు. నా ది టైం ఈజ్ 11-35. కమాన్ ఆల్‌ఫ్రెడ్! మనం వజ్రాలు దొంగిలించినట్లు మనవారికి యెవ్వరికీ తెలియకూడదు. వజ్రాలు చేతికి చిక్కాంతరువాత నాగేశ్వర్‌ను, రమేష్‌ను ఈ లోకంనుండి దూరం చెయ్యాలి."

"అలాగే బాస్. ఆ పని నా కొదిలెయ్యండి. ఇద్దర్నీ సఫాచేసి శవాలు నామరూపాల్లేకుండా చేస్తాను."

"గుడ్! త్వరగా బయలుదేరు. రివాల్వర్, గేస్ బాంబ్స్ తీసుకున్నావ్ కదా?"

"రెడీగా వున్నాయి బాస్."

కారు రాజా నరేంద్ర సింహా బంగళాకు కొద్ది దూరంలో ఆగింది.

బాస్, ఆల్‌ఫ్రెడ్ వేషంలో నున్న నాగేశ్వర్ కారు దిగారు.

బంగళాకు ఒక మూలగా వెళ్ళి కాంపౌండ్ వాల్ దూకి లోపలికి ప్రవేశించారు.

"బాస్!_మీరు ఈ మొక్కల చాటున నిలబడండి. నేను బంగళాలో వెళ్ళి రాధిక మేల్కొని వుంటే స్పృహ తప్పిస్తాను. బాల్కనీ మీదికొచ్చి చెయ్యి వూపుతాను. వెంటనే పైకి రండి బాస్!"

"అలాగే చెయి. క్విక్!"

నాగేశ్వర్ మేడలో ప్రవేశించాడు.

బాస్ బాల్కనీ వైపు చూస్తూ నిలుచున్నాడు.

అయిదు నిమిషాల తర్వాత—

నాగేశ్వర్ బాల్కనీమీదికొచ్చి చెయ్యి ఊపాడు. బాస్ గబగబా లోపలికి వెళ్ళి మేడమెట్లెక్కి రాజా నరేంద్ర పడగ్గది చేరాడు. నాగేశ్వర్ అతనికి వీపు చేసి కిటికీలోంచి బయటికి చూస్తున్నట్లు నిలుచున్నాడు.

"మిస్టర్ ఆల్ఫ్రెడ్! నువ్వక్కడేం చేస్తున్నావు? ఈ పందిరి మంచం క్రింద వజ్రాలున్నాయి. దీన్ని అవతలికి పట్టు! క్షణాల్లోనే పని జరిగిపోవాలి." అన్నాడు.

"క్షణాల్లోనే పని జరుగుతుంది. తొందరపడకండి. పని పూర్తి అయ్యాక మీరు నాకేం యివ్వదలచారు?"

ఆశ్చర్యంగా చూశాడు బాస్. ఏదో ఆలోచించి తల పంకించాడు.

"వాటా గురించా అడుగుతున్నావ్?"

"ఎస్ ఫిఫ్టీ-ఫిఫ్టీ!"

"నన్ను వాటా అడిగే ధైర్యం నీ కెక్కడిదిరా ఫూల్?"

"నువ్వే ధైర్యంతో వజ్రాలు కాజేయాలని పథకం వేసి ఇక్కడికి వచ్చావో-అదే ధైర్యంతో అడుగుతున్నానురా యిడియట్!_"

అతని ఒళ్ళు మండిపోయింది.

"ఆల్ ఫ్రెండ్ !?__"

"నో... మై సెల్ఫ్ ఈజ్..." అంటూ గిరుక్కున ముందుకు తిరిగాడు నాగేశ్వర్.

అతని తలపై ఉరుములేని పిడుగు పడినట్లయింది.

"నా... గే... శ్వ... ర్!?...నువ్వా?" రివాల్వర్ తీశాడు బాస్.

"మిస్టర్ రామ్మూర్తి! మర్యాదగా రివాల్వర్‌ను క్రింద పడేసి చేతులు పైకెత్తు!"

వెనుక నుండి ఇన్‌స్పెక్టర్ మనోహర్ గర్జించాడు.

నలుగురు కానిస్టేబుల్స్ బిలబిల మంటూ లోపలికి ప్రవేశించారు.

"మిస్టర్ రామ్మూర్తి! 12 సంవత్సరాల క్రితం జరిగిన సంఘటన భాస్కరరావ్ ద్వారా తెలుసుకొని అతన్ని నీ సెక్రటరిగా నియమించుకున్నావ్. పాముల పుల్లయ్యను హత్య చేసిన భాస్కరరావ్‌కు పాముల పుల్లయ్య వేషం వేయించి రాజా నరేంద్రసింహను హత్య చేయించావ్.

నాగేశ్వర్‌లా నటించిన రమేష్-రాజా నరేంద్ర సింహ నుండి పొందిన అసలు వజ్రాలను దాచి నీకు నకిలీ వజ్రాలను యిచ్చాడు. రహస్యం బయటపడుతుందని భావించిన రమేష్ అసలు వజ్రాలతో మాయమై యుంటే ఎవరికీ దొరికేవాడు కాదు. కాని, అతనికి ఆశ తీరలేదు. డబ్బు-నగలు దోచుకొని మరింత సంపదను పోగుచేయాలనే దురాశతో మళ్ళీ యిక్కడికి వచ్చాడు.

కామిని నాగేశ్వర్‌ను ప్రేమించింది. అతను నాగేశ్వర్ కాదని రమేష్ అని యెలాగో కనిపెట్టింది. అంత వరకు

నీ ముఠా మనుష్యులతో ఆమెకు సంబంధం లేదు. కాని, రమేష్ తనకు తీరని ద్రోహం చేశాడని అతనిమీద ప్రతీకారం తీర్చుకుంటానని నీతో చెప్పింది. అసలు తన ప్రియుడు నాగేశ్వర్ ఏమయ్యాడో రమేష్‌ను అడిగితే గాని తెలియదు. కనుక, ఆ రాత్రి నుండి రమేష్‌ను అతని కోసం పగలంతా అన్వేషించింది.

రమేష్ హోటల్ 'దిల్ బహార్' నుండి బయట పడడం చూసి అతన్ని వెంబడించింది. అతను నేరుగా యిక్కడికి వచ్చాడు. అతను తిరిగి కారులో వెళ్ళిపోతాడని కామినికి తెలుసు. కనుక, అతను వచ్చేలోగా కారులో దాక్కుంది. ఆమె లేకుంటే నీ అనుచరులకు చిక్కేవాడు కాదు రమేష్.

నాగేశ్వర్ బ్రతికి మీ నిర్బంధంలో ఉండడం చూసిన కామిని ఆశ్చర్య పడింది. అతన్ని రక్షించడం ప్రియురాలుగా తన కర్తవ్యంగా భావించి నీ వద్ద నీకు అనుకూలంగా వున్నట్లే అనుమానం వెయ్యకుండా అద్భుతంగా నటించింది. నీ కుడిభుజమైన ఆల్‌ఫ్రెడ్‌ను బంధించి నాగేశ్వర్‌ను ఆల్‌ఫ్రెడ్‌గా మార్చి రహస్యంగా నా వద్దకు పంపించింది. రమేష్‌కు చావు దెబ్బలు కొట్టి అతనితో నిజం చెప్పించి_అతను ఆ వజ్రాలు ఎక్కడ దాచాడో ఆ స్థలం గురించిన వివరాలు ఆల్‌ఫ్రెడ్‌తో చెప్పి పంపింది.

ముందు మేము అసలు వజ్రాలను స్వాధీనం చేసుకున్నాం. నీకంటే ముందు బంగళాకు వచ్చి రహస్యంగా దాగుకున్నాము. అక్కడ, సబ్‌యిన్‌స్పెక్టర్ సుధీర్ నీ అనుచరుల్నందరిని బంధించి ఉంటాడు. నీ అధికారం, అహం,

గర్వం-అంతా అణచివేసి నిన్ను పట్టుకోనేందుకు ఎంతో సహకరించింది మిస్. కామిని! మిస్. కామిని అభినంద నీయురాలు!" అంటూ ఇన్ స్పెక్టర్ మనోహర్, రామ్మూర్తి చేతులందుకొని బేడీలు వేశాడు.

సజీవంగా తిరిగి వచ్చిన భర్త నాగేశ్వర్ హృదయంపై వాలిపోయింది రాధిక!

అప్పుడే అక్కడికి వచ్చిన మిస్. కామిని ఆ ప్రణయ దృశ్యం చూసి, ఆనందబాష్పాలు విడిచి వెను తిరిగింది.

—: ఐ పో యిం ది :—

# ముప్పది ముగ్గురు బానిసలు!

## ఎల్. రామగోపాల్

అండమాన్ దీవులలోని 'అంగోలా' ప్రాంతం అది.

పోర్ట్ బ్లెయర్ కు ఏడువందల నలభై కిలోమీటర్ల దూరంలో వున్న అంగోలా ప్రాంతం, ఉదయం పదిగంట లకే ఎండ నిప్పులు చెరుగుతూ వుంటుంది.

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది.

ఎక్కడో గంట మ్రోగింది.

అప్పటివరకు అక్కడ పనిచేస్తున్న బానిసలు ఒక్క సారిగా తమ చేతుల్లోవున్న వస్తువులు క్రింద పడేసి, దూరంగా కన్పిస్తున్న భవనంవైపు వడివడిగా నడవ సాగారు.

గొర్రెమందలా పరుగెడుతున్న వాళ్ళవైపు చూచి,

చిన్నగా నిట్టూర్చి లేచి నిలబడ్డాడు విక్రమ్.

విక్రమ్‌కు ముప్పై ఏళ్ళుంటాయి. మండుటెండకు వాడి పోయినా, ఎర్రటి శరీరచ్ఛాయ కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. దుబ్బుగా పెరిగి తైలసంస్కారం లేని జుట్టు, ఏపుగా పెరిగిన గడ్డం, గుంటకళ్ళు, సన్నటి ముక్కు, విశాలమైన నుదురు. చూడడానికి కాస్త అందంగానే కన్పిస్తాడు.

విక్రమ్ భోజనాలగదిలోకి వచ్చేసరికి అందరూ గదిలో వున్న బల్లలు ఆక్రమించి, ఆవురావురుమంటూ చపాతీలు తింటున్నారు. విక్రమ్ మూలగావున్న బల్లదగ్గరకు వెళ్ళి తన ఎదురుగావున్న ప్లేటు అందుకున్నాడు.

ఆరు చపాతీలు వున్నాయి అందులో. పక్కనే ఏదో కూర వుంది. తనిక్కడకు వచ్చిన ఆరు సంవత్సరాలనుంచీ అది ఏం కూరో తెలుసుకోడానికి శతవిధాల ప్రయత్నించి విఫలుడయ్యాడు.

కడుపులో ఆకలి కరకర మంటుంది. అయినా తన ఎదురుగావున్న ఆహారాన్ని తినడానికి మనస్కరించడం లేదు. చేతిలో ప్లేటు అలాగే పట్టుకొని, గదిలో వున్నవా రందరివైపు చూశాడు. వంచిన తల ఎత్తకుండా ఆత్రుతగా తింటున్నారు చపాతీలను.

వాళ్ళ ఆత్రుత చూచి చిన్నగా నవ్వుకున్నాడు విక్రమ్.

వాళ్ళ జీవితంలో మిగిలింది అదొక్కటే!

నిద్రాహారాలు వాళ్ళచేతుల్లో లేవు. ఆశలు, ఆశయాలు అంతకంటె లేవు. బండచాకిరి చెయ్యడం, తిండి దొరికితే తినడం, విశ్రాంతి దొరికితే నిద్రపోవడం.

వాళ్ళ సుఖదుఃఖాలు వాళ్ళ చేతుల్లో లేవు. చెప్పింది చెయ్యడం, పెట్టింది తినడంవరకే వాళ్ళ పని. కేవలం

ప్రాణమున్న బొమ్మలు. జీవచ్ఛవాలు. దుర్మార్గుల అత్యాశకు బలైపోయిన బానిసలు.

"విక్రమ్!"

పిలుపు విన్పించి ఉలిక్కిపడి చూచాడు. ఎదురుగా రజ్వీ.

"తిండి తినకుండా ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అడిగాడు రజ్వీ.

విక్రమ్ చేతిలో ప్లేటు క్రింద పెట్టాడు. "ఏమీ తినాలనిపించలేదు బాబా! మన బ్రతుకుల గురించే ఆలోచిస్తున్నాను" అన్నాడు.

బలహీనంగా నవ్వాడు అరవైఏళ్ళ రజ్వీ.

"చూడు విక్రం! నీ బ్రతుకు నీ చేతిలో లేదు. దాన్ని గురించి ఆలోచిస్తూ ఆకలి చంపుకోకు! నన్ను చూడు! నేనిక్కడకు వచ్చి ముప్పై సంవత్సరాలయింది. ఎన్నో రోజులు తిండి మానుకుని ఆలోచించాను. ఎన్నోసార్లు తప్పించుకోడానికి ప్రయత్నించాను. ప్రయాస, కొరడా దెబ్బలు తప్పితే ఫలితం దొరకలేదు. విసిగి వేసారి, ఆలోచనలు మానుకున్నాను. అర్థం అయిందా! త్వరగా తిను, మళ్ళీ టైం అవుతుంది" అన్నాడు రజ్వీ.

విక్రమ్ లేచి నిలుచున్నాడు. "నాకేమీ తినాలనిపించడంలేదు బాబా! పద వెళదాం!" అన్నాడు బైటకు దారితీస్తూ.

## 2

సాయంత్రం అయిదు గంటలయింది.

అప్పటివరకు కొండరాళ్ళను పగులకొడుతున్న విక్రమ్, ఏదో అరుపు విన్పించి ఉలిక్కిపడి చూచాడు.

దూరంగా ఎవరో వ్యక్తి పడిపోయాడు.

చటుక్కున పరుగెత్తుకు వెళ్ళాడు విక్రమ్.

క్రింద పడిపోయిన వ్యక్తి జైసింగ్! అరవై ఏళ్ళుం టాయి అతనికి. బక్కపల్చని శరీరం. అందరూ గుమిగూడి జైసింగ్ నే చూస్తున్నారు.

"అలా చూస్తారేం! త్వరగా వెళ్ళి ఎవరైనా కాసిని నీళ్ళు తీసుకురండి!" అరిచాడు విక్రమ్ జైసింగ్ తలను ఒడిలోకి తీసుకుంటూ.

ఎవరో వ్యక్తి నీళ్ళకోసం పరుగెత్తాడు.

"ఏమిటి? ఏం జరిగింది? అందరూ ఎందుకిలా నిల బడ్డారు?" అధికారంగా వినిపించింది.

అందరూ తలలు త్రిప్పి వెనక్కి చూచారు. యజమాని రాజేంద్రన్ నిలబడి వున్నాడు. అతని కళ్ళు కోపంతో మండిపోతున్నాయి.

అందరూ భయంతో బిక్కచచ్చి, మాట్లాడకుండా ఎవరి స్థానాల్లోకి వాళ్ళు వెళ్ళారు.

రాజేంద్రన్ విక్రమ్ వైపొకసారి, జైసింగ్ వైపొకసారి చూచి, "రేయ్! ఎవరక్కడ!" బిగ్గరగా అరిచాడు.

కొద్దిదూరంలో తుపాకి పట్టుకుని పహరా కాస్తున్న వ్యక్తి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"జీ సాబ్!" అన్నాడు భయంగా.

"యూ! ఇడియట్! బుద్ధిలేదూ! ఏం చేస్తున్నా వక్కడ? ఇక్కడ చూడు! వాడు పడిపోయాడు! వీడు, వాడిదగ్గర కూర్చున్నాడు. ఇదంతా చూస్తూ కూర్చు న్నావ్?" అరిచాడు రాజేంద్రన్.

"చిత్తం! పొరపాటయిందండి!" అంటూ విక్రమ్ వైపు

చూచి, "ఏయ్! వెళ్ళి నీ పని చూచుకో!" అన్నాడు కోపంగా.

"ఇతను కళ్ళు తిరిగి పడిపోయాడు. ఇలాగే వుంచితే చచ్చిపోతాడు!" అన్నాడు విక్రమ్.

"రాస్కెల్! వాడు బ్రతికితే నీ కెందుకు? చస్తే నీ కెందుకు? వెళ్ళి నీ పని చూచుకో!" ఈడ్చి చెంపమీద కొట్టాడు రాజేంద్రన్.

విక్రమ్ చెంప అదిరిపోయింది. పుట్టి పెరిగింది మొదలు ఇంతవరకూ ఎవ్వరి చేతిలో దెబ్బ తినలేదు. ఈనాడు మొదటిసారిగా, కానిస అయిన నేరానికి ఒక అనామకుడి చేతిలో దెబ్బ తినవలసి వచ్చింది. తనలో పిరికితనం లేదు. పౌరుషం చావలేదు. విక్రమ్ మొహం కోపంతో కంద గడ్డలా మారింది.

ఊహించని వేగంతో ఈడ్చి రాజేంద్రన్ చెంపమీద కొట్టాడు. అనుకోని సంఘటనకు దిమ్మెరపోయాడు రాజేంద్రన్. అంతలోనే అధికారం పెల్లుబికింది.

"యూ! బ్లడీ స్లేవ్! నువ్వు నన్ను కొడతావా? రేయ్! ఎవరక్కడ? వీణ్ణి తీసుకెళ్ళి వెయ్యి కొరడా దెబ్బలు కొట్టండి!" ఆజ్ఞ జారీచేసి చకచక భవనంవైపు నడిచాడు.

అప్పటివరకు వింత చూస్తున్న మిగతా వాళ్ళంతా విక్రమ్‌వైపు దీనంగా చూచారు.

నల్గురు మనుషులు వచ్చి విక్రమ్‌ను ఈడ్చుకు వెళ్ళారు.

## 3

భారంగా కళ్ళు తెరిచి, మళ్ళీ మూసుకున్నాడు విక్రమ్. వొళ్ళంతా పచ్చిపుండులా మంట పుడుతూంది.

నరాలన్నీ కోసినట్లుగా బాధ పుడుతూంది.

"విక్రమ్!" నెమ్మదిగా విన్పించింది.

భారంగా కళ్ళు తెరిచి చూశాడు. గదిలో వెల్గుతున్న గుడ్డిదీపం వెలుతురులో రజ్వీ మొహం ఆతృతగా కన్పించింది.

"ఎలా వుంది?" అడిగాడు రజ్వీ.

విక్రమ్ మాట్లాడలేదు. తిరిగి కళ్ళు మూసుకున్నాడు.

"విక్రమ్! ఇలా చూడు! నీకోసం రొట్టె తెచ్చాను. కొద్దిగా తిను!" ఆప్యాయంగా విన్పించింది రజ్వీ కంఠం.

విక్రమ్‌కు కడుపులో ఆకలి మండిపోతుంది.

కళ్ళు మూసుకునే నోరు తెరిచాడు. రజ్వీ రొట్టె తినిపించి నీళ్ళు త్రాగించాడు.

అర్ధగంట తర్వాత రజ్వీ వెళ్ళిపోయిన చప్పుడు విన్పించి నెమ్మదిగా కళ్ళు తెరిచాడు విక్రమ్.

గదిలో దీపం గ్రుడ్డిగా వెల్గుతుంది. కళ్ళు కొద్దిగా దించి శరీరంవైపు చూచుకున్నాడు. మసకచీకట్లో కూడ ఎర్రటి రక్తపు చారికలు భయంకరంగా కన్పిస్తున్నాయి.

శరీరంమీద నిక్కరు తప్పించి మరే ఆచ్ఛాదనా లేకపోవడంవల్ల, గాలి సోకి, గాయాలు మంట పుడుతున్నాయి. ఆ బాధ భరించలేదు. భరించక చేయగల్గింది లేదు. విక్రమ్ కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

ఏనాడూ తన జీవితం ఇలా మారుతుందని అనుకోలేదు. పచ్చగా, ఉజ్వలంగా ఊహించుకున్న భవిష్యత్తు, చీకటిగా, నరకంగా మారిపోయింది. తన బ్రతుకిలా కావడానికి కారణం పార్వతి! అవును పార్వతే!

ఎంతగా మురిపించింది! ఎంతగా నటించింది! తన కోరి

కలను, సరదాలను తనను పాత్రగా ఉపయోగించుకుంది. కాని తను మనస్ఫూర్తిగా ప్రేమించాడు పార్వతిని. ఏం లాభం?

నిర్దాక్షిణ్యంగా తిరస్కరించి, ఎవరినో ధనవంతుడిని పెళ్ళి చేసుకుంది. దాంతో తను పిచ్చివాడైపోయాడు. స్త్రీ జాతిమీదనే అసహ్యం వేసింది.

గతాన్ని మరువలేక, భవిష్యత్తును ఊహించుకోలేక పిచ్చివాడిగా తిరిగే సమయంలో ఒక నీచుడి మాటలు నమ్మి, మనశ్శాంతికోసమని ఇక్కడకు వచ్చాడు.

ఇక్కడకు వచ్చిన తర్వాతగాని తెలియలేదు. తను అమ్ముడుపోయానని, బానిసగా మారానని. కాని, అప్పుడు చెయ్యగల్గిందేమీ లేదు. తప్పించుకోడానికి ప్రయత్నిస్తే, శరీరం తప్ప, ప్రాణాలు మిగలవని తను అతి త్వరలోనే గ్రహించాడు.

ఇక తన జీవితం ఇక్కడే, ఇలాగే గడచిపోక తప్పదు. తనకిప్పుడు అన్పిస్తుంది - మనిషి బ్రతుకును, చరిత్ర గతిని మార్చేది, భగవంతుడు కాదు - స్త్రీ అని.

## 4

ఏదో కలకలం విన్పించి ఉలిక్కిపడి లేచాడు విక్రమ్. బానిసలు అందరూ గదిలో చేరి కోలాహలంగా అరుస్తున్నారు.

నీరసంగా లేచి కూర్చుని, "ఏమిటి? ఏం జరిగింది?" అడిగాడు పక్కనేవున్న రజ్వీని.

రజ్వీ నవ్వి, "ఈరోజు మనకు పని లేదు. మద్రాసునుండి మన యజమాని కూతురు వస్తుందట!" అన్నాడు.

విక్రమ్ మౌనంగా తల ఊపి, నీరసంగా మళ్ళీ పడుకున్నాడు.

గంటకూడ గడవక ముందే నల్గురు సెంట్రీలు గదిలోకి వచ్చారు.

"ఏయ్! అమ్మగారు వస్తున్నారు! అందరూ బైటకు వెళ్ళి వరుసగా నిలబడండి!" అన్నారు అందర్నీ బైటకు నెడుతూ.

విక్రమ్ నీరసంగా లేచి బైటకు నడిచాడు.

భవనం ముందున్న విశాలమైన ఆవరణలో మొత్తం ముప్పదిముగ్గురు బానిసలు వరుసగా నిలబడ్డారు.

అర్ధగంట గడిచినా ఎవ్వరూ వస్తున్న అలికిడి విన్పించ లేదు. సెంట్రీలు మాత్రం తుపాకులు పట్టుకుని అటూ ఇటూ తిరుగుతున్నారు.

"రాజేంద్రన్ కూతురి పేరు ఏమిటి?" విక్రమ్ నెమ్మదిగా అడిగాడు రజ్వీని.

రజ్వీ పెదిమ విరచి, సరిగ్గా తెలియదు కాని 'రజని' అనుకుంటాను. ఎవరో ఎప్పుడో అంటే విన్న గుర్తు.

అంతలో కారు వచ్చి ఆగిన శబ్దం విన్పించి అందరూ తలలుత్రిప్పి చూశారు. సెంట్రీలు ఎక్కడివాళ్ళక్కడే బొమ్మల్లా నిలబడిపోయారు. కారు వెనక తలుపు తెరుచుకుని, రాజేంద్రన్ ముందు క్రిందకు దిగాడు. వెనుకనే పాతికేళ్ళ యువతి క్రిందకు దిగింది.

అందరూ ఆశ్చర్యంతో ఆ యువతివైపు చూశారు. గులాబిరంగు శరీరంతో అప్సరసలా మెరిసిపోతుంది.

ఇరువైపులా వరుసగా నిలబడ్డవాళ్ళను చూపిస్తూ, "వీళ్ళంతా మన బానిసలు!" అన్నాడు రాజేంద్రన్ పరిచయం చేస్తూ.

ఆ యువతి తల ఊపి, అందరివైపు పరీక్షగా చూస్తూ నడవసాగింది.

విక్రమ్ దగ్గరకు రాగానే, అతనివైపొకసారి చూచి, "డాడీ! ఇతనికీ దెబ్బలు ఏమిటి?" అడిగింది.

"ఇడియట్! నిన్న నామీద చేయి చేసుకున్నాడు. అందుకే వీడికీ శిక్ష! పద వెళదాం!" అన్నాడు రాజేంద్రన్ ముందుకు నడుస్తూ.

ఆ యువతి విక్రమ్ కళ్ళల్లోకి ఒకసారి సూటిగా చూచి, చిన్నగా నవ్వి ముందుకు కదిలింది.

వాళ్ళిద్దరు లోపలికి వెళ్ళగానే, అందరూ గదివైపు నడిచారు. ఆ రోజు పని లేకపోవడంవల్ల అందరికి ఆట విడుపులా వుంది. కొందరు సంతోషంతో గెంతుతూ పాటలు పాడుకోసాగారు. మరికొందరు గదిలోనే ఏవో గళ్ళు గీసి ఏవో ఆటలు ఆడుకోసాగారు.

విక్రమ్ మాత్రం మౌనంగా వెళ్ళి తన పడకమీద పడుకున్నాడు. క్షణక్షణానికి అతనికి రజని చూచిన చూపులే గుర్తుకొస్తున్నాయి. 'ఎందుకలా చూసింది? తండ్రిని కొట్టానని కోపంతోనా? దెబ్బలు తిన్నాననే జాలితోనా?'

## 5

అర్థరాత్రి ఉన్నట్టుండి మెలకువ వచ్చింది విక్రమ్‌కు. కళ్ళు తెరిచి చూచాడు. గదిలో దీపం మరీ గ్రుడ్డిగా వెల్గుతుంది. ఎవరు తగ్గించి ఉండాలి! ఎందుకు?

అంతలోనే లీలగా ఏదో శబ్దం విన్పించింది. చెవులు రిక్కించి జాగ్రత్తగా ఆలకించాడు. సందేహంలేదు. ఎవరో గోడను పగులగొడుతున్నారు.

శబ్దం కాకుండా లేచి, శబ్దం విన్పిస్తున్నవైపు నడిచాడు.

దగ్గరగా వెళ్ళి పరీక్షగా చూచాడు. మనోహర్! చేతిలో ఉన్న గునపంతో గోడను నెమ్మదిగా పగులగొడుతున్నాడు.

"మనోహర్" నెమ్మదిగా పిలిచాడు విక్రమ్.

మనోహర్ ఉలిక్కిపడి వెనక్కి తిరిగి, "నువ్వా ఎవరా అని భయపడ్డాను." అన్నాడు.

"ఏమిటది! ఇలా చెయ్యడం వల్ల తప్పించుకు పోగల మనే ఆశ ఉందా? అసలు ఈ గునపం నీకెక్కడిది?" ఆశ్చర్యంగా అడిగాడు విక్రమ్.

మనోహర్ నవ్వి, "ఉదయం, యజమాని కూతురు వస్తే బయటకు వెళ్ళాంగా. అప్పుడు పూల మొక్కల దగ్గర ఇది కన్పించింది. రహస్యంగా తీసుకొచ్చాను. పోతే మనం తప్పించుకోవడం అంటావా? చూద్దాం! పట్టుబడితే ఇప్పుడు పడే కష్టాల కంటె ఎక్కువగా ఏమీ అనుభవించబోము. అదృష్టం ఉంటే ఈ నరకం నుంచి బైట పడతాం! ఏమంటావ్?" అన్నాడు.

"మనోహర్! నా మాట విను! ఈ ప్రయత్నం మానెయ్యి. ఈ శబ్దం విని ఎవరైనా వస్తే చిత్రవధ చేస్తారు!" అన్నాడు విక్రమ్.

మనోహర్ నవ్వి, "ఏం ఫర్వాలేదు! ఈ రోజు యజమాని కూతురు వచ్చిందనే ఆనందంలో అందరూ తాగి మైకంలో ఉన్నారు. ఇంతకు మించిన అవకాశం మనకెప్పుడూ రాదు. ఒక్క అరగంట అలా చూస్తుండు. ఈ లోపల దారి చేస్తాను!" అన్నాడు తన పనిలో నిమగ్నమవుతూ.

విక్రమ్ నిట్టూర్చి ఆ తలుపు దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు.

షుమారు అరగంట తర్వాత, మనోహర్ నెమ్మదిగా పిలిచాడు.

విక్రమ్ దగ్గరగా వెళ్ళి "ఏమయింది!" అడిగాడు.

"ఉష్! పెద్దగా అరవకు! ఒక్క మనిషి వెళ్ళేంత దారి ఏర్పరచాను. వెళ్ళి అందర్నీ నెమ్మదిగా లేపు. తెల్లవారే సరికి అందరం తప్పించుకోవాలి." అన్నాడు మనోహర్ వగరుస్తూ.

మనోహర్, విక్రమ్ వెళ్ళి అందర్నీ నిద్ర లేపారు. అందరూ ఉలిక్కిపడి లేచి, విక్రమ్ చెప్పింది విని ఆశ్చర్య పోయారు. అంతలోనే అందరిలో ఏదో నూతనోత్సాహం వచ్చింది.

ముందుగా రజ్వీ బైటకు వెళ్ళి ఆనందంగా చెయ్యి వూపాడు. అందరూ ఉత్సాహంతో ఒక్కొక్కరే బైటకు వెళ్ళసాగారు.

అందరూ వెళ్ళిన తర్వాత, విక్రమ్ గదంతా ఒకసారి పరీక్షగా చూచాడు. ఎంతో నిశ్శబ్దంగా, భయంకరంగా ఉందా గది. ఈ రోజుతో తనకు, ఈ గదికి-అంటే దాని సత్వానికి ఋణం తీరిపోతుంది. తన బ్రతుకు మళ్ళీ పండ బోతుంది.

చిన్నగా తల పంకించి, తల ముందుకు దూర్చి, గోడలో ఏర్పరచిన సొరంగం గుండా ముందుకు ప్రాక్కుంటూ బైటకు వచ్చాడు.

బైట అంతా చీకటిగా ఉంది. చలిగాలి రివ్వున వీస్తూంది. చుట్టూ పరిసరాలు చూచి ఆశ్చర్యపోయాడు విక్రమ్.

తనకంటే కొద్దిసేపు ముందు వచ్చిన వాళ్ళెవరూ కన్పించలేదు. అంతలోనే ఏమయ్యారు?

ఆలోచిస్తూ నెమ్మదిగా ముందుకు నడిచాడు.

చటుక్కున మెడకు ఉచ్చు బిగుసుకుంది. ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు విక్రమ్.

"ఇడియట్! వీణ్ణికూడా లాగెయ్!" రాజేంద్రన్ స్వరం కోపంగా విన్పించింది.

ఒక్కసారిగా ముందుకు తూలి, పరీక్షగా ముందుకు చూచాడు. విక్రమ్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి. తప్పించుకు వచ్చిన బానిసలంతా వరుసగా నిలబడి ఉన్నారు. అందరి చేతులు కట్టివేయబడి ఉన్నాయి.

రాజేంద్రన్ ముందుకు వచ్చి, ఈడ్చి విక్రమ్ చెంప మీద కొట్టాడు.

"రాస్కెల్స్! తప్పించుకోడానికి ప్రయత్నిస్తారా? మీ ప్రాణాలు తీస్తానుండండి." అంటూ సెంట్రీ వైపు తిరిగి, "వీళ్ళందరిని గుర్రాలకు కట్టేసి, అర్ధ గంటసేపు ఈ ఆవరణలో ఈడ్చుకు రండి." అన్నాడు కోపంగా లోపలికి నడుస్తూ.

రాజేంద్రన్ మాటలు వినగానే అందరి గుండెలు ఒక్కసారిగా అదిరాయి. సెంట్రీలు చకచక అందర్నీ గుర్రాలకు కట్టేసారు. ఒక్క గుర్రానికి ముగ్గురుచొప్పున పదకొండు గుర్రాలకు అందర్నీ కట్టేసారు.

ఒక్కసారిగా ఈలవేసి గుర్రాలను అదిలించారు సెంట్రీలు. అంతా కొండప్రాంతం అది. బాధను తప్పించుకోడానికి ఏ అంగమూ స్వాధీనంలో లేదు. అందరి శరీరాలు రాళ్ళు రాపిడికి చర్మం చిట్లి రక్తం కారసాగింది. భయంకరమైన హాహాకారాలు ఆ ప్రాంతం అంతా మిన్నుముట్టాయి.

అర్ధగంట తర్వాత సోలిపోయిన బానిసల శరీరాలు తీసుకెళ్ళి వేరే గదిలో వేసి తాళం వేసారు సెంట్రీలు.

# 6

నీరసంగా కళ్ళు తెరిచాడు విక్రమ్. గదంతా ఖాళీగా వుంది. ఎవ్వరూ లేరు. ఏమయ్యారు? అందరూ పనిలోకి వెళ్ళారా? మరి సెంట్రీలు తనను లేపలేదేం?

ఆలోచిస్తూ తన శరీరంవైపు చూసుకొని ఆశ్చర్యపోయాడు. తన శరీరంమీద వేరే బట్టలు వున్నాయి. ఎవరు మార్చారు? ఎప్పుడు మార్చారు? ఎన్నో ప్రశ్నలు. ఆలోచించే ఓపిక లేదు. శరీరం తేలిపోతున్నట్లుగా వుంది. శరీరం అంతా నెత్తురుముద్దలా, పచ్చిపుండులా మంట పుడుతూంది.

"గుడ్! మెలకువ వచ్చిందన్నమాట!"

తల త్రిప్పిచూశాడు విక్రమ్. రాజేంద్రన్ మెట్లు దిగి వచ్చి విక్రమ్ ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

"నిజం చెప్పు! మొన్నటి దినం అందరూ తప్పించుకోడానికి ఆ ప్రయత్నం చేసిందెవరు? నువ్వేనా?" అడిగాడు రాజేంద్రన్ సౌమ్యంగా.

విక్రమ్ మాట్లాడలేదు. రాజేంద్రన్ మాటలనుబట్టి తను ఒకరోజంతా స్పృహలేకుండా వుండిపోయాడన్నమాట. గుర్రాలకు కట్టి ఈడ్చినప్పుడు బట్టలు చిరిగిపోవడంవల్లనే ఇవి మార్చి వుండాలి.

"చెప్పు! గోడను పగులగొట్టి ఆ దారి చేసిందెవరు? నువ్వేనా? ఇంకెవరన్నా చేసారా?" కాస్త కోపంగా అడిగాడు రాజేంద్రన్.

విక్రమ్ తల ఊపి, "నేనే ఆ పని చేసింది!" అన్నాడు నెమ్మదిగా. తనకు తెలుసు, తను నిజం చెప్పినా, తనకు బాధ తప్పదు. పైపెచ్చు తనతోపాటు మనోహర్ కూడ

బాధపడవలసి వస్తుంది.

రాజేంద్రన్ నెమ్మదిగా లేచి నిలబడి, "ఎవరక్కడ?" అన్నాడు నెమ్మదిగా.

సెంట్రీ లోపలికి వచ్చి నిలబడ్డాడు.

"వీణ్ని తీసుకెళ్ళి సలసలకాగే వేడినీళ్ళతో స్నానం చేయించండి" అన్నాడు నెమ్మదిగా.

భారంగా కళ్ళు మూసుకున్నాడు విక్రమ్. శిక్ష విధించడంలో ఎంత సౌమ్యత ప్రదర్శించాడు రాజేంద్రన్. తన శరీరం ఇప్పుడు వున్న స్థితిలో నులివెచ్చని నీరు తగిలినా ప్రాణం పిడచగట్టుకు పోతుంది. అలాంటిది సలసల కాగే నీళ్ళతో స్నానం అంటే? ... భగవాన్! ... కాదు. పార్వతీ!...యూ డెవిల్! విక్రం హృదయం బాధతో, భయంతో పగిలిపోతుంది.

ఇద్దరు సెంట్రీలు లోపలికి వచ్చి, చెరొక చెయ్యి పట్టుకొని విక్రమ్‌ను ఈడ్చుకు వెళ్ళారు. బట్టలన్నీ తీసేసి నగ్నంగా నేలమీద పడుకోబెట్టారు. విక్రమ్ నీరసంగా కళ్ళు తెరిచి చూచాడు.

ఎదురుగా పెద్దపాత్రలో నీళ్ళు పొగలు కక్కుతున్నాయి. 'భగవాన్! ఇన్ని చిత్రహింసలు పెట్టే కిరాతకులు ఇంకా వున్నారా?' విక్రమ్ హృదయం బాధగా మూల్గింది.

బానిసల కథలు చిన్నప్పుడు తను పుస్తకాల్లో చదివాడు. అప్పుడు వాటిని ఎంతో ఆనందంగా చదివేవాడు. కాని బానిస బ్రతుకులు ఇంత నికృష్టంగా వుంటాయనీ, ఇంతటి నరకయాతన అనుభవించవలసి వస్తుందనీ ఎన్నడూ ఊహించలేదు.

చిన్న పాత్రతో కొద్దిగా నీళ్ళుతీసి విక్రమ్ శరీరంమీద పోసాడు సెంట్రీ!

'అమ్మా!' భూనభోంతరాలు దద్దరిల్లేలా అరిచాడు విక్రమ్. బాధ భరించలేక పళ్ళు గట్టిగా కరిచి పట్టాడు. బాధతో కళ్ళు వెళ్ళుకువస్తున్నాయి. సుమారు పదినిము షాలు పిచ్చివాడిలా వెర్రికేకలు వేస్తుండిపోయాడు. చెవుల దగ్గర, మెడదగ్గర నరాలు ఉబ్బి మొహం వికృతంగా తయారయింది. పళ్ళు కరిచిపెట్టడంవల్ల పెదవి చిట్లి రక్తం కారసాగింది.

పావుగంట తర్వాత మళ్ళీ బట్టలు తొడిగి, ఈడ్చు కొచ్చి గదిలో వేసి తాళంవేసారు సెంట్రీలు. విక్రమ్ సొమ్మసిల్లి అలాగే పడిపోయాడు.

"ఏయ్! నిన్నే!" తీయగా వినిపించింది.

భారంగా కళ్ళు తెరిచి చూచాడు. ఎదురుగా రజని.

"ఎలా వుంది!" అడిగింది నెమ్మదిగా.

విక్రమ్ మాట్లాడకుండా కళ్ళు మూసుకున్నాడు.

"ఏయ్! నిన్నే! ఇలా చూడు! వీళ్ళందరికీ హీరో నువ్వేనా?" అడిగింది నవ్వుతూ.

విక్రమ్ కళ్ళు తెరవకుండానే బలహీనంగా నవ్వాడు.

"హాయ్! హీరో! నన్ను పెళ్ళి చేసుకుంటావా? నిన్ను ఇండియా తీసుకెళ్తాను!" ఆత్రంగా అడిగింది.

విక్రమ్ కళ్ళు తెరిచి, "నేనా?" అన్నాడు బల హీనంగా.

రజని చటుక్కున లేచి నిలబడి, ఈడ్చి కాలితో డొక్కలో కొట్టింది.

"బ్రూట్స్! దద్దమ్మలు!" కాళ్ళు నేలకేసి కొట్టు కుంటూ బయటకు వెళ్ళి తలుపులు వేసింది.

# 7

వారంరోజులు గడిచాయి. ఈ వారంరోజులనుంచి అందరితోపాటు వెళ్ళి కొండరాళ్ళు పగలగొడుతున్నాడు విక్రమ్. బానిస ఎలాంటి స్థితిలో వున్నా విశ్రాంతి దొరకడం దుర్లభం.

ఈ వారంరోజులనుంచి, మళ్ళీ రజని యెక్కడైనా కన్పిస్తుందేమోనని ప్రతిరోజూ ఎదురుచూస్తున్నాడు విక్రమ్. కాని అసలు రజని వున్నట్లు ఎలాంటి ఆధారమూ దొరకలేదు.

ఆరోజు రాత్రి భోజనాలు అయి గదికి రాగానే రజనిని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు విక్రమ్.

ఆరోజు రజని ఎందుకలా ప్రవర్తించింది. ఎంతో అందంగా, తెలివిగా కన్పించే రజని, అంత వెకిలిగా, రాక్షసంగా ఎందుకు ప్రవర్తించింది.

"విక్రమ్! ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అడిగాడు రజ్వీ పక్కన కూర్చుంటూ.

విక్రమ్ నవ్వి, "బాబా! నేనొకటి అడుగుతాను చెబుతావా?" అడిగాడు.

"తప్పకుండా చెబుతాను! ఏమిటది?" అడిగాడు రజ్వీ ఉత్సాహంగా.

"రజని ప్రవర్తన నాకు అర్థం కాలేదు." అంటూ ఆరోజు జరిగిందంతా చెప్పి, "ఆమె ప్రవర్తనకు కారణం యేమై వుంటుంది?" అడిగాడు.

అంతా విని రజ్వీ నవ్వాడు. "ఆ అనుభవం నీకుకూడ అయిందన్నమాట! విక్రమ్! నీకో విషయం చెప్పనా? కంగారు పడకు! రజనికి పిచ్చి! నిజం. నువ్వు స్పృహ

లేకుండా పడివున్న రెండురోజులు మేము పనిచేసేచోటికి వచ్చి ఇలాగే అందర్నీ అడిగింది. చివరకు నన్నుకూడ అడిగింది. అందరి సమాధానం విని, తిట్టి, కొట్టి, కోపంగా వెళ్ళిపోయింది. ఆతర్వాత సెంట్రీద్వారా తెలిసింది, రజనికి పిచ్చి అని!'' అన్నాడు రజీవ్ నెమ్మదిగా.

విక్రమ్ ఆశ్చర్యపోయాడు. అంత అందంగా, తెలివిగా కన్పించే రజనికి పిచ్చా? అయివుండవచ్చు. కొందరి పాపాలు మరికొందర్ని కట్టి కుడుపుతాయి. తల్లితండ్రులు చేసే పాపాలకు బిడ్డలు శిక్ష అనుభవించేది సర్వ సాధారణం. రాజేంద్రన్ చేసిన పాపాలు అతని కూతుర్ని పట్టి పీడిస్తున్నాయి. పాపం ఒకరిది, దాని ఫలితం ఇంకొకరిది! ప్చ్! చిన్నగా నిట్టూర్చి మేను వాల్చాడు.

రెండురోజుల తర్వాత అకస్మాత్తుగా కన్పించింది రజని. ఆరోజు సాయంత్రం నాలుగంటల ప్రాంతంలో పనిచేసే సమయంలో దూరంగా రజని వస్తూ కన్పించింది. విక్రమ్ పనిచెయ్యడం ఆపి, రజనివైపు చూస్తుండిపోయాడు.

చిన్నపిల్లలా ఎగురుతూ, కూనిరాగాలు తీస్తూ, దిక్కులు చూస్తూ వస్తుంది. రజనిని చూచికూడా చూడనట్లే ఒక్కొక్కరు బెరుగ్గా తలలు వంచుకున్నారు. విక్రమ్ రజనివైపే చూస్తుండిపోయాడు. ఒక్కొక్కరినీ పలకరిస్తూ విక్రమ్ దగ్గరకు వచ్చింది.

''హాయ్! హీరో! ఎలా వున్నావ్?'' అంది నవ్వుతూ.

విక్రమ్ రజనివైపు జాలిగా చూచి, చిన్నగా నవ్వాడు.

రజని విక్రమ్ దగ్గరగా వచ్చింది. ''యూ సిల్లీ! నా వైపు అలా జాలిగా చూడకు! నా కేలాంటి పిచ్చీ లేదు!''

సీరియస్, రహస్యంగా అని మళ్ళీ నవ్వుకుంటూ గెంతుతూ ముందుకు వెళ్ళిపోయింది.

ఆశ్చర్యపోయాడు విక్రమ్! 'ఏమిటిది? కలా? నిజమా? నిజంగా రజనికి పిచ్చిలేదా? మరి ఆ వాలకం, ఆ ప్రవర్తన ఏమిటి? నిజంగా పిచ్చి లేకపోతే పిచ్చి వున్నట్లుగా ఎందుకు ప్రవర్తిస్తుంది? పిచ్చిదే అయితే, అంత సీరియస్‌గా, రహస్యంగా నావైపు జాలిగా చూడవద్దని ఎందుకన్నది? అసలు రహస్యం ఏమిటి?' ఆలోచిస్తూ పని చేసుకోసాగాడు.

# 8

అందరూ భోజనాలు చేసివచ్చి పడుకున్నారు. అర్ధ రాత్రిపూట ఎందుకో మెలకువ వచ్చింది విక్రమ్‌కు. లేచి కూర్చున్నాడు. గదిలో ఏదో భయంకరమైన వాసన వస్తుంది.

భరించలేని దుర్గంధం! ఏమిటది? ఎక్కడనుంచి వస్తుంది! ఆలోచిస్తూ గదంతా కలయచూశాడు. ఏమీ కన్పించలేదు. ఆ దుర్గంధానికి నాసికాపుటాలు అదురుతున్నాయి. కడుపులో పేగులు వెళ్ళుకువస్తున్నాయి. ఇంత భయంకరమైన దుర్గంధంలో వీళ్ళంతా ఎలా నిద్ర పోగల్గుతున్నారు.

"విక్రమ్!" మనోహర్ పిలిచాడు.

"ఊ!!"

"గదిలో ఈ భయంకరమైన వాసన ఏమిటి?" అడిగాడు మనోహర్ లేచి కూర్చుంటూ.

"అదే నేనూ చూస్తున్నాను!" అన్నాడు విక్రమ్.

ఇంతలో సన్నగా మూలుగు విన్పించింది.

ఇద్దరూ లేచి మూలుగు విన్పించిన చోటికి వెళ్ళారు. జైసింగ్ బోర్లా పడుకుని మెలికలు తిరుగుతూ మూల్గుతున్నాడు.

"జైసింగ్! ఏమిటి? ఏమయింది?" అడిగాడు మనోహర్ తడుతూ.

విక్రమ్ దీపం తీసుకువచ్చి జైసింగ్ దగ్గర కూర్చున్నాడు.

జైసింగ్ మాట్లాడకుండా బాధతో మెలికలు తిరుగుతున్నాడు.

అప్పటికే గదిలో అందరూ లేచి చుట్టూ మూగారు.

ఇద్దరూ కలిసి జైసింగ్‌ను బలవంతంగా వెల్లకిలా తిప్పారు. జైసింగ్ రెండుచేతులతో డొక్క పట్టుకొని మూల్గుతున్నాడు. బాధతో మెలికలు తిరిగిపోతున్నాడు.

విక్రమ్ ఆశ్చర్యంగా చొక్కా పైకెత్తాడు. అంతే! అందరి కడుపులు ఒక్కసారిగా దేవినట్లయింది. కళ్ళు తిరుగుతున్నట్లయింది. గదిలోకి అంత భయంకరమైన దుర్గంధం ఎక్కడనుంచి వస్తుందో అర్థం అయింది.

జైసింగ్ డొక్కలో బ్రహ్మాండమైన గాయం పుండుగా మారి కుళ్ళిపోయింది. గాయం చుట్టూ శరీరం నల్లగా కమిలి, గాయంలో రంధ్రం ఏర్పడింది.

"లాభంలేదు! ఇతను చనిపోతాడు. గాయం చాల రోజులనుంచి వుండివుండాలి. శరీరంతోపాటు లివర్ కూడ కుళ్ళిపోయి వుండాలి" అన్నాడు మనోహర్.

"అవును! అంతే అయివుండాలి. ఆరోజు గుర్రాలకు కట్టి ఈడ్చినరోజు, డొక్కలో ఏదో గుచ్చుకుందని నాతో అన్నాడు. కాని, ఆతర్వాత మళ్ళీ నాకేమీ చెప్ప

లేదు" అన్నాడు జానీ జైసింగ్ వైపు పరీక్షగా చూస్తూ.

ఉన్నటుండి జైసింగ్ పెద్దగా అరిచి కాళ్ళు చేతులు నిగడదీసి కొట్టుకోసాగాడు.

"జైసింగ్! జైసింగ్!" ఆతృతగా పిలిచారు అందరూ.

జైసింగ్ భారంగా కళ్ళు తెరిచి, జానీ! భరించలేని బాధగా వుంది. గుండె పిండేస్తుంది, ఈ బాధ భరించ లేను. దయచేసి ఎవరైనా నన్ను చంపెయ్యండి" అన్నాడు బాధగా అరుస్తూ.

అందరూ ఒకరి మొహాలు ఒకరు చూచుకున్నారు.

"అమ్మా!" పెద్దగా ఎగిరి పడ్డాడు జైసింగ్. "జానీ! నీకు దణ్ణం పెడతాను. నన్ను చంపెయ్యి. ఈ బాధ భరించలేను!" దీనంగా, బాధగా ఏడుస్తూ రెండు చేతులు జోడించాడు.

మనోహర్ పెదిమ విరిచాడు. "లాభం లేదు! ఇతని క్షేమం కోరే వాళ్ళమైతే, ఇతన్ని చంపడం కంటే గత్యంతరం లేదు. ఇంక కొద్ది క్షణాల్లో ఎలాగూ చని పోతాడు. కాని కొద్దిసేపు అతను ఈ బాధ భరించలేడు. కొద్దిసేపు గడిస్తే అతని బాధ ఏ మానవమాత్రుడూ చూడలేడు. అందుకే ఇతన్ని ఆ బాధ నుంచి తప్పించా లంటే, చంపక తప్పదు!" అన్నాడు నెమ్మదిగా.

అందరూ అవాక్కయిపోయారు. ఎవ్వరూ మాట్లాడ లేదు. జైసింగ్ బాధతో ఎగిరెగిరి పడుతూ ఏడుస్తున్నాడు.

రెండు నిముషాలు తదేకంగా జైసింగ్ వైపు చూచి, రెండు చేతులతో జైసింగ్ గొంతు పట్టుకొని చటుక్కున నొక్కేసాడు విక్రమ్. నిముషం తర్వాత జైసింగ్‌లో చలనం ఆగిపోయింది.

అందరూ ఊపిరి బిగపట్టి విక్రమ్ వైపే చూడసాగారు.

విక్రమ్ నెమ్మదిగా లేచి నిలబడి అందరివైపు చూస్తూ, "రేపు భోజనాల దగ్గర ఒక ప్లేటు తీసెయ్యండి." అన్నాడు తన పడకవైపు నడుస్తూ.

# 9

నరాలు పగిలి, రక్తం గడ్డ కట్టుకు పోయేంత దెబ్బ తగిలేసరికి, ఎగిరిపడి, పెద్దగా అరుస్తూ కళ్ళు తెరిచాడు విక్రమ్.

ఎదురుగా సెంట్రీలు నిప్పులు కురిపిస్తూ నిలబడ్డారు.

"లేరా, లే! అయ్యగారు పిలుస్తున్నారురా!" సెంట్రీ ఊడ్చి మళ్ళీ డొక్కలో కొట్టాడు.

అదిరిపడి లేచి నిలబడ్డాడు విక్రమ్. గదిలో మిగతా అందరూ బిక్కు బిక్కుమంటూ చూస్తూ నిలబడ్డారు.

సెంట్రీలిద్దరూ విక్రమ్‌ను లాక్కొని వెళ్ళి రాజేంద్రన్ గదిలోకి నెట్టారు.

ఆ విసురుకు గదిలో నేలమీద పడి లేచి నిలబడ్డాడు. ఎదురుగా, రాజేంద్రన్, రజిని కూర్చొని ఉన్నారు.

రాజేంద్రన్ నవ్వి, "రాత్రి జైసింగ్‌ను చంపావటగా!" అడిగాడు.

విక్రమ్ మౌనంగా తల ఊపాడు.

ఊడ్చి చెంపమీద కొట్టాడు రాజేంద్రన్. "రాస్కెల్! ఎందుకు చంపావ్?" విక్రమ్ జుట్టు పట్టుకొని కుదుళ్ళతో సహా లాగుతూ గర్జించాడు.

విక్రమ్ తల విదిలించాడు. పట్టు తప్పి రాజేంద్రన్ తూలి పడ్డాడు.

"అవును. జైసింగ్‌ను నేనే చంపాను. అతని బాధ

చూడలేక, అతన్ని ఆ బాధ నుంచి విముక్తుడిని చెయ్యాలని, అతని కోరిక మీదనే అతన్ని చంపాను! ఏం?'' అడిగాడు కోపంగా.

రాజేంద్రన్ మాట్లాడలేదు. విక్రమ్ వైపొకసారి కోపంగా చూచి, గదిలో పచార్లు చెయ్యసాగాడు. రజని విక్రమ్‌వైపు దీనంగా చూచింది.

రాజేంద్రన్ చటుక్కున ఆగి, చప్పట్లు చరిచాడు. సెంట్రీలు లోపలికి వచ్చారు. ''వీణ్ణి తీసుకెళ్ళి 'ఖండలీకం' విధించండి!'' ఆజ్ఞాపించాడు.

విక్రమ్‌కు రజని మొహంలో భయం స్పష్టంగా కన్పించింది.

''ఖండలీకం'' ఇదేం శిక్ష. ఇదేంటో తనకు తెలియదు. తనిప్పుడు దేనికి భయపడడు. బానిసత్వంతో, శిక్షలతో, తన శరీరం, హృదయం రెండూ మొద్దుబారిపోయాయి.'' విక్రమ్ మాట్లాడకుండా సెంట్రీలను అనుసరించాడు.

''ఆగండి'' గర్జించాడు రజ్వీ.

అందరూ ఉలిక్కిపడి చూశారు. ''జైసింగ్‌ను చంపింది అతను కాదు నేను. అతన్ని విడిచి పెట్టండి'' అన్నాడు పెద్దగా.

రాజేంద్రన్ ఆశ్చర్యంగా ఇద్దరి వైపు చూచి, ''నిజం చెప్పు! జైసింగ్‌ను చంపిందెవరు?'' అడిగాడు రజ్వీని.

''నేను! జైసింగ్‌ను చంపింది నేను! అతను కాదు.'' అన్నాడు రజ్వీ.

విక్రమ్ ఆశ్చర్యంగా రజ్వీ వైపు చూశాడు. రజ్వీ ఆంతర్యం అతనికి అర్థం అయింది. ఈ మధ్య వరుసగా తను చాల శిక్షలు అనుభవించాడు. అందుకే తనమీద అభి

మానంతో ఈ శిక్షణను తప్పించి తను అనుభవించడానికి సిద్ధపడ్డాడు. రజ్వీ అభిమానానికి, త్యాగానికి, విక్రమ్ కళ్ళు తడిశాయి.

కాని తను అది సహించలేదు. తను యువకుడు. ఎన్ని శిక్షలు, కష్టాలయినా భరించే శక్తి తనకు ఉంది. కాని రజ్వీ! వడి వయసు దాటిన ముసలి. అభిమానంతో ముందుకు వచ్చాడే గాని, బాధను ఓర్చుకునే శక్తి అతనికి లేదు.

విక్రమ్ రాజేంద్రన్ వైపు తిరిగి, "రజ్వీ నామీద అభిమానంతో అలా అంటున్నాడు నిజానికి జైసింగ్ ను చంపింది నేను!" అన్నాడు.

రాజేంద్రన్ రెండు నిమిషాలు ఇద్దరి వైపు పరీక్షగా చూసి, "ఇద్దర్నీ తీసుకు వెళ్ళండి!" అన్నాడు కోపంగా.

"బాబా! అనవసరంగా నువ్వెందుకు జోక్యం చేసుకున్నావ్?" అడిగాడు విక్రమ్.

"విక్రమ్! 'కుండలీకం' అంటే నీకు తెలియదు. తల క్రిందులుగా వ్రేలాడదీసి కడుపుమీద, డొక్కల్లో కొడతారు. ఒక్కోసారి పేగులు తెగి మనిషి చనిపోవడం కూడ జరుగుతుంది." అన్నాడు రజ్వీ చిన్నగా నిట్టూర్చి.

# 10

వారం రోజులు గడిచాయి. ఈ వారం రోజులు విక్రమ్ ఆహారం తీసుకోలేదు. కేవలం మంచి నీళ్ళు తప్ప ఇంకేమీ తీసుకోలేదు. కడుపంతా పచ్చి పుండులా వుంది. గొంతు వాచి చాల అసహ్యంగా వుంది.

వారం రోజుల తర్వాత మళ్ళీ మొదటిసారిగా భోజనాల గదికి వెళ్ళి రొట్టె తింటూ ఎదురుగా ఉన్న బల్లవైపు

చూశాడు. ఇప్పుడది ఖాళీగా ఉంది. ఇంతకు ముందు అక్కడ రజీవ్ కూర్చునే వాడు. ఇప్పుడు లేడు. రజీవ్ చని పోయి వారం రోజులయింది. తనకోసం వ్యర్థమైన త్యాగం చేసి ప్రాణాలు తీసుకున్నాడు.

రజీవ్ మనస్సులో మెదలగానే ఇంకేమీ తినాలనిపించ లేదు. మిగిలింది అక్కడే వదిలేసి బయటకు నడిచాడు.

వరండా అంతా చీకటిగా వుంది. వరండాకు ఆ చివర, ఈ చివర ఇద్దరు సెంట్రీలు వుంటారు. తప్పించుకుపోయే మార్గం లేదు. ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

"విక్రమ్!" నెమ్మదిగా విన్పించి వెనక్కి తిరిగి చూశాడు.

చీకట్లో స్థంభం చాటుగా రజని నిలబడివుంది!

ఆశ్చర్యంగా రజనివైపు చూస్తూ "మీరా!" అన్నాడు.

"ఉష్! పెద్దగా అరవకు!" అంటూ చెయ్యిపట్టుకుని పక్కనవున్న గదిలోకి తీసుకువెళ్ళింది.

గదిలోకి వెళ్ళగానే లైటు వెల్గించి తలుపులు వేసింది.

రజనివైపు చూస్తూ, "ఏమిటిది?" అడిగాడు ఆశ్చర్యంగా.

"చెబుతాను! ఇలారా" అంటూ మంచం దగ్గరకు తీసుకువెళ్ళి కూర్చోబెట్టి తనూ కూర్చుంది.

"విక్రమ్! నన్ను చూస్తే నీకేమనిపిస్తుంది!" హఠాత్తుగా అడిగింది.

"ముందు పిచ్చిదాని వనుకున్నాను. కాని, యిప్పుడు ఏమీ అనుకోవడంలేదు" అన్నాడు నిశ్చలంగా.

"విక్రమ్! నన్ను నమ్ము. నా కెలాంటి పిచ్చీ లేదు!" అంది రజని దీనంగా.

"మరి, ఎందుకలా నటించావ్?" అడిగాడు.

రజని నిట్టూర్చి, "అది చెప్పడానికే ఇప్పుడు నిన్ను పిలిచాను. విక్రమ్! నువ్విక్కడకు రాకముందు అంటే పది సంవత్సరాల క్రిందట నాకు అన్నయ్యా వుండేవాడు. అన్నయ్యా, నేను ఎంతో అన్యోన్యంగా వుండేవాళ్ళం. కాని, మా నాన్నలో ఒక దుర్గుణం వుంది. ప్రపంచంలో ఇప్పుడు ఎక్కడా లేని బానిసత్వాన్ని పునరుద్ధరిస్తున్నాడు. బానిసలను కొనడం వాళ్ళచేత వెట్టిచాకిరి చేయించుకుని వాళ్ళను హింసించి ఆనందించడం మా నాన్నకున్న దుర్గుణం.

ఈ బానిసత్వానికి నేనూ, మా అన్నయ్య యిద్దరం వ్యతిరేకులమే! కాని, మా నాన్న చండశాసనుడు. ఆయన్ను ఎదిరించే శక్తి లేదు. పది సంవత్సరాల క్రితం అప్పుడుకూడా బానిసలు మా నాన్న పెట్టే బాధలు భరించలేక చాలసార్లు తిరుగుబాటు చేసి విఫలమై చిత్రవధ అనుభవించారు.

అప్పటినుంచి అందరిలో మా నాన్న అంటే ద్వేషం కరుడుగట్టుకుపోయింది. అలాంటి సమయంలో ఒకరోజున ఇటువచ్చిన మా అన్నయ్యాను అందరూ కలిసి చిత్రహింస చేసి చంపి, మా నాన్నమీద కసి తీర్చుకున్నారు.

ఆ సంఘటనతో నాకు మతి చలించింది. మా నాన్న నన్ను మద్రాసులో మెంటల్ హాస్పిటల్లో చేర్పించాడు. ఈ పది సంవత్సరాలు అక్కడే గడిపాను.

నిజానికి రెండుసంవత్సరాల క్రిందటే నాకు బాగైంది. కాని, నాకు ఇక్కడకు రావడానికి ఇష్టంలేదు. అందుకే ఈ రెండు సంవత్సరాలుకూడ పిచ్చిదానిగానే అక్కడే

వుండిపోయాను. కాని, నాకు పూర్తిగా బాగయిందని డాక్టర్లు చెప్పడంవల్ల, మా నాన్న మళ్ళీ నన్ను ఇక్కడకు తెచ్చాడు. నాకు ఇక్కడ వుండడం బొత్తిగా ఇష్టంలేదు.

నిన్ను మొట్టమొదటిసారి చూడగానే ఎందుకో మా అన్నయ్య జ్ఞాపకం వచ్చాడు చాల సందర్భాలలో. నీకు, మా అన్నయ్యకు పోలికలు వున్నాయి. అందుకే నీవంటే నాకు చాల అభిమానం ఏర్పడింది'' అంది రజని.

''అది సరే! పిచ్చిదానిలా ఈ నాటకం యెందుకు?'' అడిగాడు విక్రమ్.

''ముందే చెప్పాను! నాకు ఇక్కడ వుండడం యిష్టం లేదని. అందుకే పిచ్చిదానిలా నటిస్తే మళ్ళీ మద్రాసు పంపుతాడని ఆశ. కాని, మా నాన్న ఇక నన్ను ఎక్కడికీ పంపేలా లేదు. అందుకే ఇక్కడనుంచి తప్పించుకు పోవాలని నా ప్రయత్నం. అందుకు నీ సహాయం కావాలి'' అంది నెమ్మదిగా.

''నా సహాయమా?''

''అవును! నిన్ను తప్పించే ఏర్పాటు నేను చేస్తాను. ఆ తర్వాత ఎలాగైనా నన్ను ఇక్కడనుంచి తప్పించి ఇండియా చేర్పించాలి. దయచేసి నాకీ ఒక్క సహాయం చేసిపెట్టు!'' అంది దీనంగా.

రజనివైపు సూటిగా చూశాడు విక్రమ్. ఆమె కళ్లల్లో వాత్సల్యం, అభిమానం కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి.

నిట్టూర్చి లేచి నిలబడ్డాడు విక్రమ్! ''రజనీ! నువ్వు చెప్పినట్లే చేస్తాను. నామీద నమ్మకం ఉంచు. నన్ను తప్పించే ఏర్పాటు చెయ్యి. నిన్ను నేను తప్పక ఇండియా చేరుస్తాను.''

రజని మొహం ఆనందంతో వెలిగిపోయింది. "అలాగే! రేపు సాయంత్రం ఏ విషయం నీకు చెబుతాను!" అంటూ చటుక్కున మునికాళ్ళమీద లేచి నిలబడి విక్రమ్ నుదుట ముద్దు పెట్టుకుంది.

"మా అన్నయ్యను నేనిలా ముద్దు పెట్టుకుంటేగాని నిద్ర పోయేవాడు కాదు!" అంది రజని దిగులుగా.

విక్రమ్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చటుక్కున తల తిప్పుకొని వడివడిగా బైటకు నడిచాడు.

# 11

విక్రమ్ వెళ్ళగానే తలుపులు బిగించి వెనక్కి తిరిగింది రజని. ఎదురుగా మనోహర్ నిలబడి వున్నాడు.

"నువ్వా! ఇక్కడికెందుకొచ్చావ్?" కోపంగా అరిచింది.

"ఉష్! పెద్దగా అరవకు! ఎవరైనా వస్తారు. ఒక ఆడది ఒంటరిగా వున్నచోటుకు మగవాడెందుకొస్తాడు. అందుకే నేనూ వచ్చాను" అన్నాడు నవ్వుతూ.

"యూ రాస్కెల్! గెటౌట్!" అంది పెద్దగా అరుస్తూ.

మనోహర్ చటుక్కున రజని నోరు మూసి, రెండు చేతులు విరిచి పట్టుకున్నాడు.

"రజనీ! ఒక్కసారి ప్లీజ్! సంవత్సరాల తరబడి నాలో కరుడు గట్టుకున్న శారీరక వాంఛ, నిన్ను చూడగానే పెల్లుబికింది. ఇలాంటి అవకాశంకోసమే ఎదురు చూస్తున్నాను. ఈ అవకాశాన్ని జారిపోనివ్వకు! నువ్వు సుఖపడి నన్ను సుఖపెట్టు!" ఉద్వేగంగా అన్నాడు మనోహర్.

రజని దీనంగా చూసింది మనోహర్ వైపు.

"రజనీ, ఒక్కసారి! ఎవ్వరికీ తెలియదు" అంటూ రజని నోటిమీదనుంచి చెయ్యి తొలగించాడు.

పెద్దగా అరవబోయింది రజని. చటుక్కున మళ్ళీ నోరు మూసి, "రాస్కెల్! మంచిమాటలతో నీవు వినవు! ఏమైనా సరే ఈరోజు నిన్ను అనుభవించి తీరుతాను. నీ ఈ ఖర్మకు, నా ఈ దౌర్జన్యానికి కారకులు యెవరో తెలుసా? నీ తండ్రి! నీ తండ్రివల్లే యింతకాలం శారీరక సుఖాలకు, మనశ్శాంతికి దూరమై ఏ రాయి, రప్పా బ్రతకని నికృష్టపు బ్రతుకు బ్రతుకుతున్నాం.

ఈ సమయంలో నువ్వే కాదు, ఏ ఆడది అయినా ఇంతే! నీ తండ్రిమీద పగకాదు నాకు కావలసింది. నాకు ఆడది కావాలి. సంవత్సరాల తరబడి అణచుకున్న శారీరక వాంఛ తీర్చుకోవాలి! అంతే! అందుకు నువ్వైనా, ఇంకెవ్వరైనా నాకు ఒక్కటే! కాని ఈ సమయంలో నువ్వే దొరకడం, అది మీ నాన్న పాప ఫలం, నీ ఖర్మ ఫలం" అంటూనే చీరకొంగుతో రజని నోరు, చేతులు కట్టేసి, వివస్త్రను చెయ్యసాగాడు.

రజని దీనంగా ఏడుస్తూ గింజుకోసాగింది. మనోహర్ రజనీ మొహంవైపు చూడడంలేదు. పాలరాయిలా మెరిసి పోతున్న ఆమె వొంపుసొంపులు చూస్తున్నాడు. క్షణ క్షణానికి అతని కళ్ళల్లో కామం పెరగసాగింది.

పావుగంట తర్వాత తన కోరిక తీర్చుకొని లేచి నిల బడ్డాడు మనోహర్. రజని స్పృహలేకుండా నేలమీద పడివుంది.

రజని కట్లు విప్పి, చిన్నగా కుదిపాడు. రజని శరీరం అచేతనంగా తగిలింది. ఆతృతగా వంగి ముక్కుదగ్గర

చెయ్యిపెట్టాడు. శ్వాస ఆడడంలేదు. అంటే? రజని చని పోయింది.

మనోహర్‌కు పిచ్చెక్కసాగింది. అమాయకంగా వున్న రజని మొహం చూస్తుంటే అతనికి దుఃఖం ముంచుకు రాసాగింది.

మోకాళ్ళమీద రజని శవందగ్గర కూర్చొని, ముందుకు వంగి, పాలభాగంమీద ముద్దు పెట్టుకున్నాడు.

"నన్ను క్షమించు రజనీ! నా శరీరవాంఛను అణచుకో లేక నిన్ను బలికొన్నాను. నీ చావుకు కారణం నేనే అయినా, అది నా రాక్షసత్వం కాదు. మీ నాన్న చేసిన దుర్మార్గం!"

నెమ్మదిగా లేచి నిలబడ్డాడు. అతని కళ్ళల్లో ఇప్పుడు ఎలాంటి కోరికా, భావమూ లేదు. పిచ్చివాడిలా చూస్తూ బైటకు నడిచాడు.

# 12

ఉదయం మామూలుగా తెల్లవారింది. అందరూ పని లోకి బయలుదేరారు. మనోహర్‌ను చూచి అందరూ ఆశ్చర్యపోయారు.

"అరె, మనోహర్! రాత్రి గదిలో లేవు, ఎక్కడి కెళ్ళావ్?" ఆశ్చర్యంగా అడిగాడు జానీ.

మనోహర్ నవ్వి, "అలా షికారుకు వెళ్ళాను. తప్పించుకోడానికి వీలుంటుందేమోనని ప్రయత్నించాను. వీలు కాలేదు" అన్నాడు పెదిమ విరుస్తూ.

విక్రమ్ చివరిగా నడుస్తూ, యధాలాపంగా రాత్రి తను రజనిని కలుసుకున్న గదివైపు చూశాడు. తలుపులు ఓరగా తెరచివున్నాయి. తెల్లవారినా, గదిలో లైటు యింకా

వెళ్ళుతున్నట్లు స్పష్టంగా కన్పిస్తుంది.

విక్రమ్ ఆశ్చర్యపోయాడు. రజని ఇంకా గదిలో ఎందుకు వుంది. మామూలుగా రజని పడుకునే గది యిది కాదు. అసలు ఈ గది ఎవ్వరూ సామాన్యంగా ఉపయోగించరు.

ఆలోచిస్తూ గదితలుపులు నెట్టుకొని లోపలికి నడిచాడు. లోపలి దృశ్యం చూచి అవాక్కయిపోయాడు. గదిలో మధ్యగా నేలమీద రజని శవం పడివుంది. దుస్తులన్నీ అస్తవ్యస్తంగా వున్నాయి. చూడగానే తెలుస్తుంది రజనిలో ప్రాణం లేదని, బలవంతంగా చెరచబడిందని.

చటుక్కున తలుపుమూసి వెనక్కు తిరిగాడు.

అతని స్మృతిపథంలో మనోహర్ మెదిలాడు. 'అవును, మనోహర్ ఒక్కడికే ఆ అవకాశం వుంది. మిగతా సెంట్రీలు ఎవ్వరూ రజనిని కనీసం తలెత్తి చూడడానికి కూడ జంకుతారు. ఈ ఘోరాన్ని సెంట్రీలు చేసివుంటారనేది హాస్యాస్పదం. ఇక మిగిలింది మనోహర్ మాత్రమే! రాత్రంతా అతను గదిలో లేడు. ఎక్కడికి వెళ్ళాడు?'

"మనోహర్!" గంభీరంగా పిలిచాడు విక్రమ్. అతని మనస్సులో రజని రూపం దీనంగా కన్పిస్తుంది.

"ఏమిటి?" అడిగాడు మనోహర్ వెనక్కు వచ్చి.

"రజనిని చెరిచి, చంపింది నువ్వేనా?" సూటిగా అడిగాడు విక్రమ్.

మనోహర్ ఉలిక్కిపడి విక్రమ్ వైపు చూచి తిరిగి తల దించుకున్నాడు. "అందులో నా తప్పేం లేదు. ఆమె చనిపోతుందని నేను అనుకోలేదు!" అన్నాడు నెమ్మదిగా.

అంతే! మరుక్షణంలో మనోహర్ చెంప అదిరిపోయింది.

"ఇడియట్! నీ కామానికి ఒక ప్రాణాన్ని బలి తీసు కుంటావా?" పెద్దగా అరుస్తున్నాడు విక్రమ్.

ఇంతలో, పెద్దగా పొలికేక విన్పించింది. అది రాజేం ద్రన్ కంఠం.

రజని చావు గురించి రాజేంద్రన్‌కు ఎవరో సెంట్రీలు చెప్పి ఉండాలి.

"అమ్మా! రజనీ!" పెద్దగా అరుస్తూ, ఏడుస్తూ క్రిందకు పరుగెత్తుకొచ్చాడు రాజేంద్రన్.

అప్పటి వరకు బానిసలకు కాపలా కాస్తున్న సెంట్రీలు యజమాని ఏడుపు విన్పించటంతో ఆదుర్దాగా ముందుకు కదిలారు.

రాజేంద్రన్ గదిలో, శవం ముందు కూర్చుని తల కొట్టు కుంటూ ఏడవ సాగాడు.

"విక్రమ్! ఇదీ మంచి సమయం. రాజేంద్రన్ తేరు కుంటే, నిన్నూ, నన్నూ ఇద్దర్నీ బ్రతకనివ్వడు ఇప్పుడు సెంట్రీలు కూడ లేరు. కమాన్! పారిపోదాం!" ఆతృతగా విక్రమ్ చెయ్యి పట్టుకొని లాగాడు మనోహర్.

విక్రమ్ ఆలోచిస్తున్నాడు. 'మనోహర్ చెప్పింది నిజమే. రాజేంద్రన్‌కు తనమీద కొండంత అనుమానం. తనమీద కోపంతో తన కూతురి బ్రతుకిలా చేశాననే కోపంతో కాల్చి చంపినా చంపవచ్చు. హీనమైన చావు ఇక్కడ చచ్చేకంటే పారిపోతే ఏం?'

ఒక్కసారిగా ఇద్దరూ సింహద్వారం వైపు పరుగె త్తారు. మిగతా అందరూ వీళ్ళిద్దరి వైపు ఆశ్చర్యంగా చూస్తుండిపోయారు.

ఇంకా సింహద్వారాన్ని సమీపించనేలేదు. ఇద్దరూ

ఒక్కసారిగా బోర్లాపడిపోయారు. ఇద్దరి కడుపుల్లోంచి తుపాకి గుండ్లు దూసుకు పోయాయి.

కళ్ళు మూసుకు పోతుండగా విక్రమ్ తల తిప్పి వెనక్కి చూశాడు. అపర రుద్రుడిలా తుపాకి చేత పట్టుకొని నిలబడి ఉన్నాడు రాజేంద్రన్.

కాని, అంతలో మరో ఘోరం జరిగింది. మిగతా బాసిలు ఏకంగా, ఒక్కుమ్మడిగా రాజేంద్రన్ పై తిరగబడి, చేతిలోని తుపాకి లాక్కొని దానితోనే మోది చంపారు. సెంట్రీలు తేరుకొని కాల్పులు జరిపేలోగా రాజేంద్రన్ ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

నీరసంగా నవ్వి తల వాల్చేసాడు విక్రమ్.

—: ఐ పో యిం ది :—



# [నాలుగవ భాగము]

ప్రక్కగా నడుస్తున్న శాన్యోరాని మోచేత్తో పొడిచాను.

“శాన్యోరా! నువ్వు అలా ఉంటే ఎంత బావుంటావ్” సన్నగా గొణిగేను.

“బ్రూట్!” కోపంగా చూసింది శాన్యోరా.

ఏమీ ఎరగనట్లు ముందుకి నడిచాను.

రకరకాల ఆకులతో, మట్టలతో కప్పబడిన మట్టి గృహాలు కనబడుతున్నాయి నాకు.

ఓ కుటీరంలోకి దారి చూపించాడు నాయకుడు మమ్మల్ని.

చుట్టూ ఏవో రంగులు వేయబడ్డ మట్టిగోడలు.

నులక మంచంలాంటిది ఉంది గదివారగా. దానిమీద జంతుచర్మాలు మెత్తగా పరచబడి ఉన్నాయి.

మూర్ఛ్రడాన్కి కొయ్యదిమ్మలు ఉన్నాయి.

గోడవారగా కొన్ని ఆయిలు డబ్బాలున్నాయి... అవి...?

మంచం క్రిందనుంచి పొడుగాటి చెక్క పెట్టె లాగాడు నాయకుడు...

దాన్ని మంచంమీద పెట్టి తెరిచాడు.

శాన్యోరా, నేను, ఆశ్చర్యంగా వంగి చూస్తున్నాం అందులోకి.

బట్టలు, ఓ తుపాకీ కొన్ని డైరీలు, ఏవో ఇంగ్లీషు గ్రంథాలు ఉన్నాయి.

అవి చదవమన్నట్లు నా చేతిలో పెట్టాడు నాయకుడు.

ఎవరివా డైరీలు?

ఇంతకుముందు ఆ దీవిలో నాగరికుడు ఎవరైనా ఉండేవాడా?

"తినడానికేవైనా పంపిస్తాను.మీరిక్క డేవుండొచ్చు" అని సైగలుచేసి వెళ్ళిపోయాడు నాయకుడు.

నేనూ, శాన్యోరా ఆ డైరీలమీద పడ్డాం.

* * *

"శాన్యోరా! వుయ్ ఆర్ లక్కీ. ఇండియన్ ఓషన్ దాటి అరేబియన్ సీ ప్రాంతాల్లో ఉన్నాం మనం."

"యూ ఆర్ కరెక్ట్ భయంకర్! సముద్ర భూకంపం మనల్ని దారిలోనే లాక్కొచ్చింది. ఏ దక్షిణ ధృవంవైపో కొట్టుకుపోతే దిక్కులేని చావు చచ్చేవాళ్ళం."

సిగరెట్ ముట్టించి మరోటి శాన్యోగాకిచ్చేను.

డైరీ చదవాక మాకన్నో విషయాలు తెల్సాయి.

అది ఆస్ట్రేలియాకి చెందిన ఓ బాటనీ ప్రొఫెసర్ ది.

వృక్షజలంపై పరిశోధనలు చెయ్యడానికి వచ్చాడు.

ఈ దీవి పేరు ఆయన డైరీలో కూడా లేదు.

అప్పుడప్పుడు గుండెపోటు వస్తోందని రాశాడు.

ప్రొఫెసర్ బహుశా దానివల్లే మరణించి ఉండాలి, నెల రోజుల తర్వాత.

ఈ దీవిలోని ఆటవికులను మార్చి నాగరికులను చెయ్యడానికి ప్రయత్నించాడట. వారి అలవాట్లను, ఆచారాలను, మార్చడానికి ప్రయత్నించడం యిక్కడ నేరంగా పరిగణిస్తారట.

బహుశా ప్రొఫెసర్ వల్లే యింగ్లీషు ముక్కలు నాయకుడికి వచ్చి ఉండాలి.

డైరీలో ఆటవిక భాషలోని దైనందిన కార్యక్రమాల్లో ఉపయోగించే పదాలు యింగ్లిషు అర్థాలతో రాశాడు ప్రొఫెసర్. కొన్నిటిని మెదడులో ముద్ర వేసుకున్నాను. మిగతావి పూర్తిగా రాత్రికి వల్లేవేస్తే వీళ్ళతో స్వేచ్ఛగా మాట్లాడ వచ్చనిపించింది.

మరికొన్ని బాటనీ నోట్సులు... సగం చెద పట్టేసి ఉన్నాయి.

అంతలో తలుపు తట్టిన చప్పుడు వినిపించింది.

లేచి తలుపులు తీసాను.

ఓ పదహారేళ్ళ యువతి తామరాకుల్లాంటి వెడల్పాటి ఆకుల్లో ఏవో పళ్ళు తీసుకొచ్చింది. రెండు దొన్నెల్లో ఏదో ద్రవపదార్థం సెగలు కక్కుతోంది.

నల్లగా వుందామె.

కాని, నిగ నిగ మెరిసే ఒళ్ళు.

తలలో చెవిప్రక్కగా పెద్ద పుష్పం ధరించింది.

ఏ అడ్డూ లేని స్తనాల పొంకం చూసి నా గుండె గుబగుబలాడింది.

ఆహారం ఆమె కొయ్యదిమ్మలమీద పెట్టింది.

నేనా ఆటవిక యువతిని గుచ్చిగుచ్చి పరిశీలించడాన్ని చూసి కాన్వోరా నమిలి మింగేయాలన్నంత కోపంతో నాకేసి చూస్తోంది.

"కిమోనో ఊబ్రి" అన్నాను నవ్వుతూ ఆటవిక యువతితో.

ఆమె ఒక్కక్షణం విస్తుబోయింది, నాకా భాష ఎలా వచ్చిందా? అని.

"సాల్కాతో మాచి" అంటూ నడుం వంచి నవ్వుతూ వెనుదిరిగిందామె.

ఆమె నడుం వంచినప్పుడు, వక్షోజాల యాంగిల్ చూసి, నా ఒళ్ళు ఒక్కసారిగా వేడిక్కినట్లయింది.

ఆమె వెళ్ళిన తర్వాత దభాలున తలుపులు మూసింది కాన్వోరా.

"ఏమిటి ఆమెతో మాట్లాడావ్?" కళ్ళలో నిప్పులు కురిపిస్తూ అడిగింది కాన్వోరా.

"రాత్రికి వస్తావా? అని అడిగాను. ఇక్కడేదో పెద్ద గడియారాలున్నట్లు 'ఎన్ని గంటలకు రమ్మంటారు' అని అడిగింది. అంతే!" అన్నాను పగలబడి నవ్వుతూ.

"యూ క్రేజీ యానిమల్" అంది కోపంగా, ఓ పండు నా మీదకు విసురుతూ.

దాన్ని సుతారంగా అందుకొని డైరీలో ఒక పేజీ శాన్యోరాకి చూపించాను.

మొదటి పదానికి 'థాంక్స్' అనీ, ఆమె మాట్లాడిన మాటకు 'నో మెన్షన్' అనీ యింగ్లీషులో అర్థాలు వ్రాయ బడివున్నాయందులో.

ఓడిపోయినట్లు చూసింది శాన్యోరా. మంచంమీద వాలింది వెళ్ళి.

"డార్లింగ్! ఆమెతో మాట్లాడితే నీకు అసూయ కల్గింది. దట్ మీన్స్ యు ఆర్ లవింగ్ మీ..." అన్నాను ఆమె ప్రక్కగా చోటు చేసుకుంటూ.

"డామ్ యువర్ లాజిక్! బయటకు వెళ్ళి ఏ చెట్టు కిందో పడుకో!" కసిరింది శాన్యోరా.

"ఆలోచించుకో! వారంరోజులదాకా తినొచ్చని నన్ను ఏ జంతువో పట్టుకుపోతే నువ్వొంటరిదాని వవుతావ్. ఒక ఆకులో తిని ఒక పాకలో పడుకోవాల్సినవాళ్ళం. మన మధ్య కోపరేషనూ, కోఆర్డినేషనూ వుండాలి" అన్నాను, కోపంతో మరింత అందంగా మెరిసిపోతున్న శాన్యోరా మీద బరువుగా వాలుతూ.

సరిగ్గా అదే సమయంలో...

ఏవో కేకలు వినిపించాయి.

ఇద్దరం అదిరిపడి లేచి కూర్చున్నాం.

ఆ కేకలు బయటినుంచి కాదు.

మా గదిలోంచే...!

* * *

"మెన్యూరా!" అన్నాను ఆశ్చర్యంగా అటకమీదికి చూస్తూ.

"నా పేరు శానోఁ్యరా!" అంది శానోఁ్యరా.

"నో డార్లింగ్! అటు అటకమీది పంజరంలో చూడు. ఆ పక్షిని 'మెన్యూరా!' అంటారు. అవి ఎక్కువ ఆస్ట్రేలియాలో వుంటాయి. అది ప్రొఫెసర్‌దై వుండాలి. నెమలి, చిలుక, కోకిల కల్సి ఈ పక్షిగా అవతరించిందా అని పిస్తుంది. బుద్ధి పుట్టినపుడల్లా మనుషుల కేకల్నీ, రకరకాల పక్షుల కూతలనీ, గొడ్డళ్ళ చప్పుడూ మొదలైనవి చక్కగా అనుకరిస్తుంది. ఇప్పుడు మనం విన్న కేకలు ఆ పక్షి అరిచినదే!" అన్నాను పైకిలేచి పంజరం దింపుతూ.

"ఇంకా నయం. ఏమిటూ అని హడిలి చచ్చాను" అంది శానోఁ్యరా.

"ఇంకా నయం. ఏమితా అని అదిలి చచ్చాను" అంది విచిత్రంగా తలఊపుతూ పంజరంలోని మెన్యూరా.

"భయంకర్. ఇటీజ్ జస్ట్ మార్వెలస్" అంది ఆ పక్షిని వింతగా చూస్తూ. పంజరంలో ఓ పండు పెట్టాను. మెన్యూరా ఆ పండుని టకటక కొడుతూ తినసాగింది.

శానోఁ్యరా, నేనూ ఫలాలు ఆరగించాం. ద్రవపదార్థం దేనితో చేసిందో తెలియదు. ఒంట్లో హుషారు వచ్చినట్లుంది తాగింతర్వాత.

"శానోఁ్యరా! చీకటి పడేలోగా, అలా దీవి తిరిగి వద్దాం. నాయకుడి గూడెంకూడా ఓసారి వెళ్దాం" అన్నాను పైకి లేస్తూ.

"గాడ్ బ్లెస్ యూ!" అంది పక్షి ఏమీ ఎరగనట్లు, మళ్ళీ పండు తింటూ.

అది ప్రొఫెసర్ నేర్పిన మాటలయి వుండాలి. ఇద్దరం నవ్వుకుని బయటికి నడిచాం.

* * *

సముద్రతీరంలో శాన్యోరా, నేనూ స్నానాలుచేసి సిగరెట్లు వెలిగించుకొని కబుర్లు చెప్పుకుంటూ మెత్తని యిసుకమీదుగా నడుస్తున్నాం.

"శాన్యోరా! అటు చూడు" అన్నాను ఓ చెట్టుమీద చూపిస్తూ.

నాలుగయిదు చేపలు కొమ్మలమీద ఎగురుతున్నాయి.

వాటికి చిన్నచిన్న రెక్కలు వున్నాయి.

"ఎగిరే చేపలు" అంది వాటివేపు గబగబా నడుస్తూ.

"చేపలు ఎగరటమేమిటి?" అన్నాను వింతగా.

"అదోరకం చేపలు. సముద్రంలో విసుగు పుట్టినప్పుడల్లా బయటికి వస్తాయవి. కాస్సేపు అటూ ఇటూ తిరిగి ఎగిరి మళ్ళీ నీటిలోకి వెళ్ళిపోతాయి" అంది శాన్యోరా.

"వాటిని పట్టుకుందామా?" అడిగేను.

నవ్వుతూ తల ఊపింది శాన్యోరా.

ఆ కొమ్మమీదికీ, యీ కొమ్మమీదికీ కప్పల్లా ఎగురుతున్నాయా చేపలు. నేనుకూడా కుప్పిగంతులు వేస్తూ నాలుగయిదు చేపల్ని పట్టుకొన్నాను. కాని, అవి చేతిలోంచి చటుక్కున జారి ఎగిరిపోయాయి మళ్ళీ.

మిఠాయిపొట్లం కాకి ఎగరేసుకుపోగా ఏడుస్తున్న కుర్రాడిలా ముఖంపెట్టాను శాన్యోరావేపు చూస్తూ.

"యూ ఫూల్! వంద్రుమట్టి బుర్ర! వాటి రెక్కలు విరిచెయ్యాలి దొరికిన వెంటనే" అంది పకపక నవ్వుతూ శాన్యోరా.

మళ్ళీ గెంతుకుంటూ చెట్లవేపు వెళ్ళాను.

అరగంటలో అరడజను చేపల్ని వేటాడాను.

శాన్యోరా చెప్పినట్లు చేసాను. అవి చచ్చి ఊరుకుని

నా చేతుల్లో మోక్షం పొందాయి.

"ఇవ్వాళ రాత్రికి చేపల పులుసు డార్లింగ్!" అన్నాను చేపల్ని జేబుల్లో కూరుకుంటూ.

అప్పుడే సూర్యుడు అస్తమిస్తున్నాడు. పడమటి ఆకాశం ఎఱుపెక్కుతోంది. "భయంకర్! చాలదూరం వచ్చేసాం. దీవి అంతా చూట్టానికి టైం చాలదు. రేపు మళ్ళీ వద్దాం. చీకట్లో యిలా తిరిగితే ఏ పురుగో, పుట్రో పుణ్యం కట్టుకుంటుంది. లెటస్ మూవ్" అంది శాన్యోరా.

"ఓ. కే" అన్నాను ముందుకి కదుల్తూ.

ఇద్దరం నాయకుడి గూడానికి వెళ్ళాం.

నాయకుడు సాదరంగా ఆహ్వానించి మమ్మల్ని కూర్చోబెట్టాడు.

అతని ప్రక్కగా నిలబడిన యువతికేసి చూసి ఉలిక్కిపడ్డాను.

ఆమే...మాకు ఫలాలు తీసుకువచ్చిన యువతి.

"నా కూతురు జోనా!" పరిచయంచేసాడు నాయకుడు.

నవ్వుతూ తల ఊపాను.

శాన్యోరా బెల్ పాంటులో చెయ్యిపెట్టి ఓ విస్కీ బాటిల్ తీసి నాయకుడి కిచ్చింది. బంగారం రంగులో మెరుస్తున్న విస్కీబాటిల్ అందుకొని మురిసిపోయాడు నాయకుడు.

చేపల్ని జోనాకిచ్చి వండమని సైగలు చేసాను. ఆమె నవ్వుతూ వాటిని తీసుకుంది.

నాయకుడు నన్ను తెల్లవారుఝామునే లేచి, తిమింగలాల వేటకి సిద్ధంగా వుండమన్నాడు.

మరో అయిదునిముషాలు అతనితో మాట్లాడి మా

కుటీరంలోకి నడిచాం.

లోపల తిమింగలం కొవ్వుతో తయారుచేసిన దీపం వెలుగుతోంది. ఇద్దరం అలసటగా మంచంమీద కూల బడ్డాం.

"భయంకర్! రేపు నేనూ నీతో వేటకి వస్తాను" అంది సీరియస్‌గా కాన్యోరా.

"కాన్యోరా! తిమింగలాల వేట చాల ప్రమాదకర మైందని నాయకుడు చెప్పాడు. దానిగురించి మనకేమాత్రం పరిజ్ఞానం లేదు. పోతే వేటకి రావడానికి నేను ఒప్పుకో డానికి రెండు కారణాలు వున్నాయి. ఒకటి, నేను వెళ్ళ నంటే నాయకుడు నాగరికులంతా పిరికివాళ్ళనుకొనే ప్రమాదం వుంది. రెండు, అతనితో కల్సి తిరుగుతూ మరింత స్నేహంచేసి మన మిక్కడ్నుంచి ప్రయాణించ డానికి సలహాలు తీసుకోవాలి, ఏర్పాట్లూ చేసుకోవాలి."

"భయంకర్! నీకేదైనా ప్రమాదం జరిగితే, ఒంటరిగా ఈ దిక్కుమాలిన దీవిలో ఏమయిపోవాలి నేను. అలా గన్నందుకు క్షమించు."

నవ్వుతూ ఆమె భుజాలపై చేతులు వేసాను.

"పిచ్చి కాన్యోరా! యుద్ధంలో చచ్చిపోతానేమోనని నేను ఆర్మీలో చేరానా?"

"అయామ్ సారీ డియర్! నీ వాక్చాతుర్యంతో నన్ను మభ్యపెడుతున్నావ్. నేను రాక తప్పదు" అంది దృఢంగా, తల మరోవైపు తిప్పుకొని పడుకుంటూ.

కాన్యోరాని బలంగా నావైపు లాక్కున్నాను. "ఆల్ రైట్ డార్లింగ్! నేనక్కడ వున్నా నా ధ్యాస ఇక్కడ వుండదన్న గ్యారంటీ లేదు. నాయకుడితో చెప్పి నిన్ను తీసుకెళ్తాను."

"థాంక్యూ!" అంది శాన్యోరా నోరు సున్నాలా పెట్టి.

"ఇట్సాల్ రైట్ డార్లింగ్" అంది మెన్యూరా పక్షి.

"యూ బ్లడీ యిడియట్! నీ పని చూసుకో!" అన్నాను పక్షితో కోపంగా.

"యూ బ్లడీ యిడియట్! నీ పని చూసుకో!" తిరిగి అంది మెన్యూరా.

"అలాగే!" అసహనంగా తల ఊపి, కిలకిల నవ్వు తున్న శాన్యోరా కౌగిలిలో ఒదిగిపోయాను.

శాన్యోరాని నిద్రపుచ్చి మరో గంటతర్వాత లేచాను. తుపాకీ పార్టులు విడగొట్టి చకచకా ఆయిలింగ్ చేసాను. తర్వాత ఆటవిక భాషకోసం దీక్షగా డైరీలు చదువుతూ వుండిపోయాను మరో గంటసేపు.

* * *

సముద్రంలో చిన్నచిన్న కెరటాలు పరిగెడుతున్నాయి.

పాటలు పాడుతూ ఆటవికులు బలంగా తెడ్లు వేస్తు న్నారు.

పడవ మెత్తగా ముందుకి జారుతోంది.

వృద్ధనాయకుడు అసహనంగా కదుల్తున్నాడు.

అప్పటికి సముద్రంమీదకి వచ్చి గంటపైగా అవు తోంది.

ఇప్పటిదాకా చిన్న తిమింగలపిల్లకూడా తటస్థ పడలేదు.

పడవ కదుల్తుంటే తుపాకీ ఓ చేత్తో పట్టుకొని పడవ తాళ్ళు మరోచేత్తో పట్టుకున్నాను.

"తిమింగలం మాంసం తిని ఎన్నాళ్ళో అయింది, నాకు పిచ్చెక్కుతోంది...పదండి ... పదండి ... బద్ధా

యిలూ..." అరుస్తున్నాడు నాయకుడు.

కొద్దిదూరంలో వున్న శానోర్యరా పెద్ద కేక పెట్టింది.

"భయంకర్! ఇటువైపు ఓ తిమింగలం వస్తోంది."

"ఏమిటి అమ్మాయి అంటున్నది?" అడిగాడు నాయకుడు.

ఆమె విసిరిన బైనాక్యులర్స్ అందుకున్నాను. ముందుకి చూశాను బైనాక్యులర్స్ కళ్ళముందు పెట్టుకొని.

ఓ ఫర్లాంగు దూరంలో తిమింగలం యిటువైపే వస్తోంది.

చుంయ్... చుంయ్... అన్న చప్పుడు దూరంగా వినబడుతోంది.

అది తిమింగలం నిశ్వాసాలు.

అవే వాటి ఉనికిని తెలిపే ప్రథమ సూచికలు.

రేంజ్ స్క్రూ సరిచేసి బైనాక్యులర్స్ నాయకుడి కళ్ళ ముందు పెట్టాను.

నాయకుడి ఆనందానికి అవధుల్లేవు.

"లాగండ్రా మొద్దులూ... ఈటెలు సిద్ధం చేసుకోండి..." అంటూ అరిచాడు.

మరో క్షణంలో తిమింగలం ఏనుగులా నీరు చిమ్ముతూ పడవకు ముప్ఫై గజాల దూరంలోకి వచ్చేసింది.

నా గుండె దడ దడ లాడింది.

గుద్దేసుందేమో పడవని!

"శానోర్యరా! బీ కేర్‌ఫుల్ తాళ్లు గట్టిగా పట్టుకో."

అంతే! ఉన్నట్టుండి డప్పుల్లాంటి వాయిద్యాలు దిశలు దద్దరిల్లేటట్లు డమ...డమ... మ్రోగసాగాయి. ప్రత్యేకంగా నియమించిన నలుగురు ఆటవికులు ఆ డప్పు బద్దలు కొడుతున్నారు.

వాళ్ళ వుద్దేశ్యం నాకు అర్థమైంది.

ఢమ... ఢమ... ఢమ... ఢమ... చప్పుళ్లు గుండెలు అదిరేటట్లు వినబడుతున్నాయి.

పడవ వైపుకు వచ్చేస్తున్న తిమింగలం ఆ చప్పుడుకి బెదిరి ప్రక్కగా తిరిగింది. ఆ తిరగడంలో పడవను రాచుకుంటూ వెళ్ళింది.

క్షణంలో ప్రమాదం తప్పింది. ఒక్కసారిగా పడవ ఎడంవైపుకు వాలిపోయి మళ్ళీ యధాప్రకారం వాలిపోయింది.

నాయకుడు ఆటవిక భాషలో, నేను డైరీల్లో చదవని పదాల్ని ఉచ్చరిస్తూ అరిచాడు.

తిమింగలం అప్పుడే నీటిలో మునక వేయబోయింది.

అప్పటికే ఆలస్యం అయింది.

అంతే! దాదాపు నలభై ఈటెలు రివ్వున గాల్లోకి ఎగిరాయి.

అదే సమయంలో తుపాకీ, తిమింగలం ముఖాన్కి గురిపెట్టి రెండుసార్లు పేల్చాను.

ఏ ఒక్కటో, రెండో, ఈటెలు లక్ష్యం తప్పి సముద్రంలో పడ్డాయి.

మరో రెండు ఈటెలు దాని శరీరం మీదుగా జారి, సముద్రంలో పడ్డాయి.

మిగతావన్నీ సూటిగా తిమింగలం శరీరంలో నాటుకున్నాయి.

తిమింగలం_ఇప్పుడు పర్వతం లాంటి ముళ్ళ పందిలా అగపడుతున్నది.

సాగర భీభత్సం చేస్తూ తిమింగలం బాధగా పొర్లసాగింది.

అది నీటిలో దెబ్బతిన్న యుద్ధనౌకలా వుందిప్పుడు.

"కొంచెంసేపటిలో మరణిస్తుంది" అన్నాడు గర్వంగా బుగ్గమీసాలు సవరించుకుంటూ నాయకుడు. "కొంచెం దూరంగా నడపండిరా మొద్దులూ! సగం ప్రాణంతో లేచి మనమీద పడగలదు" హెచ్చరిక చేసాడు నాయకుడు.

పడవ వెనక్కి కదిలింది.

తిమింగలం శరీరంనుంచి ఎఱ్ఱని వరదలు కొండలమీంచి జాలువారే జేగురు సెలయేళ్ళలా ప్రవహిస్తున్నాయి.

బాధాగ్రస్తమైన దాని శరీరం నెత్తురులో పొర్లుతోంది.

కొన్ని ఫర్లాంగుల దూరం సముద్రంలో విస్తరించింది రక్తం. సముద్రం మధ్యలో వెలసిన ఆ ఎఱ్ఱ సరస్సులో పడ్డ సూర్యకిరణాల అరుణ కాంతులలో అందరి ముఖాలు ఎఱ్ఱగా కనబడుతున్నాయి.

అంతసేపూ, ఒకదానివెంట ఒకటిగా నీటిబుడగల వరుసలు తిమింగలం శరీరంనుండి క్షణంక్షణం నశిస్తూ, పైకి వస్తూనేవున్నాయి.

సంతోషంతో పిచ్చికేకలు వేస్తున్నారు ఆటవికులు.

"తర్వాతేం చేస్తారు?" ఆతృతగా అడిగేను నాయకుడ్ని.

"నీకు మా భాష బాగానే వచ్చింది. నీ తుపాకీగుళ్ళు దాని మొండానికీ, తలకీ మధ్య తగిలేయి" అన్నాడు నాయకుడు నా భుజం తడుతూ.

నవ్వి ఊరుకున్నాను.

"తిమింగలం ఎంతో పెద్దదయినా, దాని తలకాయ

చాల తేలికగా ఉంటుంది. తిమింగలం శరీరంలో చాల తేలికైన భాగం అదే! అందువల్లే అది సునాయాసంగా దాన్ని గాల్లోకి ఎత్తుతుంది. యిప్పుడు ఆ తలకాయను ఉచ్చు వేసి మన పడవ దగ్గరగా లాగుతాం.'' అంటూ నాయకుడు వెనుదిరిగి ఆటవికులకు గబగబా ఆజ్ఞలు జారీ చేసాడు.

శాన్యోరా ''అబ్బ! గండం గడిచింది'' అంటూ నా వెనక్కి వచ్చింది.

పడవ తిమింగలం వేపు కదిలింది.

ఇప్పుడు దాని శరీరంలోంచి నిశ్వాసానికి సంబంధించిన నీటి ధారలు రావడం లేదు. అంటే అది మరణించిందన్న మాట!

బలమైన త్రాళ్ళు తిమింగలం వేపు విసిరారు ఆటవికులు. అవి దాని తలకు ఉచ్చులు పడ్డాయి.

సరిగ్గా అదే సమయంలో మరోవైపు నుంచి తాళ్ళు వచ్చి అదే భాగంలో ఉచ్చులు పడ్డాయి.

అంతా అదిరిపడి అటువేపు చూశాం.

*　　*　　*　　*

తిమింగలం అవతలవేపు మరో నాటు పడవ ఆగివుంది. అందరూ ఎఱ్ఱని దేహాలతో, కండలు తిరిగిన మనుషులు వున్నారు. ఒళ్ళంతా విచిత్రంగా రంగులు పూసుకొని వున్నారు.

—(సశేషం)

# సప్లిమెంట్ పోటీ - 30

స, రి, గ, మ, ప — అక్షరాలను తీసుకొని మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

|  |  |  |  |  |
|---|---|---|---|---|

మా ఆఫీసులో సీలు చేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు మే' 77 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *

# "కథ అడ్డం తిరిగింది"

డిటెక్టివ్ నామాలు తన నామాలు అద్దంలో ఓసారి చూచుకొని తృప్తిగా నవ్వుకొని గుమ్మానికి వేలాడుతున్న డోర్ కర్టెన్ సున్నితంగా తొలగించి తన ఆఫీసు గదిలోకి అడుగుపెట్టాడు.

ఎదురుగా కనిపించిన వెంకటేశ్వరస్వామి విగ్రహానికి భక్తి ప్రపత్తులతో నమస్కరించి పంచె సవరించుకొని కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా ఆనాటి దినపత్రిక వుంది. టేబుల్ పైనుండి తీసి విలాసంగా పట్టుకొని చదువ సాగేడు.

టక్కున అతని కళ్ళు ఓ వార్తపై నిలిచిపోయాయి. "ప్రఖ్యాత డిటెక్టివ్ యతిరాజు అద్భుత పరిశోధన" అన్న హెడ్డింగ్‌తో బోర్డర్ లైన్స్‌చేసి ప్రకటించారా వార్తను. ఆత్రంగా చదవసాగాడు నామాలు.

"హైదరాబాద్. నవంబర్ 4. తనను హత్యచేస్తానంటూ ఫోన్‌చేసిన వ్యక్తిని రెండు గంటలలోగానే పట్టుకొని పోలీసుల కప్పగించిన ఉదంతం ఒకటి నిన్న జరిగింది. నగరంలో పేరుపొందిన డిటెక్టివ్ శ్రీ యతిరాజులకు నిన్న రాత్రి 8 గం. ఒకతను ఫోన్‌చేసి చంపుతానని బెదిరించాడు. అయితే శ్రీ యతిరాజు అద్భుతమైన మేధాసంపత్తితో ఆ

వ్యక్తిని రాత్రి షుమారు పదిగంటల ప్రాంతంలో సికింద్రాబాద్ స్టేషన్‌వద్ద బంధించారు. మిగతా వివరాలు 5వ పేజీలో...."

తక్కిన వివరాలు చదవాలనిపించలేదు నామాలుకి. కళ్ళ ముందు తన జీవితం గిర్రున తిరిగింది.

పదినెలలయింది బోర్డుపెట్టి. ఒక్క వెధవన్నా వచ్చి చావలేదు. 6 నెలల క్రితం ఓ వెధవ వచ్చి తను లోనికెళ్ళింది చూచి విలువైన తన చైనామేడ్ హీరో పెన్ను తస్కరించాడు. మరో త్రాష్టుడు అందంగా ఇంటిముందు పెట్టుకున్న బోర్డు పీక్కుని చక్కా పోయాడు. రాస్కెల్.... పోలీసు వెధవలు వీళ్ళను ఎందుకిలా వదలిపెడుతున్నారు? నామాలుకి కామాలు, ఫుల్‌స్టాప్‌లు లేకుండా బోలెడు ఆలోచనలు వచ్చాయి.

రివ్వున వచ్చి ఓ రాయి నామాలు గుండుకి తగిలింది "బాబోయ్" అంటూ అరిచాడు డిటెక్టివ్. నెత్తి తడుముకున్నాడు. బొప్పికట్టింది. నామాలుకి ఏడ్పు వచ్చింది. కోపంగా రాయికేసి చూశాడు. వేసిన వెధవను దొరికించుకోవాలని అతని మనసు తొందరపడింది. కాని, రాయిని చుట్టుకొని ఓ కాగితం వుంది.

కాగితాన్ని విప్పి ఆత్రంగా చదివేడు. అతని మనసు పరికి పరుగులు తీసింది.

"డిటెక్టివ్ నాయనా!

"ఎందుకు నీకీ పిచ్చి. వళ్ళు తిమ్మిరిగా వుంది కాబోలు. ఓసారి నా తడాఖా చూపమంటావా? పోనీలే....నీ ఎదురుగానే వున్నాను. నన్ను తెలుసుకో చూద్దాం నీ తెలివి...."

నామాలు బుర్ర కాసేపు మొద్దుబారింది. "ఎవడీడు? పేరు పెట్టుకోలేదే. తడాఖా చూపుతాడట. నా కొడకా....రా.... నీ భరతం పడతా....ఇన్నాళ్ళకి నా మేధస్సుకి పని తగిలింది. రేపటి పేపర్లో నా ఫొటో పడడం ఖాయం" అనుకుంటూ ఫింగర్‌ప్రింట్స్ ఏమైన దొరుకుతాయేమోనని భూతద్దం తెచ్చి పరిశీలించసాగాడు.

ఫైర్ ఇంజన్‌లా మోగింది ఫోను. ఉలిక్కిపడ్డాడు డిటెక్టివ్. చేతిలోని భూతద్దం జారి క్రిందపడి పగిలింది. "ఖర్మ" అనుకుంటూ నెత్తి కొట్టుకున్నాడు. బొప్పికట్టిన చోట తగిలి మరింత బాధ కలిగింది. "అబ్బా" అనుకుంటూ ఫోన్ ఎత్తాడు.

"డిటెక్టివ్ నామాలు స్పీకింగ్ హియర్!"

అవతలినుండి నవ్వు వినిపించింది. నర్వస్‌లా ఊపిరి బిగపట్టాడు.

"రంగంలోకి దిగాడు రాస్కెల్" మరోసారి నవ్వు వినిపించింది.

"మీరేనని తెలుసులెండి" మరోసారి నవ్వు. ఆడదాని గొంతులా వుంది. బాపిసీడు H.T.C, కామ్మోరి విదేశీ ఏజంట్స్ ఇలాగే మాట్లాడుతార్ట!

"వుంటారో వుండరోనని అనుకున్నాను."

నామాలు మాట్లాడలేదు. అవతలి వ్యక్తి గొంతే విన్పించింది.

"మాట్లాడకుండా అలా వున్నారేం! ఈ విధంగా ఫోన్ చేశానేమిటని ఆశ్చర్యపోతున్నారా....సరే.... వెంటనే వస్తున్నాను. ఎక్కడికీ వెళ్ళకండి...." ఫోన్ పెట్టేసిన శబ్దం అయింది. రిసీవర్ హూక్‌పై వుంచాడు.

చెమటలు పట్టాయి. నిలువునా వణికిపోతున్నాడు. రివ్వున పరుగెత్తి బీరువా తెరవబోయాడు. తెరుచుకోలేదు. కంగారు పుట్టింది. రివాల్వర్ అందులో వుంది.

బలంగా తలుపుల్ని లాగాడు. విసురుగా తెరుచుకున్న తలుపులు నామాలు నుదురును ముద్దెట్టుకున్నాయి. విశ్వరూపం కన్పించింది నామాలుకి. గిర్రున తిరిగింది ప్రపంచం. రెండు నిమిషాల్లో తేరుకొని బీరువాలోనుండి రివాల్వర్ తీసికొని మాగజైన్ తెరిచి చూశాడు. బుల్లెట్స్ లేవు. బాక్సాంతా వెదికాడు. బుల్లెట్స్ కనిపించలేదు. "మైగాడ్! ఏమిటి చేయడం? వాడీపాటికి వచ్చేస్తుంటాడు. ఎలాగు మరి" మూలకి వెదురుకర్ర కనుపించింది. అది తప్ప మరో ఆయుధం దొరికేలా లేదు. కర్రతీసి చేతపట్టుకున్నాడు. "తలపై ఒక్కదెబ్బ పెడితే ఫరవాలేదు. పనికి వస్తుంది" అనుకుని తలుపులదగ్గిర గోడ నానుకుని నక్కాడు.

నిముషాలు భారంగా గడుస్తున్నాయి. నామాలు గుండెలు భయంకరంగా కొట్టుకుంటున్నాయి. వేసుకున్న లాల్చీ, పంచె తడిసి ముద్దయినాయి. అడుగుల చప్పుడు విన్పించింది. మెల్లెక్కి వస్తున్న చప్పుడు. మరునిమిషంలో తలుపులు తెరుచుకున్నాయి.

లోనికి అడుగుపెట్టిన ఆకారంపై "హమ్మ్" అంటూ బలంగా దెబ్బవేశాడు నామాలు, భయంకరమైన కేక. నామాలు చెవులు గింగురుమన్నై! ఆ వ్యక్తి స్త్రీ. నేలపై పడిపోయింది.

తెలివి తెచ్చుకుని చూశాడు. గుండె ఝల్లుమంది. ఆవిడ తన భార్య!

"కొంపదీసి బస్ దిగి వస్తున్నానని ఫోన్ చేసింది తన భార్య కాదు గదా? మరి ఆ ఉత్తరం రాసిందెవరు?" తనలో

అనుకుంటున్నట్టుగా పైకే అనేశాడు. నామాలుకు సర్వ జ్ఞానాలు నశించినాయి.

"నేనే నాన్నా! నువ్వు ఉత్తిగా ఉండడం ఇష్టంలేక అలా వ్రాపి రాయి నీపై వేసి బజారుకెళ్ళాను. ఉత్తరంలో 'నాయనా!' అంటూ ఆధారం కూడా ఇచ్చాను. ఇలా అవుతుందనుకోలేదు" అంటూ వచ్చాడు ఏడవ తరగతి ఫేలైన మాస్టర్ నామాలు. తెల్లబోయాడు మిస్టర్ నామాలు.

—డి. వి. కృష్ణమాచార్యులు, సూర్యాపేట.

## లవ్‌లెటర్ - కథ!

రంగనాథం ఆఫీసులో గుమాస్తా. జగన్నాథం అతని సెక్షన్‌లోనే పన్చేస్తున్నాడు.

ఒక రోజున రంగనాథం ఏడుపు మొఖంతో ఆఫీసుకు వచ్చాడు. జగన్నాథం ఏమైందని అడిగాడు.

"నిన్నరాత్రి మన ఆఫీసులో టైపిస్ట్ సరోజకు లవ్ లెటర్ వ్రాస్తుంటే, మా ఆవిడ చూసి కేకలేసింది," అన్నాడు.

"అదా! అది నీవు వ్రాస్తున్న ఒక కథలో భాగమని చెప్పు" అని సలహా ఇచ్చాడు జగన్నాధం.

మర్నాడు జగన్నాధం ఒక బండెడు తెల్లకాగితాలూ, పిరాబుడ్లూ, కలాలూ, కొని ఇంటికి తీసుకుపోతుంటే రంగనాధం చూపి, ఆశ్చర్యంతో ఏమిటని అడిగాడు.

"నిన్న నువ్వు కధలు రాస్తున్నట్టు మీ ఆవిడతో చెప్తే, ఆవిడ మా ఆవిడతో చెప్పిందట. అప్పట్నించి నన్ను కథ రాయమని పోరుతోంది," అన్నాడు జగన్నాధం ఏడుపు ముఖంతో.

—టి. కె. శివకుమారశర్మ, గుంటూరు-2.

